

ఒక బీమా ఏజంటు డైరీనుండి
* ఇందులో చేర్చ బడిన వ్యక్తుల ఆత్మగౌరవ, సంరక్షణకై, యీ పేర్లు కల్పితమే. కాని యీ కథ మాత్రం నిజమైనది.
ఆ సాయంకాలం వార్తా పత్రికలో......
ఒక వార్త యీ విధంగా వచ్చింది. "శ్రీ. ఆనంద్ ఘోష్, మ్యునిసిపల్ "ఆర్కి-టెక్ట్", అంబాలా రోడ్డుపై సైకిల్ పై పోతూండగా కారు ప్రమాదం వలన మరణించారు. ఆయన నొక "బస్సు" కి కొన్నట్లుగా తెలుస్తోంది."
ఆ సాయంత్రం యీ వార్త చదువుతూండగా యీ మాటలు నా కళ్లముందు దీపాల గుంపుల్లా కన్పించ సాగాయి. ఘోష్ నాకు బాగా పరిచయం, రెండు నెలల క్రితమే ఆయనకో జీవిత బీమా పట్టాను అమ్మాను.
ఆనాటి యీ భయంకర వార్త శ్రీమతి ఘోష్ జీవితాన్నే స్తంభింప చేసిందని చెప్పాలి. ఆ విచార సమయంలో ఆమెకు ఎంత కొంచెం ఓదార్పు అయినా దొరకడం అసంభవం. కాని ఆమె భవిష్యత్తు మాత్రం మంచి చేతుల్లో ఉంది— రెండు నెలల క్రితం ఆమె భర్త చేసిన దూరాలోచనను అభినందించాలి. ప్రమాద మరణ బీమాతో కూడిన "మల్టిపర్పస్" పాలసీ క్రింద ఆయన నెలకు 60 రూ॥లు పెట్టుబడి పెట్టడం వలన ఆమెకు, నిజం చెప్పాలంటే, "క్లెయిమ్" పరిష్కరణగా తక్షణమే దాదాపు 11,000 ల రూపాయలు నిశ్చితముగా ముట్ట చెప్పబడినవి. ఇంకా దానితో పాటు నెలకు రూ 200 ల చొప్పున రెండు సంవత్సరాల వరకు, నెలకు 100రూ॥లు చొప్పున వచ్చే 20 సం॥రాల వరకు, యింకా యీ వ్యవధి గడచిన తర్వాత, 8,000 రూపాయలు, ఒక సంవత్సరపు బోనస్సు అంతా. వెరసి మొత్తం 48,800 రూ॥లకు పైగా ఆమెకు ముట్టగలదు. పతిని కోల్పోయిన ఆమె విచారాన్ని తొలగించడానికి ప్రత్యేకంగా నేనేమీ చేయలేక పోయాను, కాని ఆమె, యిద్దరి బిడ్డల భావి సుఖాన్ని భద్రతను జాగ్రత్త చేసే సహాయం మాత్రం నేను చేయ గల్గాను.
లైఫ్ ఇన్స్యూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా

సంవత్సర చందా
రు. 12-0-0
విడిపత్రిక 25న.పై.

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

**Founder : K. NAGESWARA RAO**

సంపుటము 51
సంచిక 38
22-5-57

హేవిళంబి వైశాఖ బహుళ అష్టమి బుధవారం


## విషయానుక్రమణిక




బుడుగూ! చిచ్చులపిడుగూ!

చాలాబోల్డు రోజుల్నించీ నీఖదలన్నీ నేను చదివాను. నాపేరు జమ్మి సుశీలారాణి. మా నిఝంవూరు గుండుగొలను. రేపో మా [illegible] నీకు ఉత్తరంరాద్దామని అయిడియావచ్చింది నాకు. అయిడియాలూ, అభిప్రాయాలూ నీదగ్గిరేవున్నాయిగా. నీకు ఖదలూ, ఖబుర్లూ చెపటం బాగావచ్చునని నా అభిప్రాయం. నాకూ బోల్డుఖదలు వచ్చును గానీ నీలా చెపటం నాకురాదుగా మరి! నాకు నువ్వంటేనూ రాధ అంటేనూ సీగానపెసూనాంబఅంటేనూ చాలాయిష్టం. మొత్తంతా తీంచుకున్న ఫొటోలో నువ్వూ రాదాయే బావున్నారు. సీగానపెసూనాంబ ముద్దొచ్చింది. ఫొటోలో పక్కింటిలావుపాటి పిన్నిగార్ని చూస్తే కోపంవచ్చింది. కోపం అంటే బయంఅని నీకుతెలుసుగా. మరి బామ్మన్నా నాకుకోపమే. ఎందుకంటే బామ్మ అస్తమానం చిన్నవాళ్ళకి ప్రెవేటు చెప్పేస్తుందికదా! అందుకు. నాన్నా అమ్మాయితే మన్నిరక్షిస్తారు గనక మనకి చాలాబోల్డు యిష్టం. యేం. ఇప్పుడు మరి బడికి సెలవులిచ్చేరుకదా! నువ్వు మళ్ళీ బళ్ళోకి వెళ్ళటంకోసం అల్లరిమానెయ్యాలనుకుంటున్నావు కదా, నేను నీకో మంచి అయిడియా చెపనా. నువ్వు నిన్నో రేపో ఝుబగబా మెడ్రాస్ రైలుబండీఎక్కి తిన్న..గా మా వూరువచ్చేసేయ్. ఎందుకంటే యిక్కడయితే అల్లరిమానక్కర్లేదు. మరీ ప్రెవేటు చెప్పేసే బామ్మలేదుగాని ఇక్కడో మేష్టారు వున్నారు. అల్లాని అపుడేబయపడకు. ఆయన బయంవెయ్యకుండా మెట్టికాయలు మొత్తెయ్యకుండా మంచిమంచి ఖదల్లాగా పాటాలు చెప్పేస్తారు. మధ్యమధ్యని బటాణీలుకూడా పెడతారనుకో. నువ్వుకూడా చెప్పేఖదలన్నీ విని యిలాగాతిగానవ్వేస్తారు. అంతమంచి మేష్టారు. అంచాత ఇక్కడ చేరిపో పదిరోజులుండి వెళ్ళిపోదుగాని ఒచ్చేటప్పుడు రాదానితీసుకుని వచ్చేసెయ్. అంధరికన్నా అమ్మే భాలామంఛిది అన్నావు గదూ! అందుకు. అన్నట్టు నీతో సీగాన పెసూనాంబకూడావస్తే మరీబెస్టు. ఇక్కడ దానికోసం బోల్డుకుంకుడుపువ్వులవీ ఉన్నాయిలే. మరి రెండుజడల సీతకూడా ఓటి వుంది. పక్కింట్లో లావుపాటి పక్కింటి పిన్నిగారు (ఆవిడ మగుడు బీడీలు కాలుస్తాడులే.) నువ్వు చెప్పిన ఖదలన్నీ విన్నారుగదా; విని "హారా! బుడుగూ! బుడుద్దాయీ! నీకన్ని అయిడియాలు! జెటకాతోలటం వచ్చురా! ఇపుడిరోజులయూకా నువ్వీడుంటే నీకోనిఝంజెటకా కొనిపెడతాలేఅమ్మా తోలుకో! అయితే బీడీలుమటుకు కాలచకూ!" అని చెప్పమన్నారు నీతో విన్నావా మరి. పిన్నిగారు నిఝంగా జెటకాకొనిపెడితే (అబద్ధమే కానని అనుమానం) కొఝూ జెటకాతోలుకొని ఝామ్మంటూ బజారుకీ, కాలవగట్టుకీ టకటకా షికారుకెళ్లిపోవచ్చు. కాలవలో చేపలుకూడా బోల్డున్నాయిలే. నువ్వుచెప్పిన అలాడీన్ ఖద సినిమాయిక్కడ వుందిలే. ఇక్కడంటే యీ వూళ్ళోకాదు, ఇంకో రైలెక్కి ఇంకో వూరెడితే అక్కడ లక్ష్మిటాకీసులోవుంది. అంజలీ నాగేసరావూ అక్కడ సినిమా వేస్తారుతే. ముందస్తుగా మనం ఆసినిమా చూసేద్దాం. నీకు ఇంకోసంగతి చెప్పాలి మరి. మళ్లీ నువ్వు అనక నిఝం చెప్పేస్తే తేంజరు మరి అంటుకని. ఏమిటంటే యీ వూళ్లో అంత పెద్దముయ్యద్ద అత్తయ్యగారు ఓటివుందిలే. ఆవిడకి యీంతేంత పే...ద్ద జెడ వుంది. అది నిఝం జెడకాదుగా మరి. (ఇదినిజం) సవరంజెడ. మాడొప్పదో సవరాలజెడ అయినా అది నిఝం జెడేనని మనం అబద్దం చెప్పెయ్యాలి. నిఝం చెపితే నిన్నూ నన్నూ మొకేస్తుంది; లాపోతే కోకేస్తుంది అంతే. అన్నట్టు ఇంకో సంగతి జ్ఞాపకం వొచ్చింది నాకు. నువ్వు కుక్కని పెంచుకుందామనుకున్నావుగదూ! ఇక్కడో మాంఛికుక్క వుందిలే నీమాట వినేది. ఓసారి ఏందుకో దానికి ఖోపంవచ్చి యిల్లా మూతి పెట్టి ఏడుస్తూ అరుగు ఛివ్వరపడుక్కుంది. యేం. అప్పుడు దాన్ని బంగారుతండ్రి బుడుగుఖద వినమ్మా చెపుతాం అని చెప్పేం. అది ఖోపంపోయి వినేసి వచేసి తోక వూపేసింది. "మళ్ళీబుడుగు ఖదలు ఎప్పుడు చెపుతాడు" అంటోంది. నువ్వేసిన ప్రతి ఎగిరేపచ్చులు బొమ్మ మాశాను నేను. నేనూ అల్లాటి బొమ్మలు ఎనభైతొంభై వెయ్యగలను అనుకో. నువ్వేసిన పచ్చులు ప్రతి యిక్కడ దొడ్లో జాంచెట్టెక్కి కూచున్నాయి. పైగా నేమో అవి "క్వటిక్ క్వక్ పటిక్ కిక్," (అంటే తెలుగర్ధం బుడుగు మళ్లీ ఎప్పుడు వస్తాడు) అని అడిగేసి పారిపోతున్నాయి. కనక నువ్వు మళ్ళీ ఛప్పున ఖదలు చెప్పాలి. యీ వూరు కూడా రావాలిమరి. యేం. ఉత్తరం రాయి. బొమ్మలుకూడా వేస్తావుగా (హింక కాలుత్తరం అయిపోహింది)★

# సంగమ్మకోట

## 1

ఒకప్పుడు, విద్యానగర సామ్రాజ్యాధీశు లయిన ప్రౌఢదేవరాయలవారు రాయచూరులో ఒక బలిష్టమయిన కోట నిర్మించ సంకల్పించారు. ఆ మహాత్కార్యనిర్వహణకి ఆయన తన సర్దారులలోకెల్ల ఘనుడైన కోటారెడ్డిని నియోగించారు.

రాజాజ్ఞను శిరసావహించి కోటారెడ్డి రాయచూరు వెళ్ళి, అక్కడ ఒక శుభ ముహూర్తాన కోట నిర్మాణానికి శంకుస్థాపన, ప్రారంభోత్సవమూ చేయించాడు. రాయచూరులోని ప్రజలంతా తమ నివాసభూమి మీద ఒక గొప్పకోట నిర్మితమవుతున్నందుకు ఎంతో సంతోషం వెలిబుచ్చారు.

నిర్మాణస్థలం మధ్యగా డేరా వేయించుకుని కోటారెడ్డి పని అంతా తిలకిస్తున్నాడు. మధ్య మధ్య నిర్మాణ విధానాన్ని పరిశీలిస్తూ అసంఖ్యాకంగా పనిచేస్తున్న మేస్త్రీలనూ, పనివాళ్ళనూ హెచ్చరిస్తున్నాడు. ఆనాడు ఉత్సాహంగానూ, చురుకుగానూ పని సాగింది.

తర్వాతకూడా నిర్విఘ్నంగా పని కొనసాగింది. అచిరకాలంలోనే బలమైన పునాదులూ వాటిమీద కోటగోడలూ, బురుజులూ చాలా ఎత్తుగా లేచాయి. ఇంక కొద్దికాలంలోనే పని పూర్తి అవటానికి ఎలాటి సందేహమూ లేదు.

ఆనాటి రాత్రి కోటారెడ్డి చాలాసేపు మేలుకునే వున్నాడు. త్వరలో పూర్తి అవబోయే కోటనూ, తర్వాత తనకు జరగబోయే సత్కారాల్నీ గురించి ఎన్నో ఊహాసౌధాల్ని నిర్మించుకుంటూనే నిద్రపోయాడు. డేరాలో అతను కిటికీ పక్కనే శయ్యమీద పడుకున్నాడు. కిటికీలోంచి వెన్నెల అతని ముఖంపై పడుతోంది. అతను కనే తియ్యటి కలల ఫలితంగా ముఖంలో దరహాసరేఖలు వ్యక్తం అవుతున్నాయి.

అది అర్ధరాత్రి సమయం. ఏదో పిడుగులాటి శబ్దానికి కోటారెడ్డి ఉలికిపడి లేచాడు. కునికిపాట్లుపడుతూ గుడారం దగ్గిరున్న కావలివాళ్ళూ, కోటలోపల అక్కడక్కడా నిద్రిస్తున్న పనివాళ్ళూ కూడా అలాగే మేల్కొన్నారు. కోటారెడ్డి యీవలికి వచ్చి, వాళ్ళంతా కంగారుగా అటూ, యిటూ తిరుగుతుండటం గమనించాడు.

ఇంతలో అక్కడి పహరావాడొకడు వచ్చి కోటారెడ్డితో ఆత్రంగా అన్నాడు. "బాబూ, కోటారెడ్డిగారూ! అంతా నాశనమైపోయిందండీ. ఏం మాయో తెలీదు, కోట మొదలంటూ కూలిపోయిందండీ!"

కోటారెడ్డి ఆశ్చర్యంగా, "అఁ! ఏమిటీ, కోటంతా కూలిపోవటమే! నాకేమీ అయోమయంగావుంది. పద, చూదాం!" అంటూ అతన్ని వెంటఁబెట్టుకు వెళ్ళాడు.

కొద్దిక్షణాల్లో కోటారెడ్డి అంతా పరిశీలించి తిరిగి వచ్చాడు. గుడారానికి పిడుగుపాటు కాదు; ఫిరంగి దెబ్బ కాదు, మరేదీ కాదు. కోటమాత్రం కూలిపోయింది. కోటారెడ్డి ఆ క్షణమే రాయలవారివద్దకు యీ వార్తతో దూతని పంపాడు.

కాశిరాజు
వీరరాఘవరావు

## 2

ఆరాత్రి రెడ్డికి నిద్రపట్టలేదు. పనివాళ్ళంతా కూడా చింతాక్రాంతులై మేలుకునే వున్నారు. రెడ్డి తెల్లవార్లూ కర్తవ్యంతోచక తికమకపడ్డాడు. తెల్లవారింది. ధైర్య, స్థైర్యాలు కూడదమ్ముకుని ఆలోచించగా తిరిగి కోటను నిర్మించటమే కర్తవ్యంగా తోచిందతనికి. ఆవేళ అతనికి తిండికూడా సహించలేదు.

దూత శరవేగంతో రాయలవారివద్దకు యీ వార్తతో వెళ్ళి ప్రొద్దుప్రాలకుండా తిరిగివచ్చాడు, జవాబుతో. రాయలవారు కూడా కోటారెడ్డి అనుకున్నట్టే పట్టుదల వహించి కోట పునర్నిర్మాణం సాగించవలసిందిగా సందేశం పంపారు.

ఆక్షణమే కోటని తిరిగి నిర్మించటానికి పూనుకున్నాడు కోటారెడ్డి. పనివాళ్ళు నిర్మాణం ప్రారంభం చేశారు. కోటారెడ్డి పహరావాళ్ళతోసహా వెయ్యికన్నులతో రాత్రింబవళ్లు కనిపెట్టి తిరగసాగాడు. మళ్ళీ కొంతకాలానికి పూర్వంలాగే కోటగోడలూ, బురుజులూ చాలాయెత్తు లేచాయి. నిర్మాణం చాలావరకు ముగిసింది. పహరావాళ్లు వంతులప్రకారం కాపలా కాస్తున్నారు. కోటారెడ్డి పగలు మాత్రం స్వల్ప విశ్రాంతి తీసుకుంటూ రాత్రిళ్లు మేలుకుని వుంటున్నాడు.

ఒక అర్ధరాత్రి ఆకాశం నిర్మలంగా వుంది. అది కృష్ణపక్షపు రోజులవటంవల్ల నక్షత్రాల గ్రుడ్డివెలుతురు తప్ప మరేంలేదు. నిర్మలాకాశంలో ఒక తెలిమబ్బు మాత్రం మందగమనంతో కోటదిక్కున రాసాగింది. అది కోటారెడ్డికి కనపడింది. కాని, అతనది మబ్బనుకున్నాడు. అది రాను, రాను, మానవాకృతిగా తయారైంది. జాగ్రత్తగా చూస్తే అది, తలపై ముసుగూ, నడికట్టూవున్న స్త్రీ ఆకృతిగా కానవచ్చింది. మబ్బులు అనేక ఆకృతులుగా మారటం ఉన్నదే. కాని అంత స్పష్టంగా స్త్రీ ఆకృతిగా అవటం రెడ్డికి విచిత్రంగా తోచింది. అలా చూస్తుండగానే ఆ ఆకృతి దగ్గిరగావచ్చి కోట గోడలు నాల్గింటినీ అతి తొందరగా తన్నగానే పూర్వంలాగే కోట కూలిపోయింది. మొదలంటు నాశనమయింది. రెడ్డి అదేదో మబ్బు అనుకున్నాడు కాని ఆ విచిత్రాకృతి కొంపదీస్తుందని ఎలా అనుకుంటాడు? అక్కడి వాళ్ళంతా కాగడాలతో అటూ ఇటూ పరుగెత్తసాగారు.

రెడ్డి అలాటివి చూసి బెదిరిపోయే రకం కాదు. మహాధైర్యవంతుడు. అప్పుడే కోట ఆవరణను దాటివెళ్ళే ఆ ఆకృతిని చూసి ఆ ప్రక్కనున్న బల్లెం చేతబుచ్చుకొని ధైర్యంగా "ఆగు నువ్వెవరవో చెప్పు. ఎందుకిలా చేశావు. జవాబు చెప్పకపోతే నిన్నేం చేస్తానో తెల్సా?" అన్నాడు.

వెంటనే ఆ ఆకృతి వెనక్కి తిరిగివచ్చి, అక్కడున్న పనివాళ్ళలో ఒక స్త్రీని ఆవేశించింది. ఆ స్త్రీ గంతులువేస్తూ "హాహ్హాహ్హాహ్హా! నీలాటివాళ్ళ నెందర్నో చూశాను. నన్ను నువ్వేమీ చేయలేవు తెలుసుకో!" అంటూ విరుచుకు వెనక్కి పడిపోయింది.

అక్కడివాళ్లామెను లేవదీసి పట్టుకుని గుగ్గిలం, సాంబ్రాణి ధూపం వేశారు. "నువ్వెవరవో ఏం కావాలో చెప్పి తీసుకుని,

"నీదారిని నీవు వెళ్ళక ఏమిటే అసహ్యపు పనులు" అన్నాడు కోటారెడ్డి.

అప్పుడామె, "నాకేం కావాలో ఇస్తావట్రా? నా చిరకాల వాంఛితాన్ని తీరుస్తావట్రా? అయితే చెపుతా విను! నేను బాలెంతదయ్యాన్నిరా. నాకొక తల్లీ, పిల్లా నరబలి కావాలిరా. అదియిస్తే నీపని నెరవేరుతుంది. లేకపోతే లేదు." అంటూ ఆదయ్యం ఆ స్త్రీని వదలి పూర్వాకృతితో ఆకాశవీధిని వెళ్ళిపోయింది.

కోటారెడ్డి కుప్పగా కూలిపోయాడు. అతనికేమీ పాలుపోలేదు. 'నరబలి' అంటే సామాన్యమా! అందులో నూ తల్లీ, పిల్లా కావాలిట. ఎవరొప్పుకుంటారు? ఒప్పుకుంటే మాత్రం స్త్రీ, శిశు హత్యల పాతకంతో కోట ఏమాత్రం జయప్రదంగా నిలబడుతుంది. ఈ హింసకు కోటారెడ్డి మనసొప్పుకోలేదు.

మర్నాడు రాయలవారీవార్త విని, అట్టి హింసాకాండకు విముఖత్వం చూపుతూ లేఖ పంపారు.

## 3

ఆనాడు తెల్లవారగానే యీ వార్త— అంటే, కోట పతనమూ, బాలెంతదయ్యం నరబలి కోరటమూ— రాయచూరంతా వ్యాపించింది.

ఆనాడు 'సంగమ్మ' అనే ఒక పద్మసాలి వనిత తన పొత్తిళ్ళలోని బిడ్డకు పాలిస్తూ ఆ చిన్నారిబాబుని చూసుకుని మురిసిపోతోంది. ఆమె బాలెంతరాలు. ఇంకా పురిటిరోజులైనా వెళ్ళలేదు.

ఆ సమయంలో పక్కింటి బంగారమ్మ వచ్చి, అప్పటికే ఊరంతా అలుముకున్న వార్తని 'సంగమ్మ' చెవిని వేసిపోయింది.

సంగమ్మ ఒంటరిగా ఆలోచించసాగింది: "ఎంతటి దుర్వార్త! ఇక కోట నిర్మాణం ఆగిపోవాల్సిందేనా? ఇంతమంది పౌరులకూ రక్షణ నిల్చిపోవలసిందేనా? అవును, కాకేమవుతుంది, విధి బలీయమైనప్పుడు!"

"అయినా, రాజు తలుచుకుంటే సాగని పనేముంది? కాని, రాయలవారు, కోటారెడ్డికూడా ఎంతటి సహృదయులు! అలాంటి వారు తలపెట్టిన సత్కార్యానికి ఎవరూ ప్రాణత్యాగం చేయలేరా? ఎవరిప్రాణం వారికి తీపి. నామట్టుకి నేనంతేకదా!"

"అబ్బ! ఎంత చెడుఊహ వచ్చింది. నా చిన్నారితండ్రికి కీడు తలపెట్టాను. పాపం ఉపశమించాలి." అనుకుంటూ బిడ్డని రొమ్ముకి హత్తుకుంది.

పొత్తిలోని రొమ్మును జారవిడిచి బిడ్డ ఎందుకో కిలకిల నవ్వాడు. ఆమె కళ్ళవెంబడి

ఆనందాశ్రువులు రాలాయి. ఆమె అనుకుంది "నా బిడ్డకి ఎంతటి రాజభక్తి; ప్రాణత్యాగానికి వెనుదీయక కిలకిల నవ్వాడు. ఇది నాకు దివ్యసందేశం కాబోలు. రాజభక్తితో ప్రాణత్యాగం చేస్తే చక్రవర్తిఅయి పుడతాడని ప్రతీతి. కాని, అనిత్యమయిన యీ శరీరాన్ని వదలి, కీర్తి శరీరాన్ని వరించటానికి నా ప్రాణం ఎందుకు వెనుకాడుతోందో తెలీదు. ఈ త్యాగానికి నేనే ఎందుకు సాహసించరాదు? తిండికీ, బట్టకీ కటకట లాడే యీ దారిద్ర్యంతో పెనగు లాడే కన్న అదే నయం! ఈ అపూర్వ త్యాగ ఫలితంగా నాబిడ్డ రాజవంశంలో జన్మించి చక్రవర్తి అవాలి."

ఇలాగ ఆవేశంతో సంగమ్మ ఊహించుకుంటూ వుండగా మళ్ళీ వచ్చింది పొరుగింటి బంగారమ్మ. సంగమ్మ తన ఊహను ఆమెవద్ద వెలిబుచ్చింది. తను, తన బిడ్డ రాజకార్యార్థం ప్రాణ త్యాగం చేయటానికి అవకాశంకలిగించమని వేడుకుంది, ఆమెను.

అప్పుడు బంగారమ్మ కంట తడిపెట్టుకుని "ఇది చాలా తప్పుడుఊహ!" అని మందలించింది. పైకి అలా అంది కాని, బంగారమ్మ అంటే మూర్తీభవించిన స్వార్థం అన్నమాట! సంగమ్మ భర్త ఊళ్లో లేడు. ఈ అవకాశం తీసుకుని, పైకి సానుభూతి చూపుతున్నట్టు నటిస్తూ, కోటారెడ్డికి యీవార్త రహస్యంగా అందిస్తే పారితోషికం లభిస్తుందనుకుంటూ అక్కడినుంచి వెళ్ళింది.

కోటారెడ్డి బంగారమ్మ చెప్పింది విని కస్సుమని, ప్రాణాలు తీయటం తనపని కాదన్నాడు. ఇక వారు అక్కడిపని విరమింపుకో దలిచినట్లు గ్రహించిందామె. కోటారెడ్డి అంతరంగికుడు వెళ్లిపోయే బంగారమ్మని చాటుగా పిలిచి ఏదో చెప్పి డబ్బు సంచి అందించాడు. ఆమె సంతోషంతో 'అలాగే' అంటూ వెళ్ళిపోయింది.

తర్వాత కోటారెడ్డివద్దకు వెళ్ళి అంతరంగికుడు, "సర్దార్! ఆ సంగమ్మ తన పట్టుదల మీదే వుందట. తనంత తానే ఎన్ని అడ్డంకు లొచ్చినా శిశువుతో సహా ప్రాణత్యాగం మానదట! అలాంటప్పుడు మనమేం చేయగలం?" అన్నాడు.

కోటారెడ్డి విస్మితుడయ్యాడు. "నిజంగానా! నేను నమ్మలేకున్నానే; అంతటి త్యాగశీలా ఆమె? ఏమైనాసరే మనందానిని అంగీకరించరాదు. ఆవిడ సుహృద్భావానికి పారితోషికం ఇచ్చిద్దాం!" అన్నాడు.

తర్వాత, అంతరంగికుడు పనివాళ్ళకేదో బోధించి వచ్చాడు.

## 4

అది సంధ్యాసమయం. పునాదిలోంచి తీసి కొంచెం దూరంగా కుప్పగా వేసిన ఇటుకల గుట్టకు యీవల నిల్చుని అక్కడ వున్న పనివాళ్ళని ప్రయాణసన్నద్ధులై వుండమనీ, తెల్లవారుజామున విద్యానగరానికి బయల్దేరి వెళ్ళిపోదామనీ చెపుతున్నాడు కోటారెడ్డి.

ఇంతలో అతనిప్రక్కనుండి ఒక స్త్రీ బిడ్డ నెత్తుకుని పరుగున వెళ్ళి పునాదిగోతిలో దూకింది. బిడ్డ 'కెవ్వు' మన్నాడు. ఆమె 'అబ్బా' అంది. పనివాళ్లు త్వరగా వెళ్ళి ఆమెపై మట్టివేసి ఇటుకవరస పేర్చసాగారు. కోటారెడ్డి ఒక్కఊపులో వెళ్లి పునాదిలోకి చూశాడు. ఇంకేముంది, అంతా అయిపోయింది. సంగమ్మ అనుకున్నంతపనీ చేసివేసింది. తల్లీ బిడ్డల గుండెలో కత్తిపోట్లు చూసి మూర్ఛపోయాడు, రెడ్డి.

దూరాన ఉన్నవాళ్ళు వచ్చి ముఖంపై నీళ్లుచల్లి, పరిచర్యలు చేయగా తేరుకుని చూశాడు. అప్పటికి, ఆ భాగం పునాది పూర్తి అయి పైన రెండు ఇటుకవరసలు పేర్చి ముగించారు.

కోటారెడ్డి పనివాళ్లమీద మండిపడ్డాడు. "ఏమిటీపని? తల్లీ, పిల్లా అలా దూకి, ప్రాణాలు తీసుకుంటుంటే చూస్తూ ఊరుకున్నారా. పైగా వాళ్లమీద పునాది కట్టారా?" అన్నాడు.

వాళ్లు గజగజ వణకుతూ "మేమేం చేయం బాబూ. అది మేము బుద్ధిపూర్వకంగా చేసిన పని కాదు. ఏదో శక్తి మమ్మల్ని నెట్టుకుపోయి బలవంతంగా ఆ పని చేయించింది. మన్నించండి సర్దార్!" అన్నారు.

కోటారెడ్డి ఇంకేమీ అనలేకపోయాడు. లేచివెళ్లి పునాదివద్ద మోకరిల్లాడు. "నీవంటి త్యాగశీల ఋణం ఎలా తీర్చగలం సంగమ్మా! నీ రాజభక్తికీ, త్యాగానికీ చిహ్నంగా ఈ కోట నీపేర చిరస్థాయిగా వుంటుంది. మమ్మల్ని మన్నించు తల్లీ!" అంటూ కన్నీరు జలజలా రాల్చాడు.

జరిగిన సంగతి రాయలవారికి కబురు పంపాడు కోటారెడ్డి. ఆయనకూడా అమితంగా విచారించారు. కోట నిర్మాణం ప్రారంభించమనీ, అది "సంగమ్మకోట" అనేపేరుతో విరాజిల్లుతుందనీ అదే తన సంకల్పమనీ జవాబు పంపించారు.

తిరిగి కోట నిర్మాణం ప్రారంభమయింది. ఈసారి ఏ విధమైన ఆటంకమూ లేకుండా పని సాగింది. కొంతకాలానికి కోట నిర్మాణం జయప్రదంగా ముగిసింది. బలిష్ఠమైన గోడలతోనూ, పెద్ద పెద్ద బురుజులతోనూ, విశాలమైన ద్వారాలతోనూ, లోతైన కందకాలతోనూ నిర్మితమైంది కోట.

దానికి "సంగమ్మ కోట" అని నామకరణం చేయబడింది. రాయల వారామె సమాధిపై పుష్పాంజలి వుంచి కోటలో ప్రవేశించారు. సంగమ్మ అపూర్వ త్యాగఫలితంగా ఆమెపేరు చరిత్రపుటల్లో చిరస్థాయిగా నిలిచింది. ఇప్పటికీ అక్కడివారామె కథ చెప్పుకుని కన్నీరు విడుస్తుంటారు. ★

# బుద్ధజయంతి

# చిత్ర శిల్ప కళా ప్రదర్శనం



ఈ ప్రదర్శనమును రాజాజీ హాలులో ఏర్పాటు చేశారు. ఈ చక్కని హాలులో ప్రదర్శనము ఎంతో అందంగా అమర్చారు. లలితకళా అకాడమీ ఏర్పాటు అయిన తరువాత మనదేశములో చిత్రకళా ప్రదర్శనములు అకాడెమీవారు వైభవముగా జరుపుతున్నారు. ఈవిధంగా శిల్ప చిత్ర కళలను ప్రజానీకానికి సన్నిహితం అయేట్టు చేస్తున్నారు.

బుద్ధ భగవానుడు నిర్యాణముఅయి రెండు వేల అయిదువందల సంవత్సరములు పరిసమాప్తమయింది. మహాపరి నిర్వాణోత్సవము 1956 లో అతి వైభవంగా జరిగింది ఈ బౌద్ధశిల్పములు చిత్రములు ఆ మహోత్సవమునకై పలుదేశములనుంచి సేకరించారు ఇట్టి ప్రదర్శనములవల్ల ప్రజలలో క్రొత్త చైతన్యము కలుగుతోంది.

ఈ ప్రదర్శనమునకు బుద్ధజయంతి కార్య నిర్వాహక వర్గమువారి ఆధ్వర్యమునను, లలితకళా అకాడమీ సహాయ సంపత్తితోను ప్రారంభోత్సవము జరిగింది. శ్రీదేవీప్రసాదు



భూటాన్ బుద్ధ కాంస్యవిగ్రహం

రాయ చౌదరిగారు అకాడమీ అధ్యక్షులు. వారి సమక్షంలో మద్రాసు హైకోర్టు ఛీఫ్ జస్టిస్ శ్రీ పి. వి. రాజమన్నారు గారు ప్రారంభోత్సవము చేశారు ప్రదర్శనము ఏర్పాట్లను ఎక్జిబిషను ఆఫీసరుగారైన శ్రీ వై. దయాల్ పర్యవేక్షణ చేశారు. ఎకాడమీ చిత్రకారులైన శ్రీ వి డి. గోవిందు మొదలగు చిత్రకారులు చిత్రములను ఏర్పాటుచేయుటలోను, అలంకరణలోను, ఎంతో శ్రద్ధ తీసుకున్నారు. లలితకళా అకాడమీ ఈ ప్రదర్శనమునకు బహుచక్కని కేటలాగు ప్రచురించారు. కేటలాగులోని శ్రీ సి శివరామమూర్తిగారి పరిచయ వాక్యాలతో మనకు చారిత్రకమయిన విషయాలు స్ఫుటంగా ద్యోతకమౌతాయి. ఆయా దేశాలలో ఈ కళాఖండాలు ఏకాలంలో ఆకృతిపొందాయో, వాటి కళావైదగ్ధ్యములు ఎట్టివో, అవి రూపొందుట కనువగు వస్తుసామగ్రి ఎట్టిదో మొదలగు వివిధ విషయములు కేటలాగులో వివరించారు.

బుద్ధభగవాను డుదయించి ఎనభై సంవ



చైనా కాంస్య ప్రతిమ



ద్వారావతీ శైలిలో క్రీ. శ. 12,13 శతాబ్దాలకు చెందిన థాయ్‌లాండ్ బుద్ధుడు



నాగరాజుపడగనీడలో ధ్యాన బుద్ధుడు [కంబోడియా]

# బుద్ధ జయంతి

త్సరములు జీవించి పరమపదించిన కాలము నిన్న మొన్నటిదికాదు. రెండు వేల అయిదు వందల సంవత్సరములు గతించినవి. ఆయన ఆసియా జ్యోతి. శాక్యముని సిద్ధార్థులై, బుద్ధులై, జీవన్ముక్తులై నిర్యాణము పొందుటకుముందు, అనేకజన్మ పరంపరలలో జన్మించి, జీవితంలో కష్టసుఖముల నడుమ చేసిన సత్యాన్వేషణ గాథలను జాతక కథలన్నారు. వర్ణాశ్రమ వ్యవస్థలో, ఈ మహనీయమూర్తి జన్మించుట, సత్యాన్వేషణకై సర్వసంగ పరిత్యాగులగుట అన్నీ రసవత్తరమైనగాథలు. అవన్నీ సుఖము దుఃఖము, ప్రేమ, వియోగము, దరిద్రత భోగలాలస, మొదలగు ద్వంద్వములతో కూడినవి. ఆయాజీవితాల్లో ఆయాసత్వములను పరిపుష్ట మొనరించుకొని ఈ విజ్ఞాన జ్యోతి, కడసారి జన్మలో ఆసియా ఆశా జ్యోతి గా వెల్లివిరిసింది. తథాగతులు వైశాఖ పూర్ణిమనాడు రెండు సాలవృక్షముల నడుమ జన్మించి



బౌద్ధచిత్రకళకు థాయ్‌లాండ్ మచ్చుతునక



టిబెటన్ శిల్పాలు

వైశాఖ పూర్ణిమనాడు బుద్ధదేవులై, అదే రోజున సాలవనంలో శిష్యగణం మధ్య నిర్యాణం పొందారు.

ఇక్కడ ప్రదర్శించిన చిత్రాల్లో, శిల్పములలో సర్వాంగ సుందర మూర్తియైన, శాక్యముని, వివిధరూపాల్లో రసఖండాలుగా రూపొందారు. అవి కొన్ని టిబెట్ తెరలు, కొన్ని స్వచ్ఛ శిలాఫలకములు, కొన్ని తాళపత్రములపై చిత్రములు, మరి కొన్ని సిల్కు తెరలపై చిత్రములు, కొన్ని నలుపు, తెలుపు చిత్రములు, కొన్ని దారు చిత్రములు, కొన్ని రమణీయ శిల్పమూర్తులు, కొన్ని శిల్పబాలలు, కొన్ని యౌవనమూర్తులు కొన్ని వృద్ధ మూర్తులు, ఇల్లా ఒక రేమిటి ఏకైక జ్యోతి పలుజీవితాల్లో, పలుగాథలలో పలు శిల్పచిత్ర సంప్రదాయాల్లో వెల్లివిరిసిపోయింది. ఆమూర్తి ఏకరస ప్రవాహంగా వరదలు కట్టిపోయింది. ఈశిల్ప చిత్రాల్లో ఈబొమ్మల్లో ఈమూర్తి ఒకచోట పద్మపాణి. అది లోహప్రతిమ. 18 వ శతాబ్దానికి చెందినది. మరొక్క చోట అవలోకితేశ్వరులు. అది 9 వ శతాబ్దము లోహప్రతిమ. ఇలా, ఈస్వచ్ఛంద సాత్విక మూర్తి ఒక చోట ధర్మచక్ర పరివేష్టితులు, మరో శిల్పంలో అభయమూర్తి, ఇంకో శిల్పంలో భూమి స్పర్శ ముద్రాంకితులు. ఒక శిల్పంలో బోధిసత్త్వులు. మరిఒక చిత్రంలో శిష్యగణ పరివేష్టితులు. వారు పదహారు గురుశిష్యులు. ఒకచోట "ప్లాసర్ కాస్ట్" బుద్ధశీర్షములు, కొన్ని "టెరకోటా" మృణ్మయమూర్తులు.

ఇన్ని చిత్రాలలో శిల్పాలలో టిబెట్టు తెరలలో, చైనా చిత్రములలో ఎక్కడ ఆగము. ఎంతసేపని బుద్ధభగవానుల సౌందర్యం



## బుద్ధజననం

చిత్రకారుడు: ఎస్. సేన్ రాయ్.

తిలకించగలము. ఒక్కొక్క చిత్రం చూపరులను కదలనీయదు. ఒక్కొక్క చిత్రం నోరు విప్పనీయదు. ఇట్టి కళాసంపదను ఆశ్చర్యచకితులమై చూస్తాము. ఈ హాలులో ఫ్రాన్సు కళాఖండములు మరీ, అద్వితీయంగా ఉన్నవి. ఇవి సైజులో కూడా ఏ మొగలు చిత్రములవలెనో చిన్నవి కావు. వాటిలోని అలంకార వైచిత్ర్యము (Decorative aspect) వర్ణనాతీతము. ఆ రేఖలలో ఎక్కడా అపశృతి లేదు. వర్ణలేపనంలో (Colour scheme) అద్వితీయ పాండిత్యము. ఇల్లా ఒక్కొక్క దేశంలోని మ్యూజియములనుండి, కొన్ని శిల్పములను, చిత్రములను సేకరించి ప్రదర్శించుట మహత్తరమైన కార్యము. ఎంతో వ్యయప్రయాసల కోర్చి వాటిని పూబంతి వలె అత్యంత రమణీయముగా కూర్చినారు.

వీటిలో (Wood cut paints) దారు చిత్రములు, కుడ్యచిత్రములు (Mural Painting Copies) ఒక ప్రత్యేకతతో ఒప్పుతున్నవి. కుడ్యచిత్రాలు కడురమ్యముగా ఉన్నవి. వీటిని చైనా చిత్రకారులు యథాతథంగా చిత్రించారు. దారు చిత్రములు అంతంత సాముదాయిక చిత్రములు అంత సున్నితంగా రేఖాసౌష్ఠవం చెడకుండా చిత్రించుట ఆయా శిల్పుల అనన్యప్రతిభకు తార్కాణము.



రత్నఖచితమైన రజత బౌద్ధాలయం [క్రీ. శ. 1786-1795 నాటి చైనాశిల్పం]

అయితే ఈశిల్పాలు, చిత్రాలు, ఆయా దేశములలోని శిల్పచిత్ర కళాసంపదలకు మచ్చు. ఒక్కొక్క దేశంలో అనగా బౌద్ధ మతము వ్యాపించిన దేశాలలోని కళాసంపదలను ఇక్కడ ప్రదర్శించిన కళాఖండాలు కొంతవరకే అభివర్ణించుతవి. ఆదేశాలలోని, బహుళవ్యాప్తమయిన శిల్పకళాసంపదలు, ఈ రెండువేల అయిదువందల సంవత్సరముల కాలములో ఎన్ని రూపరిపోయినవో! ఎన్ని రసమూర్తులు భిన్నాభిన్నములైనవో! వీటిలో వివిధశతాబ్దులలో రూపొందిన వాటి సంప్రదాయ భేదములు ఒకటికాదు. ఎందరు శిల్పులు, చిత్రకారులు వారివారి దేశములలో ఎంతెంత అమోఘమైన కృషిసలిపినారో, వారెవరో! వారిజీవితములు ఎట్టివో! మనకు ఆయావిషయములపై సమగ్రమయిన చరిత్ర లేదు. లభించదు. కాలగర్భములో కలసిపోయిన ఘనకార్యములకు, అనగా ఈ బౌద్ధ సంప్రదాయములను పరిశోధించినపండితులు, కారేదేశంవారైనా ఘనులు. ఆపరిశోధకులు, విమర్శాగ్రేసరులు గౌరవనీయులు. ఈ బౌద్ధ చిత్ర శిల్పకళలయందు కథావస్తువు ఏకైక మూర్తి ఆ బుద్ధభగవానుడే. ఏకైకధర్మము బౌద్ధధర్మము. ఈ కళాసంప్రదాయాల్లో

# బుద్ధజయంతి

ఎంత బహుత్వముఉందో అంత ఏకత్వమూ అంతర్లీనమై ఉంది.

ఇంక రాజాజీ హాలులోపలనించి బైటకు వచ్చి హాలుచుట్టూ ప్రదక్షిణముచేస్తే ఇప్పటి భారతీయ చిత్రకారుల చిత్రములు ఉన్నవి. వీరిలో కొందరు చిత్రకళలో ఆరితేరిన వారు. ఈ చిత్రాలలో స్వర్గీయ శారదా చరణ ఉకిలు చిత్రములు కూడా ఉన్నవి. చాలావరకు కేంద్రప్రభుత్వము చిత్రకారులకు కొన్ని ఘట్టములు చెప్పి వ్రాయించినవి. కొన్ని వారివద్దనుండి కొన్నవి. ఈ విధంగా ఎన్నో మంచి చిత్రములు తయారు చేయించారు. వీరిలో కొందరు సిద్ధహస్తులు. వారిని ఇక్కడ వివరించుట సాధ్యముకాదు. చుట్టూ హాలులోఉన్న చిత్రములను విడిగాను, మధ్యహాలులో చిత్రములను విడిగాను ప్రదర్శించుట చక్కని ఏర్పాటు. రెండు మూడు పర్యాయములు సందర్శించిన కాని ప్రస్ఫుటమైన ఊహలు ఈ కళాసంపదను గూర్చి కలుగుటకు అవకాశం ఉండదు. మొదటిసారి చూచినప్పుడు కొంత అల్లకల్లోలంగా ఉండుట సహజము. కారణము వీటిలో వివిధ తరగతులుండుట వలన. ఒక పూర్వ శిల్పచిత్ర సంకలనంలోనే ఇంత వైవిధ్యం ఉంటూ ఉంటే, బైట హాలులోని ఇప్పటి చిత్రకారుల చిత్రముల విషయం వేరుగా చెప్పవలెనా? చుట్టూ హాలులోని చిత్రములలో ఉదాహరణకు నవీనులైనా శ్రీ శైవాస్తవదాగారి చిత్రముల ఫక్కి వేరు. మరి శ్రీ కె. కె. హెబ్బరు చిత్రపద్ధతి వేరు.



తపశ్చర్యతో కృశించిన బుద్ధుని శిరస్సు. క్రీ. శ. రెండవ శతాబ్దపు గాంధారశిల్పం

వేటితోను కలవని శ్రీ కిరన్‌రాయ్ చిత్రము, బహు చక్కనిది అనుటకు సందేహము లేదు. ఈ విధంగా బహు విధములయిన శైలిభేదాలతో ఇప్పటి చిత్రకారుల చిత్రములు ఒప్పుతున్నవి.

బైట చుట్టుక్రింద కొన్ని చిత్రములు ఏర్పరిచారు. నాలుగో అయిదో ఎత్తుగా ఒక వరుసగా పెట్టారు. స్థలం లేక అట్లా విడిగా పెట్టవలసి వచ్చిందో ఏమో! అవికూడా ఇప్పటి చిత్రకారునివే.

మొత్తంమీద ప్రదర్శనము కడు రమ్యముగా ఉంది. చాలా పెద్ద ప్రదర్శనము అవాలి. ఆ కారణంచేత రెండు మూడు పర్యాయములు చూచిన, సర్వ విషయములు చక్కగా హృద్గతము కావటానికి అవకాశము ఉంది.

కొన్ని చిత్రాలు పూర్వపువాటిలోనివి, వినీలగగనంపై విద్యుల్లతల్లా మెరిసిపోతున్నవి. వాటియందు నిబిడీకృతమయిన



బౌద్ధ తాంత్రికవాదంలో ముఖ్య దేవత తార. 18వ శతాబ్దపు నేపాలీ విగ్రహం. [భారతీయ కళాభవనం లోనిది]

తేజస్సూ అట్టే ఉన్నది. అటి శిల్పాలు చిత్రాలు సృజించటానికి కళా విషయమైన పాండితీవిశేషం అలా ఉంచి, ఆయా శిల్పులకు చిత్రకారులకు బుద్ధదేవునియందు ఎంత భక్తిభావమో, ఎంతటి తాదాత్మ్యమో కదా! లేకుంటే అట్టి విలక్షణమైన కళా సంపదను సృజియించుట సామాన్యముకాదు. అట్టి ఉదాత్త కళాఖండాలు మలచవలెనంటే ఆ శిల్పులకు అది ఒకనాటి పని, ఒక ఏటి, విద్యాభ్యాసము కాదు. అట్టి ఉదాత్త సమారాధనతోనే అట్టి పటిష్ఠమయిన కళాసృష్టి సాధ్యమాతుంది. వారి మనస్సులు కల్లోలితములు కావు. వారి కళాలక్ష్యము తిన్ననిది; వక్రమైనది కాదు. అక్కడ సంశయానికి చోటు లేదు.

ఈ బౌద్ధశిల్ప చిత్రకళయందు ఒకే మహోర్ఝురి అంతర్లీనము. అది ఒకే రసప్రవాహముగా శతాబ్దులుగవించి ప్రవహించింది. అన్ని శతాబ్దములైనా ఆ మహనీయుని శాంతి సందేశము దేశదేశముల శరవేగంగా పయనించింది. ఆ యుగంలో లలితకళలు ఇసుక తిన్నెలపై పండు వెన్నెలలు పవళించినట్లు తళతళ లాడినవి. ★

—పిలకా లక్ష్మీనరసింహామూర్తి]

“...ద్వార్ ఖడా ఏక్ జోగీ
న మాంగేయే సోనా చాందీ
మాంగే దర్శన్ దేవీ
తేరీ ద్వార్ ఖడా ఏక్ జోగీ”

ఎడమచేతిని ఎడమచెవి కానించి కుడి చేతిని అలా అలా విశాల ప్రపంచంవైపు విసురుతూ, తలుపులు వేయబడిన బెడ్ రూమ్ ముందు నుంచుని పాడుతున్నాడు కృష్ణ.

“వస్తున్నా బాబూ-వస్తున్నా” అంది రాధ గదిలోంచే.

“అయితే ఇంగ్లీషుపాట పాడుతాను...”

“వద్దు వద్దు... అంత పనీ చేసెయ్యకండి. ఇదుగో!” అంటూ తలుపులు తీసింది రాధ.

వెన్నెలలాంటి మొహం నక్షత్రాల్లాటి కళ్ళు మెరుపులాటి చిరునవ్వు వీణలాటి స్వరం పలకరించకుండా పలకరిస్తున్న మూర్తి-ఇదీ రాధంటే.

ఆరోజు రాధ చిన్న చిన్న పూలున్న ప్రింటెడ్ వాయిల్ చీర కట్టుకుని హైదరాబాద్ ఫ్లోరీ వేసుకుంది. ‘కాటుకలో ఇంత అందం వుంది సుమా’ అంటున్నాయి ఆమె కళ్ళు.

కళ్ళార్పకుండా ఆమెను చూశాడు కృష్ణ-ఆమె పమిటకొంగును భయభక్తులతో ముట్టుకున్నాడు.

“అబ్బ...మరీ ఏవిటండీ. బొత్తిగా చిన్న పిల్లలయి పోతున్నారు. పక్కింటి పిన్నిగారు చూస్తే...అవ్వ్ వ ఇంకేవన్నా వుందా?”

“పక్కింటి పిన్నిగారు ఫైరింజనుక్రింద పడనీగాని ... చీర కట్టుకుంటానని లోపలి కెళ్ళిందానివి బయటపడ్డానికి సలభై నిముషాలా?”

“సరైన చీర దొరికితేగా...”

“ఈవిధంగా నీవు ఆలస్యంచేస్తే అవతల టైము దాటిపోదూ?” పది ఇప్పటికే అర యింది. సరిగా అరున్నరకల్లా షో మొదలవుతుంది” అన్నాడు కృష్ణ.

“పోదాం పదండి.”

* * *

రతన్‌బజారు దగ్గర కృష్ణ, ప్రాణ మిత్రుడూ సుబ్బుతో కలిసి ఆఫీసుకు వెళ్ళడానికై బస్సెక్కాడు. సెంట్రల్ దగ్గర బస్సాగింది.

రోజూ అక్కడ ఒక అమ్మాయి బస్సెక్కేది. అజంతా స్టాపులో దిగిపోయేది. ఆ అమ్మాయికి పన్నెండేళ్ళు వుంటాయేమో రోజూ బడికి సరిగా ఆబస్సే ఎక్కేది.

ఆరోజు బస్ కదిలింతర్వాత ఆ అమ్మాయి పరుగెత్తుకొచ్చి ఎక్కింది. కొసని కూచునివున్న కృష్ణ వంగి ఆ అమ్మాయిని ఎడంచేత్తో పట్టుకుని బస్సులో ఎక్కించి, తనులేచి ఆసీటులో కూచోమన్నాడు. ఆ అమ్మాయి కొంత సిగ్గుపడుతూ చిరునవ్వుతో “అఖ్ఖ్ఖే వద్దండీ” అంది.

“ఫరవాలేదు. కూచో” అన్నాడు కృష్ణ. ఆ అమ్మాయి కూచుంది. ఆ అమ్మాయి పేరు రేఖ.

ఆరోజు తర్వాత రేఖ కృష్ణనూ, అతనితో సుబ్బునీ చూచినప్పుడెల్లా నవ్వేది. ఏవయినా కబుర్లు చెప్పేది. కృష్ణ, సుబ్బులిద్దరికీ రేఖ అంటే అదో విధమయిన అనురాగం ఏర్పడింది.

కృష్ణ, సుబ్బులిద్దరూ సరదాకి ఇంగ్లీషులో పోట్లాడుకున్నా, కండక్టర్ తో కావాలని తగవులు పెట్టుకున్నా, రేఖ మందహాసం చేస్తూండేది. ఆ అమ్మాయి నవ్వితే హాయి అనిపించేది.

సుబ్బు రేఖని వాళ్ళ బడికబుర్లడిగేవాడు. మొహమంతా విరిసిన విరిసెనపూవులా చేసుకుని, మెరిసేకళ్ళతో ఉత్సాహంతో ఎన్నో విషయాలు చెప్పేది రేఖ. ఇద్దరు ‘పెద్ద’ వాళ్ళు తనమాటలు ఇంతశ్రద్ధతో వింటున్నారు కదా అన్న ఆశ్చర్యంతో రేఖకళ్లలో క్రొత్తవెలుగొచ్చేది. ఆ అమాయకపు వయసులోని నైర్మల్యమూ, ఆశాభావమూ చూస్తుంటే కృష్ణ, సుబ్బులముందు గడచిపోయిన చిన్ననాటి రోజులువచ్చి నిలచేవి.

వారి స్నేహం అలా పెరిగింది.

ఒకరోజు రేఖ వాళ్ళనాన్నతో కలిసి బస్సెక్కింది. కృష్ణ, సుబ్బులను నాన్నకు చూపెట్టింది. ఆయనా ఎంతో సరదాగా కబుర్లు చెప్పారు.

రేఖ నాన్నగారు, తిరుపతిలో తెనుగు పండితుడయిన తన చిన్నాన్నవద్ద చదువుకున్నాడని హఠాత్తుగా కృష్ణ తెలుసుకున్నాడు. అప్పటినుండీ కృష్ణ, రేఖనాన్న సన్నిహితులయ్యారు. సంక్రాంతి రోజున మిత్రులిద్దరూ తమ ఇంటికివచ్చి ‘టీ’ పుచ్చుకునేదాక వూరుకోలేదు రేఖనాన్నగారు.

ఆతర్వాత కృష్ణ, సుబ్బు ప్రతిశనివారమూ ఆఫీసు అయిపోగానే రేఖఇంటికి వెళ్ళేవారు. రేఖ నాన్నగారూ, రేఖా...సుబ్బూ కృష్ణా...నలుగురూ కూచుని కబుర్లు చెప్పుకునేవారు. ఒకరోజు రేఖావాళ్ళమ్మ, కృష్ణతో “ఏమండీ, మీఆవిడనీ పాపనీ మాయింటికి తీసుకురండీ...” అంది.

“అలాగే” అన్నాడు కృష్ణ.

* * *

కృష్ణా, రాధా, పాపాయీ, సుబ్బూ, ఒకరోజు సాయంకాలం రేఖావాళ్ళింటికెళ్లారు.

రేఖా, వాళ్లమ్మ ఎంతో సంతోషంతో స్వాగతం చెప్పారు. టిఫినూ కాఫీఇచ్చారు. రేఖ నాన్నగారు సుబ్బునీ, కృష్ణనీ డ్రాయింగ్ రూములో కూచోబెట్టారు. బాతాఖానీ వేశారు.

ఇంతలో రేఖవచ్చింది. కృష్ణ, సుబ్బుల కేసి చూస్తూ “ఏమండోయ్! నా గులాబి మొక్క ఎంత చక్కటిపూవు పూసిందో తెలుసా? రండి...చూద్దురుగాని.”

“వచ్చినవాళ్ళని అలా కూర్చోనీవమ్మా. వెళ్లేప్పుడు చూస్తారులే...” అన్నారు రేఖ నాన్న.

“వెళ్లేటప్పటికి చీకటయిపోతుంది. పూవు బాగా కనపడదు నాన్నా” అంది రేఖ ఎంతో ముచ్చటగా.

“సరే! పద, చూద్దాం” అన్నాడు సుబ్బు. రేఖ సుబ్బుచేయి పట్టుకు లాక్కెళ్ళింది. సరదాతో సుబ్బూ పరుగెత్తాడు.

వాళ్లనిచూచి రేఖనాన్న “పదమూడేళ్ళొస్తూంది కాని ఇంకా చిన్నపిల్లకిమల్లే ప్రవర్తిస్తుంది.”

“ఆ...రేఖ చిన్నపిల్లే కదండీ” అన్నాడు కృష్ణ.

కాసేపైనతర్వాత రేఖ పరుగెత్తుకుంటూ వచ్చింది.

“నాన్నా నాన్నా...ఇదిగో చూడు. బాగుందా” అని తన పొడుగాటి జడముళ్ళో నున్న చిన్న గులాబిపూవుని చూపింది.

# ★ సత్యభామలు ★

"బావుందమ్మా...మరి పూవుని కోయ వన్నావుగా..."

"అన్నాను. కానీ...మరి...మరీ...మరీ...ఈ సుబ్బుగారే 'ఇది నీవు పెట్టుకుంటే బాగుంటుం' దన్నారు నాన్నా" అంది. పెద్దలు ముగ్గురూ నవ్వారు. రేఖ మొహం గులాబీలా అయింది.

మరికొన్ని నిముషాలతర్వాత రేఖ నాన్నగారేదో తొందరపని వుందని క్షమించమని వెళ్ళిపోయారు.

రేఖ తన మిత్రులిద్దరినీ – తను చదువుకునే గదిలోకి తీసుకువెళ్ళింది. తన పుస్తకాలను, తను ఎంబ్రాయిడరీ చేసిన టేబిల్ క్లాతూ, తన చేతులతో చేసిన దూదిబొంగా, ఫోర్తు ఫారంలో ఘనుగా పాసయినందుకు బడివారు బహూకరించిన చలవరాతి శివపార్వతీ శిల్పమూ, అన్నీ చూపించింది.

జింక్ షీట్ మీద పడుతున్న వానజల్లులా, పెద్దగాలిలో ఆడుతున్న చెట్టురెమ్మల్లా, ఉవ్వెత్తుగాపొంగి మరుక్షణం ఇసుకను ముద్దెట్టుకునే సంద్రపు కెరటాల్లా, ఎంతో ఉత్సాహంతో రేఖ, గబగబ మాట్లాడుతూ, వర్ణించుతూవుంటే, కృష్ణ, సుబ్బు కళ్ళూ చెవులూ అప్పగించారు. ప్రపంచమంతా పాలసముద్రమేననీ, జీవితమంతా పూలపాన్పేననీ, తను అనుకున్నదల్లా అయితీరుతుందనీ, ఆశించే బంగారు బాల్యదశలోని కుతూహలం, ఉత్సాహం చూచి, ఒక్క క్షణం కృష్ణా, సుబ్బూ, రేఖతో సమానంగా తయారయారు. అలాగే వుండిపోవాలని వాంఛించారుకూడా.

సుబ్బు కుర్చీలో చేరగిలబడి టేబిల్ మీది పిల్లల మాసపత్రిక తీసి చూడసాగాడు. రేఖ కృష్ణకి తన వాటర్ పెయింటింగ్స్ బుక్ చూపెట్టసాగింది. పదో పన్నెండో చక్కటి చిత్రాలు గీచింది. వాటిని కృష్ణ మెచ్చుకుంటుంటే రేఖ ఎంతో సంతోషించింది. ఆ బుక్ ఆఖరున, వాళ్ళ నాన్నగారు, స్కూలుమేష్టారు, ఇంకా ఎవరెవరో పెద్దవాళ్ళందరూ రాసిన అభిప్రాయాలను చూపెట్టింది.

కృష్ణ అన్నాడు. "నీవు చాల ఘటికదానివే సుమా" రేఖ నవ్వింది.

కృష్ణ, పెయింటింగ్ బుక్ మూసేస్తూ "ఊ...ఇంకేమయినా వున్నాయా?" అని అడిగాడు.

"అలా మూసేయకండి. అందులో ఆఖరున మీ అభిప్రాయమూ రాయాలి."

"అబ్బే! ఎందుకులే?"

"రాయండీ!"

"మరోసారి రాస్తాలే."

"ఊహు ఇపుడే రాసేయండి" అని కృష్ణ చేయిపట్టుకు టేబిల్ దగ్గరకు లాక్కెళ్ళింది రేఖ. కృష్ణ కుర్చీలో కూచుని రాస్తుంటే అతని మొహాందగ్గరగా తన మొహంవుంచి అతడేం రాస్తాడో అని చూస్తూంది.

అపుడే—

అంతవరకూ రేఖావాళ్ళమ్మతో మాట్లాడుతూవున్న రాధ, రేఖఅమ్మ వంటింట్లోకి వెళ్ళగానే, ఇల్లంతా తిరిగిచూస్తూ—

రేఖ చదువుకునేగదిలో అడుగుపెట్టింది. గభుక్కున తిరిగి వెళ్ళిపోబోయింది.

ఈ శబ్దంవిన్న రేఖ "రండి...పిన్నిగారు, ఈయన నా పెయింటింగ్ బుక్ లో ఏం రాశారో చూశారా...నా పెయింటింగ్స్ నాలాగే చక్కగా హాయిగా వుంటాయట" అంది గర్వంతో.

"ఊ" అని చరచర వెళ్ళిపోయింది రాధ. రాధ అలా మౌనంగా తిరిగి వెళ్ళిపోవడాన్ని కళ్ళార్పకుండా చూచాడు కృష్ణ. సుబ్బు కళ్ళతో ప్రశ్నించాడు. కృష్ణ కళ్ళల్లోనూ ప్రశ్నే ప్రతిఫలించింది.

ఆ ఒక్క క్షణంలో ఆ గదిలో ఏదో మార్పు వచ్చిందని ఊహించగలిగింది రేఖ. కాని అది ఏవిటో, ఎందుకో తెలుసుకోలేకపోయింది. ఈ మార్పంతా రెండు నిముషాలే.

మళ్ళీ రేఖ, రేఖ అయింది. ఏవిటేవిటో మాట్లాడింది. చిన్న పిల్లల మాసపత్రిక చదివినందుకు సుబ్బుని ఎగతాళిచేసింది. సుబ్బుకీ తన పెయింటింగ్ బుక్ చూపెట్టింది. అతడి అభిప్రాయాన్ని రాయించి పుచ్చుకుంది...

...రాధ, రేఖావాళ్ళమ్మ దగ్గర సెలవు తీసుకుంది.

"భోంచేసి వెళ్ళండి" అంది రేఖవాళ్ళమ్మ.

"వద్దండీ" అంది రాధ.

"అలాగయితే మీ ఇంటో కాఫీ కూడ పుచ్చుకోమండోయ్" అంది రేఖ.

వాళ్ళమ్మవైపు చూస్తూ "వస్తామండీ" అంది రాధ. కృష్ణని కలుసుకుంది.

"వెళ్ళొస్తామండీ వెళ్ళొస్తాం రేఖా...నాన్నగారితో చెప్పు" అన్నాడు సుబ్బు.

ఇల్లుచేరారు కృష్ణా, రాధా. దారిలో రాధ ఏమీ పలకలేదు. కృష్ణా వూరుకున్నాడు. అసలు విషయం ఏవిటో అంతు చిక్కకపోయినా, అదేదో కాసేపులో బయటపడుతుందనుకున్నాడు.

చీర మార్చుకుంటూ గదిలోంచి రాధ అంది. "అయినా ఆ అమ్మాయి అలా సిగ్గులేకుండా వుండకూడదు"

ఆ స్వరాన్ని విని కృష్ణ షాక్ తిన్నట్టయాడు. "ఏ అమ్మాయి? రేఖా?"

"ఆ అదే ఇపుడే ఇలా వుంటే, ఇహ రేపు పెరిగి పెద్దయితే ఎలా వుంటుందో?"

"చక్కగా, నిర్భయంగా, నలుగురిలో తిరుగుతూ, ఎవ్వరిమీదా ఆధారపడకుండా ఎవ్వరికీ బానిస కాకుండా వుంటుంది" అన్నాడు కృష్ణ సాధారణంగా.

"వుంటుందుంటుంది! నల్గురిలో ఏవిటి, నలభై మందిలో తిరగ్గలదు."

"ఏవిటి రాధా నీవంటున్నది...?"

"లేకపోతే పెళ్ళికుపిల్ల అలా మీచేతులుపట్టుకు లాక్కెళ్ళడమేవిటి, ఆ నవ్వులేవిటి, ఆ పువ్వులేవిటీ, అవన్నీ మంచిలక్షణాలేనా?"

"రాధా..."

"రేఖ రేఖ అని రోజూ ఇందుకనే కాబోలు మీరు మీ మిత్రుడూ వర్ణించేవాళ్ళు..."

"రాధా! తొందరపడకు. రేఖ పసిపిల్ల కి చెల్లెలు లాటిది."

"అవన్నీ నాకనవసరం. ఇహ నేను వాళ్ళింటికి రాను. ఆ అమ్మాయి ఇక్కడికి రావక్కర్లేదు. మీరు అక్కడికి వెళ్ళడమూ నాకిష్టంలేదు...అంతే" అంది రాధ.

గట్టిగా నిట్టూర్చాడు కృష్ణ. ★



# ఏకలవ్యుడు

"ఏది" అంది వకీలుగారింటి గడియారం.
"కాదుస్మీ" అంది పక్కవాటాలో మేష్టరుగారి గడియారం.

* * *

ఆరాత్రి పదిగంటల వేళ ఈ విధంగా, పది అయిందని రైల్వేగడియారాలూ కాలేదని చేతిగడియారాలూ అభిప్రాయపడుతున్నాయి. పురోగమనం అంటే మరి ఇదయ్యే చిల్లరగడియారాలు గంట క్రితమే పదికొట్టేసి, పన్నెండనడానికి సిద్ధంగా ఉన్నాయి.

ఓ కాలు కళ్యానని చెప్పి సినిమా చూసి వచ్చిన పురుష పుంగవులు, కలత నిదురలో లేచి తలుపు తెరచిన కాంతల ముసురేక బుగ్గల పొడరు పొరమీద తేలిగ్గా చిటికె వేసి, "ఏమున్నరకే పడుకున్నావేం కల వొప్పిగా ఉందా" అని కుశలం అడుగుతూ బుకాయించి తమకు ఆకలిలేని వైనాన్ని వెల్లడించి, పునరుద్ఘాటించి మహావుడిగా నిద్రనటిస్తున్నారు.

గోదావరీతీరాన సీరియల్ విరహ గీతాలా వన పతో బాధపడి పడి, ముగకాది ఖోంచే లాక అని స్థిమితపడి, ఆవేళే ఇల్లు చేరిన రోమియోలు పొంగి పొరలే వేదననీ, అమ్మ చివాట్లనీ, ఎదురగుండా కంచంలో పొడి మెతుకుల్నీ కలిపి మింగుతున్నారు.

## 1

'పది' అంది వకీలు సుబ్బారావుగారి గడియారం.

"సరిగ్గా ఈ పాటికి సీత హైదరాబాద్‌లో పడుకోబోతూ ఉంటుంది" అనుకున్నాడు సీతదైనందినీయం కంఠతాపట్టిన గురునాథరావు.

"ఇందాక కాదు. ఇప్పుడే పది అయింది" అంది గురునాథరావు పడుకున్న గదిలో గడియారం, చేతిసైనంత గంభీ

**ముళ్ళపూడి వెంకట రమణ**

రంగా. 'హు' అనుకున్నాడు గురునాథరావు గట్టిగా.

పక్కవాటాలో ప్లీడరు సుబ్బారావుగారికీ ఇక్కడ గురునాథం తండ్రి రామనాథంగారికీ అభిప్రాయ భేదాలున్నాయి. కాబట్టి, స్వామి భక్తిగల వారి వారి గడియారాలూ రోజూ రాత్రి పదిగంటల వేళలాంఛనానికి విభిన్నాభిప్రాయాలు ప్రకటిస్తాయి.

ఇలా విభిన్నాభిప్రాయాలు గలవారు ఇరుగూ పొరుగులుగా ఉంటూ శాంతియుతంగా సహజీవనం చేయ. వచ్చునన్న ఆమాట కొస్తె, చేసితీరాలని నమ్మినవాడు గురునాథరావు. అందులోనూ, పక్కవాటా వకీలుగారికూతురు ఇవతలివాటాలో పెళ్ళికానిపిల్లాడి హృదయాన్ని అపహరించి అట్టే పెట్టుకున్నప్పుడు మార్గాంతరంలేదు.

అయితే, ఈ సహజీవనం ఏర్పాటుమీద గురునాథరావుకి ఎంతగురి ఉన్నా అతనిదాన, ఇరుగుపొరుగు గడియారాలు రెండూ వేరో అభిప్రాయం ప్రకటించడంతో కొంత ఒళ్ళుమండిపోయింది.

ఏతుగాన సీత హైదరాబాద్‌లో పడుకొనిఉంటుంది అన్నవిషయం సందిగ్ధంగా ఉండిపోయింది. ఇంకొకందానికి, అది అతని పాలిట జీవన్మరణ సమస్య అయిపోయింది.

కాలేజీలో ఓ ప్రేయసి, పడి పక్కమీద ఓ జూలియట్, గోదావరొడ్డున ఓ కారుణశ్రీ దారిలో ఓ సుందరి, ఇలా ప్రేయసీమణుల జబితా వేసుకుని, ఏకరేణా ఊరువెళ్ళితే, తాత్కాలికంగా అఖాలోచన చేయడానికి వీడిగా "స్టాండ్ బై" (ప్రత్యామ్నాయ ప్రేయసీమణులు) ఓ జాబితా, మామేపాసిద్ధంగా ఉంచుకొని ప్రాణేశ్వరి జూలియట్‌లకు వేరే తయారుచేసుకున్న వాళ్ళకి ఈ "ఏకలవ్యత్వ" పు కష్టాలు తోచవు.

అవకాశవాది అభిప్రాయాలలా, ఉడానికో ప్రేయసిని మార్చుకునే వీళ్ళకి ఈ సమస్య, జోతిగా అమావాస్యలా రూపరేఖారహితంగానూ, పిరికివాడి అభిప్రాయంలా అయోమయంగానూ, ఎన్నికల

# ఏకలవ్యుడు

శాస్త్రానంలా అసంగతంగానూ, కనబడుతుంది.

హైదరాబాద్‌లో ఒక సీత ఎన్నిగంటలకి నిద్రపోతే ఏమొచ్చె అని హేళన చేసి తేలిగ్గాకొట్టి పారేస్తారు.

కాని గురునాథరావు నిక్కార్సైన "ఏకలవ్యుడు." సీతని చూశాడు; ప్రేమించాడు, ఇంకెవరినీ చూడలేదు. చూసినా ప్రేమించలేదు.

సీతే నాజీవితం అనుకున్నాడు.

'సీతే నా జీవితగీతి' అని తరవాత ఓ ప్రేమ గీత వ్రాశాడు. బాగుండలేదంది సీత. సరేనని చింపేశాడు గురునాథం.

ఆ తరవాత ఎన్నాళ్ళయినా అతడు సీతని ప్రేమించసాగాడు (పాటలు వ్రాయకుండా) కాలేజీలో చాలమంది అతన్ని లోకువకట్టి, 'ఏకలవ్యుడు' (ఒక ప్రేయసిగలవాడు) అని పేరు పెట్టారు.

అయినా గురునాథరావు ఈ వ్రతం ఉల్లంఘనకి ఒడికట్టలేదు. అందులో కొన్నాళ్ళాయి, సీత, పక్కవాటా అమ్మాయి అయింది.

సీత కాఫీతాగడం ఆలస్యం అయితే, అసంగతి తెలియకపోయినా, ఇవతలి వాటాలో గురునాథరావుకి తక్షణం తలనొప్పి వచ్చేది, అతనికి తలనొప్పి వచ్చిన తక్షణం సీత కాఫీతాగేసేది తెలియకుండానే.

అందువల్ల, సీత హైదరాబాద్‌లో ఆ రాత్రి ఏ పదిగంటలకి పడుకొని ఉంటుం దన్న విషయం తెగని సమస్యఅయిపోయింది. ఇండియన్ స్టాండర్డ్ టైమ్ తెలిస్తే బాగుండు ననిపించింది.

అందువల్ల ఆరాత్రి పదిన్నర ప్రాంతాల్లో ఎవరో హఠాత్తుగా దబదబతలుపుకొట్టడంతో "ఇండియన్ స్టాండర్డ్ టైంఎంతో నాకు తెలియ చెప్పడానికి సీత పంపిన దూత" కాబోలు అన్న అభిప్రాయంతో గురునాథరావు చెంగున గంతువేసి పరుగెత్తి తలుపుతీసి, "ఎంత?"అన్నాడు అర్జంటుగా.

తలుపవతల నిలబడిన వ్యక్తి, నన్నటిపాటి చిన్న సైజు శాస్త్రీ బోల్డుసిగ్గుపడిపోయి, తల క్రిందుకైపోయి, సంతోషం ఆశ్చర్యం నటించి "మూడున్నరచాలు ఇప్పటికి" అంది టూకీగా.

మూసున్న తేవిటని గురునాథరావు ఉలిక్కిపడి కళ్ళు విప్పార్చిచూశాడు. "టీ, సిగరెట్లూ కూడా లేకుండా, లేవన్న సంగతి తెలియకుండా ఇలా రాత్రి మూడున్నరదాకా సీత గురించి బెంగెట్టుకుంటున్నాను కాబోలు" అనుకుంటూ.

ఐతే ఈ ఉత్తరక్షణంలో, ఎదటకనబడ్డశాస్త్రీకి సీత పంపతగు దేవదూతకి పోలికలేం కనబడ లేదు. గురునాథానికి.

"హరి నువ్వట్రా" అన్నాడు.

"కాదుమరి, ఫ్రీగా నేనే కవలం చేశా." అన్నాడు తుకారాం వినమ్ర భావంతో మందంగా నవ్వుతూ.

గురునాథం గలుక్కున తలుపు గడియ వేసేయబోయాడు.

కాని దూరదృష్టిగల తుకారం అప్పటికే తలుపువతల కాలు పెట్టేశాడు.

"మూడున్నర కాకపోతే రెండున్నర చాలుకే" అన్నాడు.

"అణాన్నర కూడా ఇవ్వను" అన్నాడు గురునాథం.

"సుకేద్గా ఎంతకావాలని నువో ఫోను రాజా లోపాల్లో అడిగావు. పోనీ అణా రూపాయిన్నయ్య టీ తాగిపోతాను." అన్నాడు తుకారాం. గురునాథం జేబులో సిగరెట్లు తీసుకుంటూ.

"దమ్మిడీకూడా ఇవ్వను... నే నడిగింది టైమెంత అని."

"బ్రదర్! నీ ఎడంగుండెలో పార్టీ షురుయింది?... ఇంత కర్కశంగా మాట్లాడు తున్నావే నీ హృదయం ఏమయిపోయింది అంట" అన్నాడు తుకారాం విస్తుపోయి.

"నాకేం తిక్కలేదోయ్. హైద్రాబాద్ వెళ్ళింది" అన్నాడు గురునాథం చిరాగ్గా.

"ఓసి ఇంతేగదా! మళ్ళా ఎల్లుండి సోమవారం పొద్దునే ఇక్కడ సిద్ధం అవుతుందిగా అప్పుడు వచ్చె చెబుదుగానిలే. ఇప్పుడు అడిన మాట తప్పకు... నాసత్యవంతుడివిగాదూ... నా హరిశ్చంద్రుడివిగాదూ."

"అట్టఅడు. సీత వదికోజాలదాకా రావందిగదా. ఎలాగే వస్తుందని ఎవరు చెప్పారు."

"తుకారాం న్యూస్ సర్వీస్ వారు సరియైన సమాచారాన్ని సరసమైన ధరలకే విక్రయించె దరు" అన్నాడు తుకారం.

"అక్షరలక్షలిచ్చేస్తాను. త్వరగా చెప్పు బాబూ."

"అక్కే మాటకదా లేక అరుపైసాలు ఇస్తేచాలు. వెళ్ళిదోసెడకాసులు పట్రా. ఒక్కొక్కటీ వద్దుగాని" అన్నాడు తుకారాం.

* * *

పైవిధంగా పావలక్కువ మూడు రూపాయలు పెట్టి గురునాథరావు కొనుక్కున్న సమాచారం సారాంశం, మూడో నాటికల్లా సీత హైదరాబాద్ నుండి తిరిగి రాబోతున్న దని.

"ఏం ఢిల్లీ వెళ్ళదా మరి? కొంపదీసి—" అన్నాడు గురునాథరావు.

"రైట్ సర్. కరెక్టండి. అక్షరాలా నిజ మండి. మీ కాబోయిన మామగారు అవాలను

ఉన్న మినిష్టరు అవటం లేదండి..."

గురునాథరావు ఉలిక్కిపడ్డాడు. "నీ పిచ్చ కాల చీకటినిండా వేలాది శ్రోతలు ఊళ్ళలో వింటున్నారేవిట్రా? ఎవడువాడు?" అన్నాడు కంగారుగా.

"ఏ అప్పుడే కాదు. ఆగండి" అన్నాడు తుకారాం. చీకట్లో కలిసిపోయినట్టు. ఆ అశరీర వాణి ఆగింది.

"మాటాడవేంరా" అన్నాడు గురునాథం విసుక్కుంటూ.

"...అదేనండి మీరనుకున్నట్టే... మా మావగారికి మినిష్టరు ఛాన్సు రాదుటండీ... అందుకేమో ఢిల్లీ ఇంకెందుకని..."

"ఛత్. సర్దుకొయ్యండి. మిమ్మల్ని కాదు. నన్నా వాడు అడిగింది" అన్నాడు తుకారాం కటిగా. అశరీరవాణి మళ్లీ ఆగిపోయింది.

"ఎవరువారు?" అన్నాడు గురునాథరావు.

"వారి పేరు కొలీపతిరావుగారులే. పొలిటికల్ ఎక్స్‌పర్ట్, తుకారాం న్యూస్ ఏజన్సీ డైరక్టరు... ఓనుగాని నేను అర్జంటుగా ఓపనిమీద వచ్చాను. విను"

"నాదగ్గిర ఇంక డబ్బు లేదు. ఉన్నా ఇవ్వను."

"పోనీ వద్దులే. చెప్పకోలేగా నీమనసుకరిగి నీకిష్టంలేకపోతే ఇవ్వద్దులే. అవునుగాని, నాకొంచెం పోగ్గాసంతకం పెట్టడం నేర్ప గలవూ" అన్నాడు తుకారాం.

"ఏం, గిరాకీ, చెక్కు బుక్కు దొరికిందా?"

"ఇంకాలేదు. కేపట్టించి దారుణంగా డబ్బొచ్చేస్తోంది. న్యూస్‌సర్వీస్ పెట్టాంగదా మరి... దానికోసంఅని చెక్కుల మీద సంతకం నేర్చుకోవద్దూ. అది మంచిదర్జాగా ఎవరికీ అర్థంకాకుండా నేను మళ్ళీ ఎప్పుడూ ఒక్కలాగే పెట్టడానికి వీలుగా ఉండాలి."

"అబ్బా. ఊహూ. బావుర్లికాని ఇద్దరొస్తాలి పోయిపడువుల్లారా నీ పలుకోలబాట చెవులేరుసు" అన్నాడు గురునాథరావు బద్ధకంగా ఆవలిస్తూ.

"పదమూడు" అంది కలుపుకొలి అశరీర వాణి.

"అబ్బబ్బ అవి పేకలు కావు సార్" అన్నాడు, తుకారాం విసుగ్గా...

"ఎవర్రాఅది. ఏమిట్రా కథ... ఇట్రమ్మను."

తుకారాం కొంచెం విసుగటించి, చీకట్లో నా శ్రీని వెలుగులోకి లాగాడు.

"వీరిపేరు శలీపతిరావుగారు. ఆవలిస్తే పేకలెక్కడతారు."

"ఎందుకూ? జబ్బా? పోలీవా?" అన్నాడు గురునాథరావు.

"కాదు కృష్టి. పొలిటికల్ ఎక్స్‌పర్ట్ దగ్గిర ఉండాల్సినవిద్య అదేగదా."

"ఆ. ఐతే ఇప్పుడు నాకు 18 పేకలున్నా

లేవా చేతికందడం గారంటీ అండీ" అన్నాడు పెద్దరు రామనాథంగారు నవ్వుతూ.

దానికి తకీమని కాదుగదా, ఇంకో నిమిషం తిరిగినాకూడా సుబ్బారావుగారికి జవాబు తోచలేదు.

కేసుపోయింది అని రామనాథంగారు అనబోతూఉండగా, "నాన్నోయ్ కాఫీ" అని కేక పెట్టింది సీత వంటింట్లోంచి.

ఒక్క అంగలో వంటింట్లోపడ్డాడు సుబ్బారావుగారు కూన్నయ్య అనుకొని.

"అబ్బ ఎంత వేడి. నాన్నా నీకిప్పుడు వేడి పానం బేటే బాగా ఒళ్లు మండుతూందికదూ" అంది సీత నవ్వుతూ.

"ఔనమ్మా. మరీ పొగరుగా మాటాడేవాడు. అసలు మంగే తప్పు. ఈ మధ్యతరగతి వాళ్ళకి చనువిస్తే నెత్తికెక్కిపోతారు." అన్నాడు. అంటూనే ఆయనకి బ్రహ్మాండమైన ఊహపోయింది. కూతురి మాటలు సాంతం వినకుండానే, మళ్ళీ ఉమ్మడి హాలిలోకి వెళ్ళాడు.

"అప్పుడే కాఫీ తాగేశారండీ!" అన్నాడు రామనాథంగారు. ఆయన కొత్తలో కొన్నాళ్లు లాయరుగారి దొంగదెబ్బలు తెలిసినా సహిస్తూ వచ్చాడు గాని ఆయన తననీ బాజమ్మకింద జమకడుతూన్నట్లు పసిగట్టి, కొట్లులా పుంజాలొన్నాడు.

"ఏమి కాఫీలోనండి దంమంగ ఉర్ద్ప పోమెత చెప్పినట్లు, మనందరికీ తాహతు మించిన గుణాలు అబ్బాయి." అన్నాడు సుబ్బారావుగారు.

"కాఫీకే అలాఅంటే ఎలాగండి. ఆ మాత్రం తాహతూ లేదనుకుంటే ఈ తాపత్రయాలెందుకట."

"దొరికింది చాన్సు" అనుకున్నాడు సుబ్బారావుగారు. అనుకుని దాడికి ఉపక్రమించాడు.

"ఏమిటండి సార్. మన తాహతు. ఏమిటంట. అసలు మన తలిదండ్రులకి పొగరాటున కొత్త దూరదృష్టి ఉండబట్టి ఏదో నాలుగక్షరమ్ముక్కలు నేర్పించారు. సరిపోయింది; ఇవాళ కాఫీలు తాగుతున్నాం. లేకపోతే ఈ నాడు మనం కూటికొంబండి లోటుకు బతకాల్సిన వాళ్లమేగా... అహా! సంగతి చెబుతున్నా. ఔనంటారా కాదంటారా" అన్నారు సుబ్బారావుగారు ధాటిగా. దెబ్బకి వచ్చాడు అనుకున్నాడాయన పుర్రెండి ఆనందంతో.

"ఖచ్చితంగా కాదంటానండి. మీ వాళ్ళ సంగతేమో నాకు తెలీదు గాని, మా పెద్దలకి దూరదృష్టి లేకపోవడం ఎన్నడూ జరగదు. ఒకవేళ వాళ్ళకి ఆదృష్టి లేక, నేనివాళ కూటికొ లోటుకొ వలసి వచ్చినా అందుకేం దిగులు పడను. రామనని కూటకొ లోటుకు బతుకుతాను. ఔనంటారా కాదంటారా" అన్నారు రామనాథంగారు.

"నాన్నోయ్! కాఫీ చల్లారి పోతోంది. తొరగారా" అంది తలుపవతలే ఉన్న సీత.

"వచ్చే వచ్చే వచ్చే" అని పరిగెత్తు కెళ్ళిపోయాడు జవాబు తోచని సుబ్బారావుగారు—

* * *

"నువ్వు గొప్ప రాజకీయనాయకుడివి, పెద్ద మినిష్టరువి అవబోతున్నావు" అని అన్నాడు ఓ జ్యోతిష్కుడు (ముందుగా తెచ్చి ఉంచుకున్న) ఢంకా మీద దెబ్బకొట్టి చెప్పేవరకూ ఆయన తోలుకోలేదు. ఆ తరవాత దినపత్రిక కొనివది వేసేవరకూ ఊరుకోలేదు. చదివేశాక అంతకన్న ఊరుకోలేదు. రామనాథంగారిని ఊదరగొట్టేశాడు.

"పేపరు చదవడం చాలా అవసరమండీ" అన్నాడు ఆయన్ని మరమ్మత్తు చేసే సత్సంకల్పంతో.

"మీరు రీయింట దిగినప్పటినించి ఆ ముక్క నేను చెబుతూ వచ్చాను గదా ఇన్నాళ్ళకి గుర్తించారన్న మాట" అన్నారు రామనాథంగారు నవ్వుతూ.

సుబ్బారావుగారు చిక్కి మొహం పెట్టబోతూ ఉండగా "నాన్నా ఒక్కసారిలారా" అని గావుకేక పెట్టింది సీత.

"వా తల్లే. మా ఇందిరే." అని మురిసిపోతూ పారిపోయారు సుబ్బారావుగారు.

"ఏవండోయ్ బావగారూ కేసుపోయిందనుకోండిగాని, ఇందిరెవరూ? మీ పిల్ల పేరు సీతగాదూ" అన్నారు రామనాథంగారు.

సుబ్బారావుగారు జవహర్ లాల్ నెహ్రూ అంత ఎత్తుసాగి, అక్కజించి రామనాథంగారిని "క్రేన్ పాట్ వ్యూ"లో చూసి, మందహాసం చేసి, మాట్లాడకుండా వెళ్ళిపోయారు; తరువాయికథ తెరమీద చూడండన్న తరహాలో.

నిజాని కాయన అంతవాడూ కావడం కూరాదని. ఢంకా పట్టుకొచ్చిన జ్యోతిష్కుడు దానిమీద అదేపనిగా వాయిస్తూ చెప్పాడు.

పోలికలుకూడా బోలెడున్నాయన్నాడు. జవహర్‌లాల్‌కి తోడు నీడ కుమార్తె ఇందిర ఒకర్తే. సుబ్బారావుగారికీ? సీత...కేవలం అదొక్కటే కారణంగా, ఈయన అమాంతం కేంద్రాధ్యాప మైనిష్టరు అయిపోక పోయినప్పటికీ ముందస్తుగా చిన్న మినిష్టరు—రాష్ట్రంలో అవుతాడుట. అలా అవాలని ఆయన చెప్పాడు.

(34-వ పేజీ చూడండి)

# నా నయాపైసా అనుభవం

## నయాపైసలు చేస్తున్న సందడి

మధ్యాహ్నం వేళ. వరండాలో కూర్చుని వారపత్రిక తిరగేస్తున్నా. "యేడి సెనక్కాయలు, యేడి సెనక్కాయలు"... ఎక్కడో కేకలు వినిపించాయి. ఆ కేకలు విని మంచంమీద పడుకున్న పెద్దమ్మాయి కూతురు కిందికి ఒక్క దూకు దూకి నా దగ్గరకు పరుగెత్తుకు వచ్చింది.

"అత్తా! యేసెనక్కాయలు కొనత్తా!" అంటూ మారాం చేయసాగింది. దానిముక్కు మీద కోపగించలేదేమో వేరుసెనగకాయ లమ్మే ఆ మనిషే ఇంటిముందు కొచ్చింది. పాపాయి గంతులేస్తూ "యేటి సెనక్కాయలూ ఇలా రా..." అని పిలవని పిలచింది. అదివచ్చి అరుగుమీద బుట్ట దింపుకుంది.

"ఏదీ; అర్ధణా కాయలివ్వు" అన్నా. "ఏందండి, అమ్మయిగోరూ, అర్ధణా కాయలు ఏమూలకి?"... అంది.

"చాల్లేవే! అర్ధణా కాయలు పాపచేతిలో పోయవే..." అన్నా. పాపచేతిలో కాయలు పోసింది. "పాపాయ్, మీ నాన్న ఇచ్చిన క్రొత్త డబ్బులు మూడు తీసుకురావే" అన్నాను. పాప లోపలకు పరుగెత్తి వాళ్ళమ్మదగ్గరనుండి మూడు నయాపైసలు తెచ్చింది గుప్పెట్లో ఉంచి జారిపోకుండా గట్టిగా పట్టుకొని.

"ఇదిగో, డబ్బులంటూ దాని చిమ్మట బుట్టలో ఆ మూడు నయాపైసలు పడేశాను. అది కస్సుమంటూ లేచింది. ఆమూడు నయాపైసలు పైకితీసి అటూ ఇటూ తిప్పుతూ "ఏందమ్మా, ఏళాకోళం; ఏనాటి దమ్మిడీ కాసులివి. ఈ దమ్మిడీలు అంటగట్టి అర్ధణా ఇచ్చేనంటన్నారు; సాలు, సాలు." అంటూ టప్పున ఆ నయాపైసల్ని క్రిందపడేసింది.

"అదొస్తే, ఏటి ఘంగతి నీకు తెలియను కున్నావే. ఇప్పుడు క్రొత్తగా వచ్చిన డబ్బులే ఇవి; వీటిని నయాపైసలు అంటారు..." అన్నాను. "ఏపోవమ్మా. ఏం పైసలో. అదేం నాకు తెల్దు. అర్ధణా కాయలు తీసికొని దమ్మిడీలు ఇస్తున్నావు. ధర్మమేనా? చదువుకున్నోరు," అంది.

నిన్నేం మోసం చేయటం లేదే. ఈ క్రొత్తపైసలు కానీకి రెండూ, అర్ధణాకి మూడూ చిల్లరగా ఇస్తారు. అందుకే నీకు అర్ధణా బదులుగా మూడు నయాపైసలు ఇచ్చాను" అన్నాను దానికి నచ్చచెప్పబోతూ...

"అయ్యో అయ్యో ఇదేం అన్యాయం అమ్మయిగోరూ. ఏంది కానీకి రెండు పైసలూ, అర్ధణాకి మూడుపైసలుఇత్తారా! ఎవురు చెప్పిన మాటమ్మ యిది. నాలాటి పేదముండకే దొరికిందా మీకు ఏళాకోళానికి" అంటూ విసవిసలాడింది.

"ఏమేవ్, నీ అర్ధణాడబ్బులు నాకక్కర లేదు. నీకంత నమ్మకం లేకపోతే ఇంకెవర్నయినా అడుగు ఈ నయాపైసా సంగతి; ఈ నయాపైసలు ఒకవందకలుస్తే ఒక్క రూపాయి అవుతుంది. ఇక అర్ధరూపాయికి ...అంటూ ఇంకా చెప్పబోతున్నా....

"సుబ్బరో, నా అర్ధణాడబ్బులు నాకివ్వండో, అని అది అలా అఘోరిస్తూంటే నీ గోడెక్కడేవిటే కుర్ర-ఆ అర్ధణా ఇచ్చి పంపేయకూడదూ"...అని అన్నయ్య, కేక వేయటంతో తప్పక నా నోరు మూసుకుపోయింది. పాప అర్ధణా తెచ్చింది. దాన్ని పదిలంగా దాచుకుంటూ "ఏ అన్యాయం, ఏ అన్యాయం; మాయదారి కాలం. కానీకి రెండుపైసలిత్తుంటే అర్ధణాకి నాలుగు పైసలురావొద్దూ. మూడితారట. మిగిలింది అప్పకి లాభం కామోసు. నాలాంటివోళ్ళనే కన్నుగప్పడం" అని గొణుగుకుంటూ వెళ్ళిపోయింది.

"ఏం అత్తా అలాచూస్తున్నావు" పాప పలకరించింది.

"ఛా! ఊరుకోవే నీమూలంగానే వచ్చిందంతా: చెప్పేది వినకుండా నన్నో దొంగదాని క్రింద జమకట్టేసి పోయిం దామనిషి" అన్నాను.

లీల—పెద్దాపురం

* * *

### బస్సు కండక్టర్ తో తగాదా

మావూరునుంచి భీమవరంకు పదణాలు పుచ్చుకుంటారు కారువాళ్ళు. బస్సెక్కి కండక్టరు చేతికి ఒకరూపాయి కాగితం ఇచ్చాను. అతను తిరిగి 36 నయాపైసలిచ్చాడు. "ఇదేమిటండీ మీరు పదణా తీసుకున్నారు. పట్టీప్రకారం పదణాలకు 62 నయాపైసలు. మీరు తిరిగి 38 నయాపైసలివ్వాలి." అనేసి, నా ప్రక్కనున్న పెద్దమనిషి వైపుచూశా "సబబేనా?" అన్నట్లు. ఆ పెద్దమనిషి "నేను చెప్పినది సబబే" అన్నారు. ఇంతలో మరొకాయన "అణాకు ఆరు నయాపైసలు, పదణాలకు 60 నయాపైసలు న్యాయంగా కండక్టరు 40 నయాపైసలు తిరిగి ఇచ్చేయవలసిందే," అన్నాడు. ఈమాట నాకు బాగానే ఉందనిపించింది. ఇంతలో కండక్టరుకు అరికాలిమంట నెత్తికెక్కింది. నాలుగు నయాపైసలు నష్టంవస్తుంటే అతను మాత్రం ఊరుకుంటాడా? "మీరు నాకు రూపాయి ఇచ్చారు-భీమవరానికి టిక్కట్ 10 అణాలు. నేను తిరిగి మీకు ఆరణాలు ఇవ్వాలి. అణాకు ఆరునయాపైసలు కాబట్టి ఆరణాలకి 36 నయాపైసలు, కావాలంటే తీసుకోండి" లేకపోతే బస్సులోంచి దిగిపోండి అన్నాడు.

అతనావిధంగా మాట్లాడకపోతే కొన్ని అర్ధణాదగ్గర నేను జగడమాడేవాణ్ణి కాను. ఖచ్చితంగా నాకు 38 నయాపైసలూ రావాలి

సిందే అన్నాను. అందరూ తలోమాటా మాట్లాడ్డంతో యుద్ధం పెద్దదయిపోయింది. ఈయుద్ధం పూర్తయ్యేటప్పటికి శివవరం చేరింది బస్సు. చేసేదిలేక కండక్టరు దగ్గర రూపాయి పుచ్చుకుని, ప్రక్కనున్న సోడాషాపులో మార్చి, 10 అణాలూ అతని కిచ్చి బయటపడ్డాను.

కట్టమూరి సోమేశ్వరశర్మ, జుత్తిగ.

* * *

కొత్త నాణెములు చెలామణీలోకి వచ్చిన మర్నాడు ఒక కార్డు కొందామని పోస్టాఫీసుకు వెళ్ళాను. అణా ఇచ్చి కార్డు ఇమ్మన్నాను. కార్డు ఇచ్చి ఒక నయాపైసా ఇచ్చాడు. "ఇదేమిటి కార్డు 0-0-9 పోతే నాకు కాణీ వస్తుంది. కనుక ఇస్తే కానీ ఇయ్యి. లేకపోతే కానీకి 2 నయాపైసాలు కనుక అవైనా ఇమ్మన్నాను. "లేదండి అణాకు ఆరు నయాపైసాలు. కార్డు ఖరీదు 5 నయాపైసాలు కనుక మీకు తిరిగి వచ్చేది ఒక నయాపైసా మాత్రమే" అన్నాడు. అరే! మొదటిబేరంలోనే నష్టమొచ్చేటట్లుగా ఉందని కొంసేపు ఆలోచించి 0-1-3 ఇచ్చి కార్డు ఇమ్మన్నాను. నా ఉద్దేశం ఏమిటంటే 0-1-3 కి 8 నయాపైసాలు. కార్డు ఖరీదు 5 నయాపైసాలు. కనుక నాకు వచ్చేది 0-1-3-0-0-9=0-0-6 లేక 3 నయాపైసాలు. కనుక ఎక్కువ నష్టముండదు లే అనుకొన్నాను. అతనుమట్టుకు నా చేతిలో ఒక కార్డు, ఒక కానీ, ఒక నయాపైసా పెట్టాడు. ఇదేమిటయ్యా ఇస్తే అర్ధణా ఇయ్యి లేకపోతే 3 నయాపైసాలు ఇమ్మన్నాను. అతని సమాధానం ఇది. "మరే ఇందాక అడిగారుగదా ఇస్తే కానీ ఇయ్యి లేకపోతే 2 నయాపైసాలు ఇమ్మని. అందుకని మీకు కావలసిన 3 నయాపైసాలు బదులు మీకు ఒక కాణీ ఒక నయాపైసా ఇచ్చాను. లెఖ్ఖ సరిపోయింది. ఇంకేమైనా కార్డులు కావాలా" అని అడిగాడు. ఇవ్వాల్టికి ఇది చాలు అని చెప్పి తిరుగుముఖంపట్టాను.

వి. మోహన్ కిషోర్ - బొంబాయి

* * *

## నయాపైసా ముష్టి

జేబులో చేయి పెడితే ఒక నయాపైసా నాణెం చేతికి తగిలింది. ఎదురుగా ఒక ముష్టి వాడు కన్పించాడు. "యిది ఎక్కడో ఎల్లాగూ జారిపోతుంది. యిది వీడికిచ్చేద్దాం." అనుకుని వాడిని పిలిచి, వాడికిచ్చాను. అది తీసుకుని వాడు "యిది ఎందుకు బాబూ" అన్నాడు. నాకు మతిపోయింది. "కొంపతీసి వీడు ముష్టివాడు కాడా!" అనుకున్నాను. అంతలోనే వాడు దీని కేటొస్తాది బాబూ? నేను మరో నాల్గు పైసాలు పోగు చేసి ఏదయినా కొనుక్కునేలోపల యిలాంటివి నా చింకిగుడ్డలలో నుండి పడి జారిపోతాయి. కానీపరకా యిచ్చే ధర్మదాతలు కూడ యిప్పుడివే యిస్తున్నారు. అన్నియిదాల గవర్నమెంటు మా కడుపు కొట్టింది. అటుచూస్తే దుకాణాల్లో ధర పెంచేసినారు. ధర్మం చేసేవారు ఎందుకూ కాని ధర్మం చేసేంలాభం బాబు? ధర్మం చేస్తున్నామనే పేరుకు చేస్తున్నారుగాని ఆ పుచ్చుకున్నోడికి ఏమయినా కడుపు నిండదని చేయటంలేదు." అన్నాడు.

"చావ్డ గొడవొచ్చిందే" అనుకుని వాణ్ణి ఎలాగ అయినా వొదిలించుకుందుకు యింకో పాత కానీ యిచ్చి అక్కడనుండి వెళ్ళిపోయాను.

జయంతి లక్ష్మణరావు,
షాలీమార్ [కలకత్తా]

* * *

## వ్యాపారస్తుల ఇబ్బంది

మా వ్యాపారవిషయాలలో మరి అగచాట్లు పడాల్సి వచ్చింది ఈ నయాపైసలతో. ఎవరైనా ఏ ఒక అణా కానీలో వస్తువులు కొనుక్కోడానికి వస్తే వారు ఒక రూపాయినోటు తీసుకవస్తారు. చిల్లర నయాపైసల రూపములో యిస్తే "మా రూపాయి మాకు యివ్వండి; మేము వేరే దుకాణములో కొంటా"మని చెప్తారు. మరికొందరు అన్నీ నయాపైసల రూపములో తెస్తారు. "మాకు రూపాయిల రూపములో తెమ్మంటే "కావలిస్తే తీసుకో; లేకపోతే మరొక దుకాణ"మంటారు. ఇలాగ యివ్వవలసివచ్చినా, తీసుకొనవలసివచ్చినా ఇబ్బందే. డబ్బు పెట్టెలు రాత్రి లెక్కవేస్తే వటి నయాపైసలు తప్ప వేరేకనబడదు. దానికే సంచులునింపుకొని సరుకులు కొనడానికిపోతే వారి అల్లరి మరీ బాధ; నోట్లు తెస్తే సరుకు యిస్తామంటారు.

నయాపైసా బాధితుడు,
గుంటూరు సజ్జరాయప్ప
బెంగుళూరు. ★

# క్షత్రియ మహిళ

## ౧

రాజా హారసింహుని పంచకల్యాణి శర వేగంతో రివ్వున దూసుకుపోయింది. ఆ అశ్వం వెంటనంటిపోయే నలుగురైదుగురు వేటకాండ్ర గుర్రాలుకూడా వాయువేగంతో డెక్కలు దిక్కరించి మెరుపుల్లా పరుగులు పెట్టాయి.

వారందరు కలిసి ఒక అడివిపందిని వెంట దరుముతున్నారు. అది వారెవ్వరికీ అందకుండా మెుప్పతిప్పలు పెడుతూ మూడు చెరువులనీళ్ళు తాగిస్తూంది.

అసలది అవలీలగా వారికి దొరికిపోయేదే!

ఆ అడివిపంది మిట్టమధ్యాహ్నంవేళ ఒక కొండగుహలో పడుకుని హాయిగా నిద్ర పోతూంది. కాని రసపుత్రవీరుల కొక నిద్ర పోతూన్న అడవిపందిని బల్లెంతో పొడిచి చంపడం అంటే చాలా పెద్ద తలవొంపు! పందిని కొట్టినవాడే బంటు! అందులోను ఎదిరిమీదపడి పరిగెత్తుకు పోయే అడివిపందిని బల్లెంతో పొడిచి చంపినవాడొక పెద్దబంటు! అది ఆకాలంలో గొప్ప వేట మర్యాద. వారందరు పాలవంటి శుభ్రక్షత్రియ వంశంలో అవతరించిన మహా యోధులమని రొమ్ములు విరుచుకుని విర్రవీగే వీరవరేణ్యులు!

వారి నాయకుడు రాజా హారసింహు డిప్పుడలనే చిత్తూరు సింహాసనంపై పట్టాభిషిక్తుడయిన మహారాజు! పట్టాభిషేకోత్సవాల మహోత్సాహంతోనే అతడూ అనుచరులతో కలిసి అనేకవిధాలుగా మృగయా వినోదం చవిచూస్తున్నాడు. అటువంటివాడొక కొండగుహలో పడుకుని హాయిగా నిద్రపోయే అడివిపందిని, బల్లెంతో పొడిచి చంపడాని కంగీకరిస్తాడా? కనుకనే ముందుగా వారంతా రాళ్ళువిసిరి దానిని బెదరగొట్టారు. లేస్తూనే అది ఒక పెద్ద దౌడు తీసింది. అంతలోనే కనుమరుగై ఆమహారణ్యంలో ఎక్కడో దాక్కుని ఇట్టే మాయమైపోయింది!

హారసింహు డనుచరులతో కలిసి ఆ అరణ్య ప్రాంతం అంతా గాలించాడు. ఎక్కడా దానిజాడే పొడకట్టలేదు!

వారంతకుపూర్వం పెద్దపులులు, చిరుతలు, ఎలుగుబంట్లు మొదలయిన క్రూర జంతువుల నెన్నింటినో సంహరించారు. అదేమి దురదృష్టమోగాని ఆ ఒక్క అడవి పంది వారి కందకుండా తప్పించుకుని పారి పోయింది! అది వారందరికీ ఒక పెద్ద తలవంపయింది. దాని నెలాగయినా వేటాడి తీరాలనీ, అంతవరకు వేటముగించి వెళ్ళిపోకూడదనీ వారందరు గట్టిగా పట్టుదలబిగించారు.

ఆ అరణ్యప్రాంతం అంతా గాలించగా గాలించగా కొంతసేపటికి వారి కొకచోట కంగారుగా పారిపోయే అడవిపంది అడుగు జాడలు కొన్ని కనిపించాయి. వారందరికీ వెదకబోయే తీగ కాళ్ళకే తగిలినట్టయింది. వెంటనే దాని అడుగుజాడల మార్గంలో తమ గుర్రాలు పరుగెత్తించారు.

అప్పటికి మూడుఝాముల పొద్దు తిరిగింది. కొంతదూరం పోయేసరికి వారికొక పెద్ద జొన్నచేను తగిలింది. అది కుమారొక మనిషి

## ప్రాచీన గాథాలహరి

ఎత్తున బాగా ఒత్తుగా పెరిగినచేను. అడివి పంది అడుగుజాడలా జొన్నచేలో ప్రవేశించి అక్కడే అదృశ్యమై పోయాయి!

వారికిక ఏమిచెయ్యడానికీ పాలుపోలేదు. అది నాలుగువైపులా బాగా విస్తరించిన పెద్ద చేను. కొంచెం దూరంలో వారికొక మంచె కనిపించింది. మంచెమీద కూర్చుని జొన్నకంకి గింజలు నములుతూ పిట్టల్ని బెదరగొడుతున్న ఒక కన్నె పడుచు వారిని చూస్తూనె లేచి నిలబడింది. మనుషులు నడిచే కాలిబాటమ్మటే గుర్రాలు నడిపించుకుంటూ వారంతా ఆ మంచె సమీపించారు. అందరు మంచెదగ్గరికి రాగానే ఆ కన్నెపడుచు లేడిపిల్లలా చెంగున నేలమీదికి దూకింది.

హారసింహుని అనుచరులలో ఒక వృద్ధుడామెదగ్గరికి నడిచి వెళ్ళి ఎంతో ఆత్రంగా అడిగాడు:

"అమ్మాయీ! నీకిక్కడ ఎక్కడైనా ఒక అడివి పంది కనిపించిందా? అది ఇపుడిప్పుడే ఈ చేలో దూరిందిలే!"

ప్రశ్న వింటూనే కన్నె పడుచు చెంగున మంచె మీది కెక్కింది. అలాగే కొంచెం సేపు కొన్ని జొన్నకంకి గింజలు నములుతూ నాలుగువైపులా బాగా పరకాయించి చూచింది:

"అదు గదిగో! అమూల ఏదో కదులుతూన్నట్లుంది. సందేహం లేదు! అది అడివి పందే! పరిగెత్తండి!"

రౌతులంతా తమ గుర్రాలటువైపు పరిగెత్తించారు. ఆ ప్రాంతం అంతా గాలించారు. కాని వారికెక్కడా అడివిపంది జాడే కనిపించలేదు! గుర్రాలతోపాటు తాముకూడా నురగలు కక్కుకుంటూ తిన్నగా మంచె దగ్గరికి తిరిగి వచ్చారు. పడుచు వారందరినీ చూచి కలకలా నవ్వింది:

"అయ్యో! ఇంత శ్రమ పడ్డారే! మీ కెవ్వరికీ అది కనిపించనే లేదా!"

వారిలో ముసలి రౌతు కొంచెం విసుగ్గ పడ్డాడు:

"ఎంత వెదికినా మా కెవరికీ అది కనిపించ లేదు. తల్లీ!"

ఈమారా కన్యక మరి ఒక జొన్నకంకి పరపరా నమిలింది. ఇంకొకవైపు పరకాయించి చూచింది.

"అదుగో! అడివిపంది! వెళ్ళండి! వెళ్ళండి! పారిపోతూంది."

మళ్ళీ గుర్రాలన్నీ నురుగురు కక్కుకుంటూ అటువైపు పరిగెత్తాయి. ఒక అర గడియలోనే అవ్వన్నీ మళ్ళీ తిరిగివచ్చాయి. ఈమూ రాపడుచు మరింతగా విరగబడి నవ్వింది! ఆ నవ్వు సవ్వడి రౌతులందరికీ కొంచెం వింతగానే వినిపించింది. ఆ కొంటె పిల్ల తమతో పరిహాసచకాలకు దిగిందేమోనని వారికి కొంచెం అనుమానం కలగకపోలేదు. అయినా ముసలి రౌతు మరి గత్యంతరంలేక ఉసూరుమని నిట్టూర్చాడు:

"ఎక్కడా కనబడలేదమ్మా! అసలు నీ

పి. గణపతిశాస్త్రి



కది తిన్నగా కనిపించిందా ?"

"అయ్యో! లేకపోతే నేనలాగ చెబుతానా! ఎంతమాట! మీరే దాన్ని పట్టుకో లేకపోయారు! అంతే! నేనైతే దాన్నీపాటికి నా బల్లెంకొసకి గుచ్చి బరబరా ఇక్కడికి ఈడ్చుకు వచ్చిఉందును!"

ఆ మాట లా వీరవరేణ్యు లందరికీ వాడి బల్లెంపోటుల్లా సూటిగా గుండెల్లో గుచ్చుకున్నాయి. రాణా హరసింహుడా పడుచు మాటల తీరు విని మరింత ఆశ్చర్యపోయాడు. ఆమె కింకా పద్దెనిమిది ఏళ్ళయినా తిన్నగా నిండాయో లేదో అన్నట్లు మిసమిసలాడింది. చెంపలవరకు వ్యాపించిన చారడేసి కళ్ళల్లో కొంత అమాయకత్వము, కొంత దుందుడుకుతనము, కొంత మితిమీరిన గుండె నిబ్బరము తొణికిసలాడాయి. హరసింహు డలాగే ఆశ్చర్యపోతూ అడిగాడు:

"సరే! నీ బడాయిమాటల కేమిలేగాని మళ్ళీ ఆ మంచెమీదికెక్కి అది ఎక్కడయినా కొంచెం మెదులుతూంటే చూడు."

వెంటనే ఆమె చెంగున మంచెమీదికెక్కి మళ్ళీ నాలుగు మూలలా పరకాయించి చూచింది:

"అదిగో! దూరంగా ఆ మూలేదో కదులుతూన్నట్టుంది!" అదిగో! అదిగో! అటు వెళ్ళండి!"

ఆ మాటలు వింటూనే అశ్వికులంతా అటువైపు పడిపోయారు! మళ్ళీ ఇంకొక అరగడియలో అలాగే తిరిగివచ్చారు. సుమారు మనిషెత్తువరకు ఒత్తుగా పెరిగిన ఆ జొన్నచేలో వారికంతా అంధకార బంధురంగానే కనిపించింది. ఈమారు వారెవరి ముఖాలలోను కత్తివాటు వేసినా నెత్తురుచుక్క కనబడలేదు. ఆముఖాలుచూచి ఆ బాలిక అలాగే మంచె మీదకూర్చుని విరగబడి నవ్వింది. తనపక్కనే పడి ఉన్న ఒక బల్లెం జాగ్రత్తగా గురిచూచి చేతికొద్దీ గట్టిగా విసిరింది. దూరదూరంగా ఆ అడివిపంది భరింపరాని వేదనతో అరిచిన సవ్వడి వినిపించింది.

ఆమె చెంగున కిందికి దూకి, మెరుపులా ఆ అడివిపంది పడి ఉన్న చోటికి పరిగెత్తింది. చచ్చి పడిఉన్న దాని చెవి దొరకబుచ్చుకుని బరబరా అక్కడికి ఈడ్చుకు వచ్చింది. ఇంతవరకు ఆమె అందంచూచి మైమరచిన హరసింహుడామె ధైర్యసాహసాలు, జబ్బ సత్తువ, చాతుర్యము చూచి, నోట మాట లేక అలాగే నిర్ఘాంత పోయి నిలుచున్నాడు. ఆ యువతి వారందరి ముఖాలు కొంచెం పరకాయించి చూచింది:

"పాపం! మీరంతా బాగా అలిసినట్టున్నారే! దీన్నికూడా మీతో తీసుకు వెళ్ళండి!"

ఆమె అడివిపందిని వారి కాళ్ళదగ్గరికి ఈడ్చింది. వారందరికీ తమ ముఖాలన్నీ నేల మీద భోర్లాపడవేసి, బరబరా ఈడ్చినంత తలవంపయింది! అయినా వారంతా అదిగమనించనట్లుగానే పైపై కామెకెంతో మెచ్చుకున్నారు. మరుక్షణంలోనే తమ గుర్రాలెక్కి ఆ సమీపంలో గుబురుగా పెరిగిన తాటితోపులోపడి అదృశ్యమైపోయారు!

## ౨

ఆనాటి వేటమర్యాదలలో ఒకరు వేటాడుతున్న జంతువు నింకొకరు చంపివెయ్యడమే ఒకపెద్ద తలవంపు! అందులోను అది అడవిపందివేట! తత్రాపి మహా వీరవరేణ్యు లెంత ప్రయత్నించినా వేటాడలేని పిడుగువంటి అడవిపందిని ఆ[illegible] ఒక్క బల్లెపువేటుతో చంపివేసింది! ముగ్గురు సాయంపట్టినా మోసుకు రాలేని అడవిపందిని ఆమెఒక్కత్తే చెవిపట్టుకుని బరబరా వారిదగ్గిరికి ఈడ్చుకువచ్చింది. పైగా దాన్ని తీసుకుపొమ్మని దానంచేసింది!

ఆమె తెలిసి చేసినా తెలియకచేసినా అదంతా వారికొక పెద్ద తలవొంపుగా పరిణమించింది.

పొద్దు వాలేసరికి వారంతా ఒకకొలని దగ్గిరికి చేరుకుని గుర్రాలకు నీళ్ళుపట్టారు. నీరసంగా గుర్రాలు తోలుకుంటూ ఇంటిముఖం పట్టారు.

రాణా హరసింహు డదంతా తలుచుకుని మరింత కుంగిపోయాడు. గుర్రం ఎటుపోతున్నదీ అతనికి గుర్తులేదు. అది ఎలాగో అలాగ కాళ్ళీడ్చుకుంటూ నడక సాగించింది. మిగిలిన రౌతులంతా లోలోపలే మథనపడుతూ అలాగే స్వారీ సాగించారు.

అంతలో ఒక వడిసెలరాయి రివ్వున ఎగిరి వచ్చి హరసింహుని పంచకళ్యాణి కాలికి

# క్షత్రియ మహిళ

తగిలింది. వెనువెంటనే అది ఒక్క గంతువేసి నేలమీద కూలబడిపోయింది. హరసింహుడు కూడా దానితోపాటు నేలమీద కూలబడిపోయాడు. గుర్రం కాలికి దెబ్బతగిలినచోట పెద్ద గాయమయింది. రక్తం ధారకట్టి ప్రవహించింది!

మిగిలిన రౌతులు వెంటనే తమ గుర్రాలు దిగి పంచకళ్యాణి కాలికి ఏవో గచ్చాకు పుచ్చాకు వైద్యాలు చేశారు. కాని అది మళ్ళీ తిన్నగా నడవలేకపోయింది. అంతలోనే జొన్నచేను కాపలాకాచే పడుచు రొప్పుకుంటూ అక్కడికి పరిగెత్తుకువచ్చింది. రాణా హరసింహునికి సవినయంగా నమస్కరించి దోసిలి ఒగ్గి నిలబడింది. ఎంతో భయభక్తులతో విన్నవించింది:

"బాబూ! నావల్ల పెద్ద అపచారమే జరిగిపోయింది. పిట్టకి తగలవలసిన వడిసెలరాయి పొరపాటున మీ గుర్రం కాలికి తగిలినట్టుంది. నన్ను మన్నించండి!"

హరసింహు డొకనిమిషం రెప్పపాటు లేకుండా ఆమె ముఖవైఖరి పరిశీలించాడు. ఆమె పరియాచకమే ఆడుతూందో! ప్రాణభయ పడుతూందో! అతని కేమీ అంతు చిక్కలేదు! అలాగే ఆమె వైఖరి పరీక్షిస్తూ పంచకళ్యాణి పక్కనే నిలుచుండిపోయాడు. కొంచెం దూరంలో నిలబడి అది అంతా గమనిస్తున్న ముసలిరౌతొక్కడు వచ్చి ఆమె కెదురుగా నిలబడ్డాడు:

"అమ్మాయీ! మీ నాయనగారి పేరేమిటమ్మా!"

"చందన సింహులు!"

"అలాగ చెప్పమరి! ఆతండ్రికి తగిన బిడ్డవే!"

"మరి నీ పేరు?"

అన్నాడు రాణా హరసింహుడు.

"హీర"

"నిజంగా వజ్రపు తునకవే!"

అని మెచ్చుకున్నాడు ముసలి రౌతు.

"తమ నామధేయం!"

ఎంతో వినయంగా అడిగింది హీర రాణా హరసింహుని వైపు తిరిగి.

"వారు చిత్తోడ్ దుర్గాధీశ్వరులు మన రాణా హరసింహ మహారాజులుంగారు! వారినే ఎరగవా?"

ఆశ్చర్యపడ్డాడు ముసలిరౌతు.

"అయ్యో! అలాగా! నిజంగా ఈనాడు నావల్ల పెద్ద అపచారమే జరిగిపోయింది!"

మళ్లీ పశ్చాత్తాప పడింది హీర. తిరిగి అందరికీ ఎంతో వినయంగా నమస్కరించింది.

"పోనీలే! కొట్టాలని కొట్టావా. ఏమన్నానా! నీకేమీ భయం లేదులే"

అభయమిచ్చాడు ముసలిరౌతు. వెంటనే వారంతా ఆ పంచకళ్యాణిని వెంటబెట్టుకొని వెళ్లిపోవాలని ఆలోచించారు. ఒకరౌతు తనగుర్రం రాణాహరసింహుని కర్పించాడు. పంచకల్యాణికళ్లెం చేత్తో పట్టుకొని రాణా వెనకాలే సాగిపోయాడు.

హరసింహుడు కొంతదూరం గుర్రం మీదస్వారీ సాగించాడు. అతని, కెవరో విరగబడి నవ్వుతున్న సవ్వడి వినిపించింది. నిజాని కప్పటికే రాణా చాలాదూరమే సాగిపోయాడు. అప్పుడతనికి హీరనవ్వు వినిపించే అవకాశమే లేదు! అయినా మనసాపృక ఒకమారు వెనుదిరిగి చూచాడు. దూర దూరంగా తోటవనంమధ్యలో హీరసుస్మితం వజ్రమాణిక్యంలా మెరిసింది. ఆ వజ్రం అతని హృదయంలో గాటంగా నాటుకుపోయింది.

ఆనాటిరాత్రి అంతా అతనికి ఒక్క కునుకు పట్టలేదు! పంచకల్యాణి కాలికి తగిలిన వడిసెలరాతి గాయం నాలుగైదు రోజులలో మానిపోయిందిగాని అసంఘటనాఘాతంవల్ల అతని హృదయంలో ఒక పెద్దగాయమేఏర్పడింది. అది ఎన్నాళ్లకీ మానిపోలేదు. పుండుసలిపినట్టది అలాగే సలిపింది.

రాణా తన రాణివాసంల్లోని పరిచారకులను కొందరిని పిలిపించి హీర పుట్టుపూర్వోత్తరాలన్నీ తెలుసుకున్నాడు. దర్శనానికి రావలసిందని తన ప్రధానామాత్యుని ద్వారా హీరతండ్రి చందనసింహునికొక సందేశం పంపించాడు.

## 3

చందనసింహునికి కలిగినవారయిదారుగురు ఆడపిల్లలే. హీర వారందరిలోను పెద్దపిల్ల.

చందనసింహుడు పూర్వపు చిత్తూరు రాణాకొలువులో పనిచేసిన ఒక సామాన్య క్షత్రియయోధుడు. పెద్దతనం బాగా పైబడడంవల్ల కొంతకాలానికతడు తనకొలువు చాలించుకొన్నాడు. రాణాహరసింహుని తాతముత్తాతల కాలంనించీ తమవంశంవారికి పరమాన్యంగా సంక్రమించిన జొన్నచేను దున్నుకుంటూ తనవార్ధక్యం సుఖంగా వెళ్లబుచ్చుకుంటున్నాడు. జొన్నచేనికి కొంచెం దూరంలో ఒక పెద్దమర్రికింద నిర్మించుకొన్న చిన్నకుటీరమే అతనికొక రాజభవనంలాకనిపించింది. మనస్సులో కొంచెం సంతృప్తిఅంటూఉంటే మనిషికిక కావలసింది ఏముంటుంది!

ప్రధానామాత్యుని కబురందగానే అతనికి కొంచెం అనుమానమే కలిగింది. స్వతః అతడు రాణాలకు, అహంకారపూరితులయిన వారి అధికారులకు దూరదూరంగా తొలిగిపోయే మనిషి. ఐశ్వర్యం పట్టకపోయినా అతని అభిజాత్యానికీ, అభిమానానికీ ఎన్నడు, ఎక్కడ కొరత కలగలేదు. అతనిలో పరిపరి విధాల మథన బయలుదేరింది. అది కనిపెట్టి హీర తనకు, రాణాకు మధ్య నడిచిన వ్యవహారం అంతా పూసగుచ్చినట్లతనితో చెప్పివేసింది. దానితో అతనిగుండెల్లో రాయి పడింది. రాణా తనమీద, తన కుమార్తెమీద బాగాఆగ్రహించి ఉంటాడనీ, ఏదో ఆపద తనమీద విరుచుకుపడనున్నదనీ భయపడ్డాడు. ఏదిఏమైనాసరే అని గుండె రాయిజేసుకుని ముందుగా మహామాత్యుని దర్శనానికి వెళ్లాడు.

కాని మహామాత్యు డతనినెంతో గౌరవించాడు. మొట్టమొదట చందనసింహుడా మర్యాద ధోరణి చూచి నిర్ఘాంతపోయాడు. మహామాత్యుడు నెమ్మదిగా అసలు కథలోకి దిగివచ్చాడు:

"రాణాహరసింహులు మీ అమ్మాయి హీర ధైర్యసాహసాలకెంతైనా సంతోషించారు."

"ఏదో తెలియనిపిల్ల! దానికేమి తెలుసును! తెలిసీతెలియని కొంటెతనంవల్ల అది ప్రభువువారియెడల అపచారమేమైనా చేసిందేమోనని భయపడుతున్నాను, బాబూ!"

"ఎంతమాట! అలాంటిదేమీ లేదు! పైగా రాణావారా అమ్మాయిని వివాహం చేసుకుని చిత్తూరు మహారాణిని చెయ్యాలని అభిలషిస్తున్నారు!"

ఆ మాట విని చందనసింహు డుబ్బితబ్బిబ్బై పోగలడని అనుకున్నాడు మహామాత్యుడు. కాని అటువంటిదేమీ జరగలేదు. కానీ చందనసింహు డామాట విని నిర్ఘాంతపోయాడు. "ఎంతటి రాణా అయితే మాత్రం! తన కొలువుకూటానికి పిలిపించి, మంత్రిమాత్రునిచేత వివాహ ప్రస్తావన చేయిస్తాడా? ఇదెక్కడి రాచమర్యాద?"

అని లోలోపల చాలా కించపడ్డాడు. అదీగాక తనవంటి అతిసామాన్య సంసారికీ, చిత్తూరు రాణాకు మధ్యన జరిగే వియ్యం నలుగురిలోను నవ్వులపాలు కాగలదని అతనికి స్ఫురించడానికాట్టేసేపు పట్టలేదు. అయినా ఎంతో మర్యాదగా నచ్చజెప్పాడు:

"అన్నీ తెలిసినవారు తమకు వేరే విన్నవించవలసిం దేముంది? నక్కఎక్కడ? నాగలోక మెక్కడ! మాకు, వారికీ మధ్యన ఈ వివాహ ప్రస్తావన ఏమిటి చెప్పండి! ఇదేదో పరిహాసం కాదుగదా?"

అని చల్లచల్లగా చప్పరించివేశాడు. మంత్రి అనేక విధాలుగా అతనికి నచ్చ జెప్పాడు. వివాహానికి ముఖ్యంగా రాణా అతనికో చిన్న సామంతరాజ్యం అరణంగా బహూకరించగలరనీ, అటువంటి లోటుపాట్లేమీ రానివ్వరనీ గట్టిగా భరవసా ఇచ్చాడు. కాని మహామంత్రి తన లేమి సంగతి ఎత్తగానే చందనసింహుని కెక్కడ లేని అభిజాత్యము పొడుచుకు వచ్చింది. దానితో అతను మరింత బిర్రబిగుసుకు పోయాడు. కాని ఎంతో మర్యాదగానే మరి ఆ వివాహ ప్రస్తావన తనవద్ద ఎత్తవద్దని మహామంత్రితో మనవిచేసుకున్నాడు. మహామాత్యుడు మళ్ళీ కొంచెం నయాన భయాన అతనికి నచ్చజెప్పాడు. కాని చందనసింహుడు వినిపించుకోలేదు. మహామాత్యునికిక ఒళ్ళు మండిపోయింది:

"తలుచుకుంటే రాణాగారు మీ మడి మాన్యాలన్నీ స్వాధీనం చేసుకుని క్షణంలో మీ హీరను బలవంతంగా వివాహం చేసుకోగలరు! తెలిసిందా! కొంచెం జాగ్రత్తగా ఆలోచించుకుని మరీ సమాధానం చెప్పండి!"

మంత్రి పట్టరాని క్రోధంతో గజగజ వణికాడు. చందనసింహుడంతకన్నా రెచ్చిపోయాడు.

"మీరుకూడా ఎవరితో మాట్లాడుతున్నారో కొంచెం ఆలోచించుకుని మరీ మాట్లాడండి! సామాన్య సంసారుల మయినంత మాత్రాన మీ బెదిరింపులకు జంకి లొంగిపోతామనుకున్నారేమో! నా బొందిలో ప్రాణం ఉండగా అటువంటి పని ఎన్నడు జరగనేరదు! జాగ్రత్త!"

చందనసింహుడు ఒరలోని కత్తి పైకిలాగి అది తళతళ మెరిపిస్తూ వీరవిహారం చేశాడు. ఉత్తర క్షణంలోనే ఒక్క దూకులో అతడక్కడినుంచి బైటపడి తిన్నగా తనపుటేరానికి తిరిగి వచ్చివేశాడు.

మధ్యేమార్గంలో చందనసింహుడు తన సాహసం తలచుకుని ఉబ్బి తబ్బిబ్బై పోయాడు. కుటీరానికి తిరిగి వస్తూనే భార్యతో తనకు, మంత్రికీ మధ్య జరిగిన వివాదం అంతా ఏకరువుపెట్టాడు. అనాటితో, కాచిన పాలవంటి తన వంశప్రతిష్ఠ వేయి రెట్లినుమడించిందని ఎంతో అంహకరించి మాట్లాడాడు. చందనసింహుని భార్య అదంతా విని నిలువునా నిర్ఘాంతపోయింది:

"అయ్యయ్యో! ఎంత పని చేశారు. స్వయంగా రాణావారే మన హీరను వివాహం చేసుకుంటామంటే వల్లకాదని వీరాలాపాలాడివచ్చారా? మీ వీరాలాపాలకిదా అదను! చాలు! చాలెండి! ఎవరైనా వింటే నవ్విపోతారు! వెంటనేవెళ్ళి రాణా వారి కాళ్ళమీదపడి చేసినతప్పు మన్నించమని ప్రార్థించండి! లక్షణంగా పిల్లనిచ్చి వివాహం చెయ్యండి! మీకసలు కయ్యానికి కాలుదువ్వడంతప్ప ఇంకేమీ తెలియనే తెలియదే! ఎంతటి విడ్డూరం జరిగిందివేళ!"

అని ఆవేశపడిగా పుండు సలిపినట్లు సలపడం మొదలు పెట్టింది.

ఆ క్షణంనించీ వారిద్దరిమధ్య పెద్ద రగడ చెలరేగింది. భార్య తక్షణంవెళ్లి రాణాకు క్షమాపణ చెప్పకోమని శతవిధాల పోరు పెట్టింది. చందనసింహుడు తన బొందిలో ప్రాణాలున్నంతవరకు అటువంటిపని జరగనేరదని భీష్మించుకుని కూర్చున్నాడు. తానెన్నడు బెదిరింపులకు లొంగేది లేదని కారాలు మిరియాలు నూరాడు. అపైన అటకమీద దాచిపెట్టిన కత్తుల్ని, కటారులను పైకితీసి నూరడం మొదలు పెట్టాడు. అయినా భార్య అతనిని విడిచిపెటలేదు! క్రమంగా వారిద్దరిమధ్య పచ్చగడ్డి వేసినా భగ్గుమనిమండింది. ఆ రభస క్రమంగా బాగా మితిమీరిపోయింది.

ఒకనాటి సాయంకాల వేళ హీర ఇంటికి తిరిగివచ్చే వేళకా గందరగోళం మళ్లీ ప్రారంభమయింది. హీర ఇక మాట్లాడకూరుకోవడం మంచిదికాదని నిశ్చయించింది:

"అమ్మా! ఎందుకింతపోరు! నాకీసంబంధము సుతరామూ ఇష్టంలేదు! ఎంతటిరాణాలయితేమాత్రం! దౌర్జన్యంచేస్తామని బెదిరిస్తారా? నీ వెంతపోరినాసరే! నేనీవివాహానికంగీకరించేదిలేదు! మళ్ళీ ఎప్పుడయినా నా ఎదుట ఈ మాట తలపెట్టావంటే ఆ మరుక్షణమే బల్లెంతో పొడుచుకొని చచ్చిపోతాను. దానితో అందరిపీడ ఒక్కసారిగా విరగడైపోతుంది అంతే!"

రుసరుసలాడుతూ అక్కడినించి వెళ్ళిపోయింది హీర.

చందనసింహుడు యుద్ధరంగంలో ఎందరెందరో మహావీరులను సంహరించి అసహాయశూరుడనిపించుకున్నాడు. కాని భార్య పోరంటే అతనికక్కడలేని భయము పుట్టుకొస్తుంది! ఇన్నాళ్లనించీ అతడామెతో కేవలం ఏకాకిగానే పోరాడి బాగా అలిసిపోయాడు. ఇప్పుడు కూతురు కూడా [illegible] అతని కొక్కమారుగా కొండంత ధైర్యం వచ్చింది:

"విన్నావా! పిల్ల అన్నమాట! అందుకనే మన పెద్దలేగూటిచిలక ఆగూటి పలుకే పలుకుతుందని అంటారు! పెద్దలమాట ఊరికే పోతుందా?"

"అదిమాత్రం పింఛీకైపోయిందే! మహామాత్యులా మాకూతురే! కానివ్వండి! ఎంతకీ దైవఘటన ఎలాగుందో అలాగే జరుగుతుంది."

చందనసింహుని భార్యనోట తప్పటికి కొంచెం శాంతించింది. కాని ఆమె గుసగుసలాడడం మాత్రం మానలేదు. కూతురింటివద్దగ లేనప్పుడు భర్తతో అమాంతం తలపెట్టి అనేక విధాల వాపోవడం మొదలుపెట్టింది. రాణాకు కోపం వస్తే ఏమయినా చెయ్యగల

# ★ క్షత్రియ మహిళ ★

...ని భయపెట్టింది. కాని చందనసింహు డది లక్ష్యపెట్టనేలేదు!

✂

చందనసింహుడు హీర నియుడాని కంగీకరించలేదన్న వార్త విన్నప్పటినుంచీ మారసింహుని కామెను వివాహమాడి తీరాలన్న కోర్కె మరింత ఎక్కువై ఇనుమడించింది. హీర చేసిన అవమానం వల్లనే అతని కామెపై అనురాగం ప్రాదుర్భవించింది. ఆమె తండ్రి తిరస్కారంతో అది మరింత విజృంభించింది. మొట్టమొదటి క్రోధావేశంలో అతడు చందనసింహుని కారాగారంలో పడవేయించి హీరను బలాత్కారంగా వివాహం చేసుకోవాలని సంకల్పించాడు. కాని దానిమూలంగా అనేకమైన విపరీత పరిణామా లేర్పడవచ్చునని అతనికి భయం వేసింది. ఆ వార్త తెలిసిన చందనసింహు డెలాంటి అఘాయిత్యాని కయినా ఒడిగట్టవచ్చును! ఆ రోజులలో రాజపుత్రు లెలాంటి సాహసాలకైనా సిద్ధపడేవారు. అదీగాక ఆ విధంగా హీరమనసు నొప్పించడంకూడా అతనికి రుచించలేదు.

నానాటికీ హీర నొక్కమారైనా కళ్లారా చూడకుండా ఉండడం అతని కసాధ్యమై పోయింది. దూరదూరంగా తోటివనంలో కనిపించే హీరముఖమే అతని హృదయాని కొక చంద్రబింబంలా స్ఫురించింది.

మారసింహు డొకనాటి సాయంకాల వేళ వాహ్యాళికని బయలుదేరి హీర సందర్శనానికే బయలుదేరాడు.

అప్పటికామె మంచెదిగి అనతిదూరంలో ఉన్న తన కుటీరానికి బయలుదేరింది. ఆనాడామె తీ రతిని తలపించిత్రంగా కనిపించింది.

హీర తలపై ఒక చిన్న పాలకడవ. ఆమె కిటు అటు రెండువైపులా రెండు మేక పిల్లలు. ఆమె రెండింటి మెడతాళ్ళు రెండు చేతులతోను పట్టుకుని తలమీది పాలకడవ లోని పాలొకచుక్కైనా తొణికిపోకుండ మెల్లమెల్లగా నడిచి వస్తూంది.

మారసింహుడు కొంచెం దూరంనుంచే ఆమె రాక గమనించాడు. తన గుర్రం ఆమెకు కొంచెం దగ్గరిగా నడిపించి, ఆ మేకపిల్లల్ని రెండింటినీ బెదర గొట్టాలని అతనికొక ఊహ తట్టింది. అలాగ చేస్తే ఆమె తలమీద పాలకడవ నేలమీద పడిపోతుంది. అప్పుడామెకు సహాయం చేసినట్టు నటించి, సన్నసన్నగా ఎత్తి పొడిచి తనకు జరిగిన అవమానానికి బదులు తీర్చుకోవచ్చును! ఆమెను కొంచెం కవ్వించి నవ్వించవచ్చును. అదీ అతని ఊహ!

అతడతిజాగ్రత్తగా పంచకల్యాణిని నడిపించాడు. ఆమె కొంచెం సమీపించగానే హఠాత్తుగా కళ్ళెం కొంచెం సడలించాడు.

ఆమె దూరంనించే అది కనిపెట్టింది. తన రెండు మేకపిల్లల మెడతాళ్ళు వదిలిపెట్టింది. ఒక్కమారుగా రెండింటినీ గుర్రం మునికాళ్ళమధ్యకు తరిమింది.

ఆ హఠాదాఘాతానికా గుర్రం బెదిరి ఒక్కమారుగా ఎగిరి గంతేసింది. మారసింహుడు దాని అఘాతానికి తట్టుకోలేక తప్పుగా నేలమీద కూలబడ్డాడు. గుర్రం గట్టిగా సకిలించింది. పాపం మారసింహునికి కొంచెం గట్టిదెబ్బే తగిలింది. అయినా అతడు తనకేమీ దెబ్బ తగలనట్టే నటించాడు.

అంతలో హీర తన నెత్తిమీదనున్న పాలకడవ మెల్లదిగా దించి ఒక చెట్టుక్రింద పెట్టి అతనిదగ్గరికి వచ్చింది. ఆమెను చూచి మారసింహుడు తెచ్చికోల్పుని ఒక్క చిరు నవ్వు నవ్వాడు:

"పాపం నీకుగాని ఏమీ దెబ్బ తగలలేదు కదా!"

"నాకేమీ తగలలేదుగాని మీకే ఏమైనా కొంచెం గట్టిదెబ్బ తగిలిందేమోనని భయపడుతున్నాను. మా దుడుకు పంచకల్యాణి ఎంత పని చేసింది!"

హీర ఆ నిందంతా తన పంచకల్యాణి మీదకే నెట్టివేసిందని మారసింహుడు గ్రహించుకొన్నాడు. కొంచెంసేపామెకేసి చూచి చిన్న చిరునవ్వు చిలకరిస్తూ అడిగాడు:

"సరేగాని హీరా! నిన్నిప్పుడమాంతంగా ఎత్తుకుని నా గుర్రంమీద కూర్చోబెట్టుకుని తిన్నగా మా కోటకు తీసుకుపోతే నీ వేమి చెయ్యగలవు?"

హీర కలకలనవ్వింది:

"మహాప్రభూ! పాలవంటి సుక్షత్రియ వంశంలో అవతరించిన చిత్తూరు రాణాలకు పందిని కొట్టడమే బంటుతనం అనుకొన్నాను గాని బాలికల నపహరించుకుపోవడం కూడా వారికొక బంటుతనం అనుకోలేదు! అయినా భయంలేదు! ఇదిగో కైజారు!"

హీర మొలనూలిలోనించి ఆటాలున పైకి లాగిన కైజారు మారసింహుని కళ్లెదురుగా తళతళలాడింది!

"ఆ కైజా రెందుకులే! నీ క్రీగంటి చూపు చాలదా? నా ప్రాణం తీయడానికి!" మారసింహుడు మళ్లీ కలకలా నవ్వాడు.

"అయితే హీరా! నిజంగా నిన్ను నే నపహరించుకుని పోతానని అనుకొన్నావా? ఊరికే పరిహాసానికన్నానంతే!"

తలవని తలంపుగా మారసింహుడు విసిరిన ఛలోక్తికి హీరకూడా నవ్వకుండా ఉండలేకపోయింది:

"నేను మాత్రం క్షత్రియ ధర్మపరిపాలకు లయిన తమరిని కైజారుతో పొడిచివేస్తానని అనుకొన్నారా? ఊరికే మాటవరస కన్నానంతే!"

రాణా మళ్ళీ ఇంకొకమారామె చేతిలో పరాజయం పొందాడు. అయినా కొంతసే పామెవైపలాగే నిశ్చలదృష్టితో చూచాడు.

"అయితే హీరా! ఒక మాట! మీ నాయనగారియెడల నేనేమి అపరాధం చేశాను! వారికి నా యెడల అంత వైమనస్యం కలగడానికి కారణ మేమిటి?"

హీర ఆ ప్రశ్న వినీ విననట్టుగా మాట్లాడక కుంచుకుని నేలకేసి చూస్తూ కూర్చుంది.

"హీరా! నీకుకూడా నామీద దయ తప్పిందా! మాట్లాడవేమి?"

హీర రుసరుసలాడుతూ లేచి నిలబడింది:

"మహాప్రభూ! తమకు మావంటి నిరుపేదల దగ్గర ప్రార్థించవలసినంత అవసరం ఏమి వచ్చింది? తలుచుకుంటే తమ సైన్యం పంపించి ఎలాంటి రాజకన్యకలనయినా మీ అంతఃపురంలో బంధించగలరు! చిత్తూరు పురాధీశ్వరులు తమకేమి లోటు?"

హీర పాలకుండ మళ్లీ తలపైపెట్టుకుని మేకపిల్లల్ని రెండింటినీ వెంటపెట్టుకుని చరచరా నడిచి వెళ్లిపోయింది! మారసింహుడామెకేసి చూస్తూ ఉసూరుమని ఒక్క దీర్ఘనిశ్వాసం విడిచిపెట్టాడు.

ఆ మరునాటి ఉదయమే రాణా రాజ పురోహితునితోను, ప్రధానామాత్యునితోను కలిసి తన కుటీరానికి విచ్చేయనున్నాడని చందనసింహుని కొకవార్త చేరింది. అది విని అతడు కొంతసేపెంతో ఆశ్చర్యపోయాడు. వెంటనే ఆ విషయం భార్యతో అన్నాడు.

"మీ రామాత్రం మంచి, మర్యాద నిలబెట్టుకోలేకపోయారు కాని రాణా ఆ మాత్రం మంచీ, మర్యాదా లేనివారు కాదు! ఇప్పుడైనా మహారాజ మర్యాదకేమీ లోటు రాకుండా చూసుకోండి!"

వెంటనే ఆమె స్వాగతసన్నాహంలో మునిగిపోయింది. రాణా రాకమాట వినగానే చందనసింహుని పట్టుదల, పంతము, కోపము అన్నీ సడలిపోయాయి. కాని తిరా పిల్లనిస్తానని మాటిస్తే హీర ఏమి అఘాయిత్యాని కొడిగడుతుందోనని అతనికి బాగా భయం వేసింది. కాని భార్య దానికేమీ భయపడనక్కరలేదని భరవసా

(48-వ పేజీ చూడండి)

# నాకు తెలిసిన నిర్మల

ఎస్. వి. ఎస్. శాస్త్రి

ఆరోజు శనివారం. అయిదింటిదాకా ఆఫీసులోనే వున్నాను. అప్పుడు బయటికి వొచ్చి కాస్సేపు అటూ ఇటూ తిరిగి ఆఖరికి ఫ్లోరాఫౌంటెన్ $O_2$ ఎక్స్‌ప్రెస్ బస్ స్టాప్ దగ్గర క్యూలో నుంచుని ఈవెనింగ్ పేపరు విప్పాను. సాయంత్రం ఆరయినా ఇంకా ఎండ తగ్గలేదు. విపరీతమయిన చెమట పోసేస్తోంది. బొంబాయిలో ఎండ అంత తీవ్రం కాకపోయినా చెమటమటుకు అపరిమితం.

క్యూ చాలా పొడుగ్గా వుంది. 10, 15 నిముషాలదాకా నాకు బస్సు దొరకదు. తీరిగ్గా పేపరు చదువుతున్నాను. ఉన్నట్టుండి, "ఒరేయి కృష్ణా" అన్న కేక వినబడింది. పక్కగా టాక్సీ ఆగింది. అటు చూశాను. టాక్సీలోంచి తల బయటపెట్టి పిలుస్తున్నాడు రాజు. పక్కన భార్యకూడా కూచునివుంది. క్యూలో నుంచునే విష్ చేశాను. వాడు తలుపు తెరుచుకుని బయటకు వచ్చాడు. నా దగ్గరకువచ్చి నా జబ్బ పట్టుకుని. "ఏడిశావులేరా వాజమ్మా, పదు, టాక్సీ ఎక్కు. ఊఁ," అని గదిమి లాక్కొచ్చి టాక్సీలో కూలేశాడు. టాక్సీ కదలగానే ఆవిడ పలకరించింది, "ఏమండీ! అసలు కనపడం మానేశారేం" అని. "వాడెక్కడ కనిపిస్తాడే! ఒంటిపిల్లి రాకాసిలా, ఆఫీసూ రూమూ, రూమూ ఆఫీసూనూ. ఏరా! ఆఫీసురోజుల్లో సరి. శెలవురోజుల్లో ఎక్కడ ఏడుస్తున్నావురా?" వాడు విరుచుకుపడిపోతున్నాడు. నిజమే. సమాధానం చెప్పటం అనవసరం. వెడదాం, వెడదాం అనుకుంటూనే మూడునెల్లు గడిచిపోయినై. సంవత్సరం క్రితందాకా వాడూ నేనూ ఎంత దగ్గరగా ఉన్నామో ఇప్పుడంత దూరంగా ఉండటం నిజంగా ఆశ్చర్యంగానేవుంటుంది. అయినా వాడు పెళ్ళి చేసుకొచ్చి ఎక్కడో సయాన్‌లో కాపురం పెట్టాడు. నేనున్న వర్లీనుంచి ఆ సయాన్ పోవాలంటే యాతన. అక్కడికీ వాడు కాపురం పెట్టిన ఈ ఏడాదిలో రెండుమూడుసార్లు వెళ్ళాను.

నాకేదో గింజుకుంటున్నాడు. చేతులు తిప్పేసి ఆవిడకేదో అల్టిమేటం ఇచ్చేస్తున్నాడు. నా కర్మమయిందల్లా నా కివాళే యింటికి చేరే ప్రాప్తి లేదనీ, వాడితోపాటు సయాన్ పోతున్నాననీ, రాత్రి అక్కడ భోంచేసి, పడుకుని పొద్దున్నే ఏ తెలుగు సినిమాకో పోతున్నాననీనూ. ఇక తప్పదు అనుకున్నాను.

టాక్సీ క్రాఫర్డు మార్కెట్ మలుపు తిరిగింది. ఏదో పిచ్చాపాటీ మొదలెట్టాం. స్నేహితులూ ఉత్తరాలూ వగైరా. వాడిని చూస్తున్నకొద్దీ, వాడి మాటలు వింటున్నకొద్దీ, వాడిలో ఏదో మార్పు కొట్టొచ్చినట్టు కనపడుతోంది నాకు. లావెక్కుతున్నాడు. మాటలూ, మాట్లాడే తీరూ, ఏదో జీవితాన్ని మహా తేలిగ్గా తీసుకుంటున్న వాడివి లాగా ఉన్నాయి. సంవత్సరం క్రిందట వాడికీ ఎంతో దగ్గరగాఉన్న నాకు, వాడిలో యీ మార్పు తీసుకొచ్చింది పెళ్ళేనని అనిపించడంలో పొరపాటేం లేదనుకుంటాను.

"ఏరా! నాన్నగారి దగ్గరనుంచి ఉత్తరాలు వస్తున్నయ్యా?," అన్నాను. "ఆఁ! వస్తూనే ఉన్నయి" అన్నాడు గొంతుమార్చి. "ఏం? మాట పెగల్టం లేదేం?", అన్నాను. వాడి భార్య (ఆవిడ పేరు సుశీలనుకుంటాను) అందుకుని నవ్వుతూ, "ఎందుకు పెగుల్తుంది? మావగారు యింటికి వచ్చెయ్యమని ప్రతి ఉత్తరంలోనూ రాయటమే. మరి, వీరికి బొంబాయికన్నా నచ్చినచోటు యీ భూమిమీద లేదాయె. నాకు తెలియందేముందండీ?" అంది. అవును. పాపం ఆ ముసలాయనకు ఉన్న ఒక్క కొడుకూ యిలా దూరదేశంలో ఉండటం మొదట్నుంచీ యిష్టం లేదు. మరి వీడేమో చిన్నప్పట్నుంచీ మంకుపట్టు. బొంబాయిలో బాంక్ ఉద్యోగం రావడం తరవాయి. మూటాముల్లే సర్ది తెచ్చేశాడు. వస్తూనే నాకు ఉత్తరం రాశాడు. నే నప్పటికే ఒక షిప్పింగ్ కంపెనీలో కుదురుకుని, వర్లీలో రూము సంపాయించి స్థిరపడ్డాను. ఓరోజు పొద్దున్న తయారు వీడు. అంతే మళ్ళీ రెండు సంవత్సరాల తరువాత పెళ్ళికోసం వెళ్ళాడు యింటికి. మధ్యలో రెండుసార్లు నేను ఊరెళ్ళినప్పుడు ఆ ముసలాయన మా యింటికి వచ్చి గోలకెత్తాడు. నేను మటుకు ఏం చేయగలను?

ఉన్న రెండేళ్లలోనూ వాడూ నేనూ ఎంతో సన్నిహితం అయాము. నా రూములోనే ఉన్నాడు. ఇద్దరం ఒకేసారి ఆఫీసుకు వెళ్ళేవాళ్ళం. కలిసి తిరిగి వచ్చేవాళ్ళం. నాకే "షో" నచ్చుతుందో వాడికీ అదే నచ్చేది. వాడికి బావుండని సినిమా నాకూ బావుండేది కాదు. వచ్చిన మొదటి నెల్లోనే బొంబాయిలో చూడాల్సినవన్నీ తిప్పి చూపించేశాను.

* * *

"యహాఁ రోకో గాడీ" అన్నాడు రాజు టాక్సీవాడితో. టాక్సీ ఆగింది. సయాన్ రోడ్‌మీద ఉన్న బిల్డింగ్‌లో ఉంది వాడి ఫ్లాట్. చిన్నదయినా చాలా బాగుంటుంది. నూటయాభై రూపాయలు అద్దె యిస్తున్నాడు. ఆవిడ తాళం తీసింది. లోపలికెళ్ళాం. "శ్రీమతీ! యిదగో, వీడికి ఏదన్నా వేడి వేడి కాఫీయో, కోకోనో తెచ్చియ్యి. ఏరా? ఏం తీసుకుంటావు?" అన్నాడు వాడు లోపలికి వెళ్ళామో లేదో. "నాకేమీ వద్దు గాని, ముందు నేను స్నానం చెయ్యాలి," అన్నాను కుర్చీలో కూలబడుతూ. "అవునవును. సాయంకాలం

# ★ నాకు తెలిసిన నిర్మల ★

వస్తూనే నీవు నీళ్ళాడ్డం అలవాటు కదూ? సరే. సుశీలా! వీడిని నీటిలో ముంచే ప్రయత్నం చెయ్యి ముందు," అన్నాడతను సీరియస్‌గా. "అవునండీ! మరి మీరు స్నానం చెయ్యరేమిటి? వచ్చే చెమట పోస్తున్నా, స్నానం చెయ్యండీ అంటే, యిప్పుడా, అని నీరసపడేవాళ్ళను మిమ్మల్నే చూశాను. పదండి. మీరుగూడా స్నానంచేద్దురు గాని" అంది ఆవిడ తెచ్చిపెట్టుకున్న కోపంతో. తప్పనిసరి అయినట్టు వాడూ లేచాడు స్నానం చెయ్యటానికి. వాడిని యీమాత్ర మయినా కొస్త అదుపులో పెట్టున్నందుకు ఆవిడని మనసులో అభినందించాను.

రాత్రి తొమ్మిదయేసరికల్లా భోజనాలు చేసేశాము. ఆవిడ వంట చాలా చక్కగా చేసింది. వేయించిన బంగాళాదుంపలు, వంకాయ పోపు పెట్టినబజ్జీ, శెల్లపు ఆవకాయ, ఘుమఘుమలాడే చారు. కమ్మటి పెరుగూ—యింతకన్న యీ బొంబాయి బ్రహ్మచారి కోరదగింది ఏముంటుంది అని పించింది.

మాకు బయట బాల్కనీమీద పక్కలు వేసింది ఆవిడ. ఆవిడకి తెలుసు. ఎప్పుడు నేను వాళ్ళింటికివచ్చినా సెమిద్దరం అలా బయట పక్కలమీద పడుకోవల్సిందే, రాత్రంతా అరుస్తూ నవ్వాల్సిందేనని. పక్కమీద నడుంవాల్చి జేబులోంచి సిగరెట్ పాకెట్ బయటికితీశాను. వాడు పక్క పడుకుంటున్నవాడు అమాంతం వచ్చి, "ఒరేయి చంపావు. ఆవిడని పడుకోనీ. చూసిందంటే తంతుంది" అని పిట్టలాక్కున్నాడు. నేను నవ్వాను. లోపల ఆవిడ లైటు ఆర్పేసి పడుకుందని తోచిం తర్వాత లోపల్నుంచి అగ్గిపెట్టె పట్టుకొచ్చి యిద్దరం సిగరెట్లు వెలిగించాం.

పదినిమిషాలు ఎవరం మాట్లాడలేదు. వాడే అన్నాడు నెమ్మదిగా, "నిర్మలని మళ్ళీ కలిశావా యీమధ్య?" నాగుండె కొట్టుకోవటం ఆగిందనిపించింది. నిర్మల... ...అవును...నిర్మల...నిర్మల వీడికింకా జ్ఞాపకం ఉంది! మరి...యిదేమిటి? నేను వాడితో ఉన్న యీ మూడుగంటలసేపూ, వాడికి నిర్మల జ్ఞాపకం ఉందని, అసలు ఉంటుందనీ నాకెక్కడా తట్టనైనా లేదే! కాని, వీడు యిప్పుడే కొత్త జీవితం ప్రారంభించాడు. పాతది మర్చిపోవడానికి కొంతకాలం పడుతుంది. అలా సమాధానం చెప్పుకున్నాను.

* * *

రాజా అప్పటికి బొంబాయివచ్చి ఏడాది దాటిం దనుకుంటాను. అప్పటికే బొంబాయి వాతావరణం బాగా వంటపట్టింది వాడికి. పులెన్, ట్వీడుసూట్లు తప్పితే యింకోటి కట్టడం మానేశాడు. వస్తూవస్తూ ఒకవెయ్యి రూపాయిలు యింటిదగ్గర్నుంచి తీసుకొచ్చాను. అవి హారతి కర్పూరంలా కర్పుపెట్టి మేడ్రెడితే గుడ్డలు కొన్నాడు. వచ్చే మూడోందలూ లాండ్రీకీ, మేకప్‌కీ పెట్టున్నాడా అనిపించేది. ఎర్రగా పొడుగ్గా ఉండేవాడేమో దొరబాబులా తయారయేవాడు పొద్దున్నా, సాయంకాలమూ.

ఏదో ప్రేమకలాపంలోకి దిగుతాడేమో అన్న అనుమానం లేకపోలేదు నాకు మనసులో. ఎందుకంటే—మునుపల్లా, నేను శనివారం యింటికి వచ్చేసరికి వీడు గుర్రుకొట్టి నిద్రపోతుండేవాడు. అలాంటిది, శనివారం మధ్యాహ్నాలు మాయమవడం ప్రారంభించాడు. ఎక్కడికో వెళ్ళేవాడు. లేకపోతే బాంక్‌లోనే ఉన్నానే వాడు. అంతకుముందు వాడూ నేనూ కలిసి చూసేవాళ్ళం ఏసినిమా అయినా. ఇప్పుడు వాడు నాతోవచ్చి చూసిన సినిమాలే లేవు. సంగతేమిటో తెలుసుకుందామని నేను ప్రయత్నం చేసేలోపల దానంతటదే బయటపడింది వ్యవహారం. కాని అప్పటికే చెయి దాటిపోయింది.

ఆ శనివారం కొస్త పనుండి ఆఫీసులోనే ఉండిపోయాను నేను నాలుగింటిదాకా. అక్కడనుంచి సరాసరి "ఎరోజ్" థియేటరుకు వెళ్ళమన్నాడు ఆరుగంటలాటకి రెండు టిక్కట్లు కొనుక్కొని, "వెర్రీన్"లో కాఫీ తీసుకుని మెరైన్ డ్రైవ్ మీదుగా నడుస్తున్నాను. చల్లటిగాలి వేస్తోంది. నా ముందు ఒక జంట నడుస్తోంది పెనవేసుకొని. నా కెంతోసేపు పట్టలేదు వాళ్ళల్లో రాజాను గుర్తుపట్టడానికి. ఆ అమ్మాయి ఎవరో గాని నా కెక్కడా చూసిన గుర్తు లేదు. ఇంతలో రాజా పక్కకి తిరుగుతూ నన్ను చూడనే చూశాడు. మొహంలో ఏమాత్రం తొట్రుపాటు లేకుండా, "అరే కృష్ణా" అన్నాడు. నేను నిలబడ్డాను. వాడు ఆ అమ్మాయితో గూడా దగ్గిరికి వచ్చాడు. వచ్చి, ఆ అమ్మాయితో, "నిర్మలా! Meet Krishna My friend, Philosopher, guide and what not," అని నవ్వి నావంక తిరిగి, "కృష్ణా! This is Nirmala Mehta, my colleague" అని పరిచయం చేశాడు. ఆరోజు నాకలాకనపడ్డ నిర్మల నాకింకా కళ్ళకు కట్టినట్టుగా ఉంది. అంతటి సౌందర్యవతిని నేను బొంబాయిలో చూడకపోలేదు. కాని ఆమెలా తన అందం వ్యక్తీకరించగలిగిన వాళ్ళు నాకు కనపడలేదు. ఆ విద్య నిర్మలకి బాగా తెలుసు. తను ఎలా చూస్తే, ఎలా నవ్వితే, ఎప్పుడు సిగ్గుపడితే బాగుంటుందో ఆమెకి తెలిసినట్టు యితరులకి తెలియదనుకుంటాను. ఏమయితేనేం నాకు అనిపించిందల్లా యిదేదో వీడికి సార్థకపడితే అదృష్టవంతుడేనని మాత్రమే. తరువాత మేము ముగ్గురం కలసి మాట్లాడుకుంటూ నడిచాం. నిర్మలకి మాట్లాడటం కూడా బాగా తెలుసునని తెలుసుకోవటానికి ఎంతోసేపు పట్టలేదు నాకు.

నాకు తెలిసిపోయిందని తెలిసిం తర్వాత వాడికిక ఏ అడ్డంకీ లేకపోయింది. రెండు మూడుసార్లు గదికి తీసుకొచ్చాడు. ఎంతో చక్కగా మాట్లాడింది ఉన్న కాసేపూనూ. వాడుకూడా నాకయిష్టంకాదని తెలుసుకున్నాడు. "నిర్మలా నేనూ సినిమాకి వెళ్తున్నాం. వస్తావా నీవుకూడా?" అనేవాడు. నేనునవ్వుతూ, "ఏడిశావ్. నా మానానబడిను వ్వేడవపెంగుకు! నిర్మల వెయిట్ చేస్తూ ఉంటుందిగాని పోయి, త్వరగా యింటికి

ఏడు," అనేవాణ్ణి. అంతేగాని నేనెన్నడూ వాడిని కూచోబెట్టి, "యిదేమిటి? నువ్వామెను పెళ్లి చేసుకోదల్చుకున్నావా?" అని సీరియస్‌గా అడగలేదు. ఎందుకంటే, వాడికీ తెలుసు. నాకూ తెలుసు—ఈ గుజరాతీ పిల్లకన్న మంచిపిల్ల వాడికి ప్రపంచంలో దొరకదని. వాళ్లిద్దర్నీ కూర్చుటంకన్న నేనుచేయగలిగే మంచిపని యింకోటి లేదనిపించింది.

కాని నాకాపుణ్యం దక్కలేదు. ఒకరోజు పొద్దున్నే వాడూ నేనూ కాఫీ తాగుతున్నాము. రాత్రి వాడు చాలా ఆలస్యంగా వచ్చాడు. కళ్ళు ఎర్రగా ఉన్నయి. నేనన్నాను యథాలాపంగా "రాత్రి చాలా ఆలస్యంగా వచ్చినట్టున్నావు. నిర్మలా నువ్వూ సినిమాకెళ్లారా?" అని. "దయచేసి నిర్మలమాట నాదగ్గర ఎత్తకురా." అన్నాడు ఎక్కడ్నుంచో మాట్లాడుతున్నట్టు. నాకు నోటమాట రాలేదు. అంతే. ఏ సంగతీ అడక్కముందే లేచి వెళ్లిపోయాడు.

సాయంకాలం వస్తూనే, "కృష్ణా! నేను సెలవుతీసుకుని యింటికివెళ్ళిపోతున్నానురా. క్షమించు. నేనుయిప్పుడు నీకేం చెప్పేస్థితిలో లేను." అన్నాడు వాడు తలవంచుకొని. రాత్రి వాణ్ణి మెయిలెక్కించి వచ్చాను.

వాడు వెళ్లినమూడోరోజు సాయంకాలం "వెక్రీన్"లో కాఫీతాగుతున్నాను. రోడ్ మీద టాక్సీఆగింది. అందులోంచిదిగి నిర్మల సరాసరి నాదగ్గరకు వచ్చింది. "మీతో మాట్లాడాలి. ఒకసారి నాతో మాయింటికి రాగలరా మీరు?" అంది. నేను యంత్రంలా వెళ్లి టాక్సీలో కూచున్నాను. నాకు వాళ్ల గొడవేమీ తెలియనట్టుగా "రాజు సెలవుతీసుకొని ఊరెళ్లాడు. తొందరలోనే రావచ్చును కుంటాను" అన్నాను. "అవు" అంది నవ్వుతూ.

టాక్సీ ఆగింది. దిగి ఎదురుగా నేఉన్న బిల్డింగు నాలుగో అంతస్తులో వాళ్ళఫ్లాట్‌లో ప్రవేశించాము. అప్పుడుగాని నాకు తెలియలేదు—నిర్మల చర్చిగేట్ రిక్లమేషన్‌లో ఉందని ఏమంత ఆడంబరంగా లేకపోయినా హాయికల్పించేటట్టుగాఉంది ఫ్లాట్. ప్రవేశించగానే కూచోమనిచెప్పి లోపలికివెళ్లి టీ తీసుకొచ్చింది. టీ తాగుతూ "మీరొక్కరే ఉంటున్నారా యింతఫ్లాట్‌లోనూ?" అన్నాను. "లేదు, లేదు. నేనూ, నాన్నా, అమ్మ, చెల్లెలూ ఉంటాము. వాళ్ళందరూ బయటికి వెళ్లారు యిప్పుడే. అయినా యీఫ్లాట్ మా స్వంతంకాదు. యీబిల్డింగ్ మాచిన్నాన్నగారిది. ఆయన దయతల్చి మాకీ ఫ్లాట్ యిచ్చారు." అంది అతినిరాడంబరంగా నవ్వుతూ, "ఓహో" అన్నాను. ఉన్నట్టుండి నవ్వుతూ నా కళ్లల్లోకి చూసి అంది, "నాగురించి రాజు మీకు చాలా చెప్పాడనుకుంటాను. నేనంటే మీకు చాలా దురభిప్రాయంకలిగి ఉండాలి" అంది. నేను, కానేపూరుకొని "నాకు రాజు ఏమీచెప్పలేదు. మీరు ఏదో దెబ్బలాడుకున్నారని మాత్రమే నాకు తెలుసు. అయినా యిలాంటి కలహాలు సహజమేగా. మళ్ళీ మీఅంతట మీరే సర్దుకుంటారు." అన్నాను నవ్వుతూ. ఆమె నవ్వడం మానేసింది. నెమ్మదిగా మాట్లాడసాగింది.

"లేదు. ఇక నేనతన్ని కలుసుకోలేనేమో కూడా. ఎందుకో చెప్తే మీరు నన్ను సహ్యించుకుంటారు. కాని గత్యంతరం లేదు. ఏం చెయ్యను? నిజమే. నేనతన్ని ప్రేమించాను. అతని ఆశలన్నీ నామీదనే ఉన్నయ్యని కూడా తెలుసు. కాని నేనతన్ని పెళ్ళిచేసుకుని ఎల్లకాలం అతనితో ఉండలేనని చెప్పటానికి విచారిస్తున్నాను. ఎందుకంటే...అతను ఎందుకంటే అతను నేననుకున్నంత డబ్బున్నవాడు కాదు. మొదట్లో నేనతన్ని కలుసుకున్నప్పుడు అలాంటి వాడికోసమే నేను వేచిఉన్నా ననిపించింది. నా కెన్నో ఆశలున్నయి. నాకుండడం సహజం. దేవుడు నాకిచ్చిన అందం ఒక మామూలుమనిషి సొమ్మవడానికి నామనస్సుఒప్పుకోదు. నేనది భరించలేను. అది నాదురభిప్రాయంకావచ్చు. నేనేం చేయలేను. రాజును పెళ్లి చేసుకుని అతనితోపాటు రోజూ ఆఫీసుకుపోతూ, పిల్లల్ని కనిపెంచేందుకు నేనొప్పుకోలేను. నాకూ నా అందానికి సంఘంలో ఒకస్థానం కల్పించేవాణ్ణి తప్ప నేనింకొకరిని పెళ్ళి చేసుకోడం అసంభవం. ఎందుకంటే నాకు తెలుసు నా విలువ. రాజు జీవితం భగ్నం చేశానని మీరనుకోవచ్చు. కాని పెళ్ళి చేసుకుని యిద్దరి జీవితాల్నీ అధోగతిపాలు చేయడం నాకిష్టంలేకపోయింది. నాకున్న ఆశలకీ, రాజుకు నన్ను భరించే శక్తిలేదు. ఇదే రాజుతో చెప్పాను. మీ కీసంగతంతా ఎందుకు చెప్తున్నానంటే రాజు నన్ను పూర్తిగా అపార్థం చేసుకున్నాడని తెలుసుకున్నాను. వీలయితే, అవసరమని తోస్తే, అతన్ని మరిపించండి. అంతే నేను కోరేది. క్షమించండి. మిమ్మల్ని చాలాసేపు కూర్చోపెట్టాను." అని లేచి నుంచుంది. నేను నిట్టూర్పు విడిచి ఆమెకు థాంక్స్ చెప్పి బయటకు వచ్చాను. నేనామెను మనసులో తిట్టుకోలేదు. ఆమె నిష్కల్మషంగా మాట్లాడింది.

నిర్మల బొంబాయిలో పుట్టింది. బొంబాయిలో పెరిగింది. రోజూ ఆఫీసుకు వస్తూ పోతూ మిలమిల్లాడే మెర్సిడెజ్ బెంజ్ కార్లను చూస్తుంది. వాటిలో మనుషుల్నీ, వాళ్ల ఠీవిల్నీ, వైభవాన్నీ కళ్లనిండా చూస్తుంది. కళ్లు చెదిరిపోయే షోకేసుల్నీ, డబ్బుతో కొనగల వస్తువుల్నీ కూడా చూస్తుంది. అవి పొందటానికి తనకి హక్కు లేదనుకోవటం ఆమె ఓర్వలేదు. ఎందుకంటే యిది బొంబాయి. మనుషుల్నే కాదు వాళ్ల మనసుల్నీ కూడా మార్చగల శక్తిగలది. ఆమె చెప్పింది నిజము. అందుకు సంతోషించాను.

కొన్నాళ్ల తరువాత రాజు పెళ్లి శుభలేఖ వచ్చింది ఊర్నుంచి. పెళ్లికివెళ్లాను. పెళ్లికూతురు నల్లగా ఉంటే ఏం? పల్లెటూరిదయితే ఏం? కావలసిన సంబంధం. కట్నం మోపెడు. నెలతిరిగేటప్పటికి రాజు పెళ్లాన్ని తీసుకుని బొంబాయి వచ్చి కాపురం పెట్టాడు.

* * *

సిగరెట్టు చుర్రున కాల్చింది వేలిని. ఉలిక్కిపడి పక్కకి చూశాను. "నిర్మలని కలిశావా" అని అడిగిన సన్నాసి గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు. అప్పుడుగాని గుర్తుకు రాలేదు—అప్పటికీ యిప్పటికీ నిర్మల కనపడలేదని. ★

# అసంప్రేక్ష్యకారిత్వము... పంచతంత్రము
...ఆయిదవ భాగము



...గేయరచన... నండూరి. రామమోహనరావు — బొమ్మలు.. బాపు



# వాల్‌పోస్టర్

వంటకాలేని రామం వండటానికి కూర్చున్నాడు. వండక తప్పదు. చెమ్మకు నానిన అగ్గిపెట్టెలో అగ్గి పుల్లలు 'మేం వెలగం, నీదిక్కున్న చోట చెప్పుకో' అంటున్నాయి. దిక్కులేదుకనుకే యింత బాధపడుతున్నానని వాటితో చెప్పలేదు రామం. రామం పైకి చెప్పలేకపోయినా రెండు కళ్ళతోనూ చూసి కొద్దిసేపు ఆలోచించిన వాడికి తెలుస్తుంది; ఆ గదిని వాడుతున్న ఆ సామికి ఆపదిక్కు ఏమీ లేదని. గదికి ముందున్న వరండా యింటి యజమానులు వుపయోగించుకుంటారు కాబట్టి శుభ్రంగా వుంటుంది. రామం అద్దెకు తీసుకున్న ఆ ఒక్క గదీ, గదివెనుక తడికెలు అడ్డుగావున్న చిన్న వరండా మాత్రం సాలెగూళ్ల కోకమారు ధూళి దులుపుకుంటాయి; సంవత్సరానికి ఒక్కసారే, భోగినాడు భార్య బలవంతాన తలలంటుకునే వాళ్ళలా, దయాదాక్షిణ్యాలు లేని అగ్గిపుల్లలు పెట్టెలో నుండి ఒకదాని వెనుక ఒకటి వస్తూనే వున్నాయి. 'వెలగం', అని దబాయిస్తూనే వున్నాయి. చిరాకెత్తి అగ్గిపెట్టె విసిరేసేడు. కాని చేతనాలే చెప్పినట్టు వినని యీ లోకంలో అచేతనాలు అసలు వినవన్న సంగతి గుర్తు రావడానికి అట్టే కాలం పట్టలేదు అతన్కి. వెళ్ళి అగ్గిపెట్టె తెచ్చేడు. ముందుంచే పక్కలు అరచేతిలో, వేడెక్కేటట్టు పామేడు. అగ్గిపుల్లలు రెండు తీసి రెండు చేతుల మధ్య పామి వెలిగించేడు. అగ్గిపుల్ల పరాజయాన్నంగీకరించింది. పక్కనున్న న్యూస్ పేపరుతగలబెట్టి బొగ్గుల కుంపటి మధ్య పడేసేడు విజయసూచకంగా రామం. కొద్దిసేపటికి బొగ్గులు రాజుకున్నాయి. తపేలాలో నీళ్లుపోసి కుంపటి మీద పెట్టేడు. కొంతసేపు అయాక కొంచెన్ని నీళ్లు తీసుకొని కాఫీకలుపుకుని మిగిలిన నీళ్లు యింకా ప్రమరిగాక వాట్లో బియ్యం వేసేడు.

గదిలో కూర్చుని కాఫీ తాగుతుండగా రామం మనోనేత్రంముందు కదిలాయి కొన్ని దృశ్యాలు. ఆఫీసునుండి వస్తుండగానే తువ్వాలు భుజాన్ని వేసుకొని, మొహం కడుక్కోవడానికి నీళ్ళుపట్టుకుని, మందహాసంతో యెదురై, గుమ్మం దగ్గర చెంబు పెట్టి, కాలిజోళ్ళు తీసి, పాదాలు కడిగి... అచ్చే చిత్రం మరీ పౌరాణికంగా వుంది. పౌరాణికంగావున్న చిత్రం తెరమీద నుండి తొలగిపోయింది. ఇంకొక బొమ్మ, 'బాపు' బొమ్మల్లోలాంటి అమ్మాయి మనిషి నాజూగ్గా, సన్నగా, పొడుగ్గా కోల మొహంతో, పెద్దకళ్ళతో, చిన్న పెదిమలతో పొడుగాటి జడతో వుంది. ఆఫీసునుండి రాగానే మందహాసంతో యెదురై తర్వాత తను టేబిలు యెదుట కుర్చీలో కూర్చొని వుండగా, ఫ్లాస్కులో వేడివేడి కాఫీ టేబిలుమీద వున్న కప్పులోపోసింది. టేబిలు అంచున కూర్చుని తన జడని భుజంమీదుగా ముందుకు తీసుకొని కుడిచేత్తో దాన్ని పట్టుకొని ఎడమ చేతి అరచేతిమీద ఆ జడను కొడుతూంది. ఇంతలో గదిదగ్గర ఊబుసు ఊతమినట్టు శబ్దమయింది. అమ్మాయి అదృశ్యమయింది. రామం శరీరం త్రుళ్లిపడ్డది. గ్లాసులో సగాని కున్న కాఫీ ఒలకబోయి ఒలకలేదు. ఊతమినట్టు వీధివాకిట్లోంచి అరచిన పోస్టుమేన్ దగ్గరకువెళ్ళి ఉత్తరం తెచ్చుకున్నాడు రామం. ఊతమిన పోస్టుమేన్ పిడుగులాంటి వార్త తెచ్చేడు. రామం ఉత్తరం చదువుకున్నాడు.

"మనుమడు చిరంజీవి రామునికి దీవించి వ్రాయునది: ఇచ్చటంతా క్షేమం. అచ్చట నీయోగక్షేమముల గురించి తరచు వ్రాయవలెను. ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకుంటూండు. వంటకు చాలా యిబ్బంది అవుతున్నట్టు వ్రాసేవు. అవును నిజమే. హోటలు భోజనం బాగుణ్ను కాని నీకు అభోజనం పడటం లేదంటావు. ఎలాగో కొంతకాలం ఓపికపట్టు. నువ్వొక ఇంటివాడివయ్యాక భోజనానికి ఏయిబ్బందీ లేకుండా సుఖంగా వుండగలవు. కాని ఒక విషయం తెలియ వచ్చింది. ఆవేళ నిన్ను యిక్కడకు పిలిచి అంత బోధపర్చినా నువ్వు ఆ వెంకట్రాజు అమ్మాయిని పెళ్లిచేసుకోవడానికే సిద్ధపడుతున్నావట. పెద్దవాళ్లం మేం ఉన్నామన్న సంగతి మరచిపోయావాకి వాళ్లు మన అంతస్తుకు తగరు. మన పూర్వీకులు ఎవ్వరు కూడా అటువంటి వంశాల పిల్లల్ని చేసుకోలేదు. చేసుకోకూడదు. పెళ్లికాని అబ్బాయిలకి పొరుగూళ్లలో యిదే చిక్కు. అయినా వాళ్లి అమ్మాయిని చేసుకోమని అతగాడు నిన్ను ఎలా అడిగాడు. చేసుకోనని ఖచ్చితంగా మొహంమీద చెప్పేయ్. మొహమాటపడకు....." ఇదే ధోరణిలో యింకా చాలా పొడుగుసాగింది ఉత్తరం. సాగినంత వరకు సావకాశంగా చదివాడు రామం.

కుతకుత ఉడికేను రామం. కుతకుత ఉడుకుతోంది పొయ్యిమీద అన్నం. అన్నాన్ని వార్చి ఓమూలని పెట్టేడు. కూరగాయలు దాస్తున్న బుట్ట దగ్గరపెట్టుకుని కత్తిపీట దగ్గర కూర్చున్నాడు. బుట్టలోంచి ముదిరిన బెండకాయలొచ్చాయి. మొన్నప్పుడు అనిపించలేదు గాని యిప్పుడవి ముదిరినట్టు అనిపిస్తుంది రామాన్కి. 'బెండకాయ ముదిరినా బ్రహ్మచారి ముదిరినా...' అనుకుని నవ్వుకున్నాడు. తప్పదు మరొక కూరలేదు. ముదిరిన బెండకాయలే ముక్కలక్రింద తరిగి వేపుడు చేసుకున్నాడు.

వంటయిన తరువాత గదిలోకి వెళ్లేడు. పరుపు దగ్గర ధూళి న్యూస్ పేపరుతో దులిపి పరుపుకు చేరవేసేడు. పేపరు చదువుకోవాలి అనుకున్నాడు, చదవలేకపోయాడు. చూచిన ఆ ఉత్తరం మరి చూడకూడదనుకున్నాడు. చూడకుండా ఉండలేకపోయాడు. ఇలాంటి ఉత్తరాలు కొత్తకాదు రామానికి. సగటున వారానికి ఒకటైనా వస్తుంది. ఒకొక్కప్పుడు వారాని కొకసారి శ్రమపడ నవసరం లేకుండా తాతగారు ఉత్తరాలు అచ్చొత్తించలేదేమా అని ఆశ్చర్యపోయేవాడు రామం. అయిదేళ్ల క్రితం క్షేమ సమాచారాలతో ప్రారంభమయిన ఉత్తరాలు, మూడేళ్ళనుండి 'నువ్వొక యింటి వాడవవగల' వని ఆశిస్తూ, సంవత్సరం నుండి ఈ వేళటి ఉత్తరంలా వెంకట్రాజు కూతుర్ని గాని చేసుకున్నావంటే లాభం లేదని బెదిరింపులోకి దిగేయి.

ఈ వేళటి ఉత్తరంలోలా 'నువ్వొక యింటివాడి వయితే' అని వ్రాసిన మొదటి ఉత్తరం లోటే ఒకయింటి వాడైతే పాటికి రామానికి ఓ చంటివాడు వుండి వుండేవాడు. చంటివాడు.....చంటివాడు జ్ఞాపకం వచ్చి నవ్వుకున్నాడు రామం. చంటివాడుంటే తాతగారికి మనమడి కొడుకు. ఎంతఅదృష్టవంతుడౌతాడు తాత. మనుమడి మనుమడు అంటే కొడుకు కొడుకు కొడుకు కొడుకు పుట్టిన వరకు బ్రతికుం

ఎంతో అదృష్టం అని నాయనమ్మ అంటుండేది. ఆడపిల్లల ద్వారా కలిగే మనుమలు లెఖ్ఖ లేదట. మరెందుకు వెళ్ళి తాత వాళ్ళ వేగం పెళ్ళి చేయడు అనుకున్నాడు రామం.

రామానికి పదవయేట తండ్రి పన్నెండవ యేట తల్లి తనకంటె రెండు సంవత్సరాలు చిన్నదైన చెల్లెల్ని అప్పజెప్పి వెళ్ళిపోయారు. దేశాంతరం కాదు, లోకాంతరం. రామానికి మిగిలిన బంధువులల్లా ఆ ఒక్క చెల్లి. తండ్రితండ్రి అయిన తాతగారు, నాయనమ్మ, ముగ్గురు పినతండ్రులూ, వాళ్ళ కుటుంబాలు. అతనికి తల్లి వంక చుట్టాలు ఎవరూ లేరు. పెరిగి పెద్దయిన పినతండ్రులు బుద్ధిగా చదువుకుని పట్నాల్లో ఉద్యోగాలు సంపాదించేరు. తమ చదువులకి ఖర్చయిపోగా మిగిలిన 'భోడి అయిదెకరాల భూమి' ఎవరికి కావాలని ఆ భూమినీ, ఆ భూమిని తమతోపాటు సమానంగా చూచిన తండ్రినీ కాదని పట్నాల్లో కులాసాగా పెళ్ళాం బిడ్డలతో కాలక్షేపం చేస్తున్నారు పినతండ్రులు.

సంప్రదాయ కుటుంబాలు కావాలి రామం తాతగారికి, వేలు కట్నాలు కావాలి సంప్రదాయ కుటుంబాలకి. సంప్రదాయం ఉండి కట్నాలు అడగని ముప్ఫయ్యయిదు సంవత్సరాల రెండవ పెళ్ళి వాడికిచ్చి చేసేరు రామం చెల్లి పెళ్ళి. అప్పటికే రామం చెల్లెలికి ఇరవై సంవత్సరాలు దగ్గర పడుతున్నాయి. రామానికి ఇరవై రెండు సంవత్సరాలు దగ్గర పడుతున్నాయి. అతను మెట్రిక్ పాసయి యింట్లో కూర్చున్న రోజుల్లో ఇంట్లో పెళ్ళి పేధిలో పులి లాంటి ఆఖరి పినతండ్రి, భార్యకు తెలియకుండా చేసిన ప్రయత్నాల వల్ల ఇరవైయొకటవ యేట ఉద్యోగం దొరికింది. పంచదార ఫాక్టరీలో పని.

మొదట్లో హోటలు భోజనం చేసేవాడు రామం. కాని ఆ భోజనం పడలేదు అతనికి. తప్పని సరయి 'చెయ్యి కాల్చుకోవడం' మొదలు పెట్టేడు. 'చెయ్యి కాల్చుకున్న' రామానికి కొన్నాళ్ళకు 'చెయ్యి సగం వుంటే బావున్ను' అనిపించింది. చెల్లి పెళ్ళి జరిగాక ఆలోచిద్దామనుకున్నాడు. చెల్లి పెళ్ళి అయింది. తన పెళ్ళి ప్రసక్తి ఎలా తేవడమో తెలియక సిగ్గుపడి ఊరుకున్నాడు కొంత కాలం. క్రమేపి వివాహవాంఛ సూచిస్తూ ఉత్తరాలు వ్రాయడంలో సిద్ధహస్తుడయ్యాడు. వాళ్ళ తాతగారు ఆ ఉత్తరాల అర్థం గ్రహించేరు అయినా మొదట్లో ఏమీ తెలియనట్టు ఊరుకునేవారు. తర్వాతర్వాత తప్పక ఓ యింటి వాడివవగలవని ఆశీర్వదిస్తూ వ్రాస్తూ వచ్చేరు. కాని తాతగారికి కావలసినవి సంప్రదాయకుటుంబాలు. సంప్రదాయ కుటుంబాలకు, అందులో సంపద వున్నవాళ్ళకు రామంవంటి చిన్న ఉద్యోగాలు చేసేవాళ్ళు సాధారణంగా నచ్చరు. సంప్రదాయం వుండి, సంపద లేని సంబంధాలు తాతగారికి నచ్చినా 'నామోషీ' అని నాయనమ్మకు నచ్చలేదు. రామం పినతండ్రులు తలుచుకుంటే అతనికి చక్కని సంబంధం వచ్చేది. వాళ్ళు తలుచుకోలేదు. సంబంధం కుదరలేదు. రామం పెళ్ళి కాలేదు.

ఇంతలో రామానికి ఇల్లు అద్దెకిచ్చిన వెంకట్రావు వాళ్ళ అమ్మాయిని అతనికి 'అంటగట్టడానికి' చూస్తున్నట్టు రామం తాతగారికి తెలిసింది. ఆయన ఉగ్రులయ్యారు. రామాన్ని యింటికి పిలిచి బోధ చేసేరు. తర్వాత వారానికొక ఉత్తరం వ్రాస్తూ ఆ సంబంధం చేసుకోవద్దని హెచ్చరిస్తూ వచ్చారు. 'కళ్యాణమొచ్చినా కక్కొచ్చినా ఆగదు నాయనా' అని సమాధాన పరుస్తుండేవారు ఉత్తరాలలో ఆయన రామాన్ని.

'కళ్యాణమొచ్చినా కక్కొచ్చినా ఆగదు' అనే సామెతకు ప్రత్యక్ష తార్కాణం తానే అవుతానని అనుకోలేదు రామం. ఒకనాటిరాత్రి అన్నవరం కొండమీద తనవంక చుట్టాలు ఎవరూ లేకుండా, ఆఖరికి చెల్లెలయినా రాకుండా తన వివాహం జరుగుతుందని అనుకోలేదు రామం. అనుకోనివే జరుగుతుంటాయి. అలానే జరిగింది.

తన ఆర్థిక పరిస్థితికి పెళ్ళి చేసుకోవడం అనవసరం అనుకున్నాడు రామం ఒకప్పుడు. తపోనిష్ఠ, జ్ఞానతృష్ణ, మానవసేవాభిలాష వున్నవాళ్ళు సాధారణంగా బ్రహ్మచారులుగా వుంటారు. ఉండగలరు. ఉద్యోగం, ఆహారం, నిద్ర తప్ప మరొక ఆలోచన లేని వాళ్ళకు వివాహజీవనం అవసరముంది. తప్పదు...... 'పెళ్ళి చేసుకోక తప్పదు' అనుకున్నాడు రామం. కాని తను అద్దెకుంటున్న యింటివాళ్ళ అమ్మాయినే చేసుకోవాలి అనుకోలేదు. తాతగారు ఊరికి పిలిచి చివాట్లు పెట్టేక కాని ఆవిషయం అతని ఆలోచనలోనే లేదు. 'పరాయివాళ్ళమా ఏమిటి, మాయింట్లోనే భోంచెయ్యకూడదా?' అనడం, తఱచుగా టిఫెన్ కాఫీలు వారి చిన్నబ్బాయిచేత పంపిస్తుండడం, పండుగ ఏదైనా వస్తే వంటచేసుకోవద్దని బలవంతపెట్టి పిండివంటలతో విందు చేయడం మొదలైనవాటికి కారణం అప్పటికి గాని తెలియలేదు రామానికి. ఎప్పుడైనా ప్రమాదవశాత్తు ఎదురుపడితే ఆ యింటి అమ్మాయి లేడిగంతులు వేస్తూ యింట్లోకి పారిపోవడం, వీధి వరండా ఎప్పుడూ శుభ్రంగా వుంచడం కూడా తన వెనుక జరుగుతున్న రహస్యపుటాలోచనల పర్యవసానమా అని అనుమానం కలిగిందతనికి. కాఫీ తాగుతూ కలలుగన్న అమ్మాయిల్ని వదిలి ఆయింటి అమ్మాయి కమల గురించి ఆలోచించలేదు. ఆమెను చూసింది ఒకటి రెండు సార్లే అయినా అమ్మాయి నచ్చింది అనుకున్నాడు.

అమ్మాయికి, అమ్మాయి అమ్మగారికి కూడా అబ్బాయి నచ్చాడు. ఫాక్టరీ పనిపాట్లలో చక్కగా మసలుకోవడాన్ని తనకూ నచ్చాడు. ఇంక వేరే సంబంధం ప్రయత్నించడం 'మేకపిల్లను చంకను పెట్టుకొని ఊరంతా వెదకడం' లాంటిది అనుకున్నాడు వెంకట్రావు. రామానిది చిన్న ఉద్యోగమే అయినా తను తల్చుకుంటే పెద్దఉద్యోగం చేయగలడు. అతని పినతండ్రులు కూడా పెద్ద ఉద్యోగాలలో వున్నారు. మంచి సంప్రదాయ కుటుంబీకులు అనుకున్నాడాయన. ఎన్నాళ్ళ చాటుమాటున ప్రయత్నాలని మంచిరోజు చూసుకొని ఒకనాడు రాత్రి రామాన్ని పిలిచి మా అమ్మాయిని పెళ్ళి చేసుకుంటావా? అని అడిగేడాయన. సిగరెట్టు తాగ అలవాటు లేని పుడు, ఎదుట వాడు సిగరెట్టు తాగ మొహం మీద పొగలుతో మాట్లాడినప్పుడు లాగా

పడుతున్న అతని గుండెలు ఉధృతం తగ్గించాయి. రాని చిరునవ్వు ఒకటి మొహంమీదికి వచ్చింది. లోపలికి ప్రవేశించాడు. ఇంతలో నాయనమ్మ వంటింట్లోంచి వచ్చింది. ఇంకా గుమ్మందగ్గరే వుండిపోయిన కమలని చూసి వెంటనే రామం చెల్లెలుచేత హారతి యిప్పించి ఆచారప్రకారం యింట్లోకి ప్రవేశింపజేసింది. కమలా, రామంచెల్లెలూ వంటింట్లోకి వెళ్ళిపోయారు. నాయనమ్మ మనుమడితో సంభాషణ ప్రారంభించింది.

రామం తాతగారు చాలా గంభీరులు. ఆయనకి పట్టుదలా, పౌరుషం ఎక్కువన్న విషయంతప్ప మరేమీ తెలియదు రామానికి. అందుచేతనే ఆయన అసలు తన్ను పలకరించనే పలకరించరు అనుకున్నాడు. కాని ఆయన శత్రువైనా యింటికివస్తే ముందు పెద్దమనిషి తరహాగా పలకరించి తర్వాత, తగువు పెట్టారు. వ్యంగ్యంగా మాట్లాడుతూ యెదుటవాడిని ఏడిపించడంలో ఆయనకి ఆయనే సాటి. నాయనమ్మా మనుమల సంభాషణ మధ్యమధ్య అక్కడక్కడ కలుగజేసుకొని ఎవరినో ఉద్దేశించి అన్నట్టు ఏవో మాటలు వ్యంగ్యంగా అన్నారు తాతగారు. ప్రయాణపు బడలికవల్లా, యిలాంటి సంఘర్షణవచ్చి తీరుతుందని ముందే ఊహించడంవల్లా రామం కూడా ఏమీ తీసిపోలేదన్నట్టు మాట్లాడాడు. దానిమీద తగువు పెరిగింది. రామం తాతగారు పెద్దగా ఏవేవో కేకలువేస్తూ తిట్టారు. రామానికి కోపం వచ్చింది. 'ఇక యీ యింటిగడప తొక్కను' అంటూ వీధిలోకి వెళ్ళి బండి తీసుకువచ్చాడు. కమలని బయలుదేరమన్నాడు.

రామం చెల్లి దీనంగా బతిమాలింది. నాయనమ్మ 'మీ తాతగారి మాటలకి లెక్కేంటి నాయనా. ఎప్పుడూ వున్నదేగా. రెండు రోజులుండి వెళ్లు' అంది. 'వట్టి మనిషికూడా కాదురా. అలా తిట్లుకొట్లాటలతో తిరిగి వెళ్ళకూడదురా' అంది. ఎన్నన్నా వినలేదు రామం. ఏమైనా వుండదల్చుకో లేదు అక్కడ. బండి ఎక్కమన్నాడు కమలని. 'మిమ్మల్ని చూడాలనివుండి వచ్చాం. చూసేంగా యిక ఎప్పుడు వస్తే ఏం నాయనమ్మా' అంది కమల శెలవుతీసుకుంటూ. కేకలువిని గుమ్మందగ్గరకి వచ్చినవాళ్ళూ, అక్కడవరకూ రాకుండా వాళ్ళ వాకిళ్ళ ముందు వాకిళ్ళల్లో నిల్చున్నవాళ్లూ వింతగా కళ్లు అప్పజెప్పి చూస్తున్నారు. కమల బండి యెక్కింది. బండి కదిలింది.

ఆ గ్రామంనుండి నాలుగు మైళ్ళు ప్రయాణంచేసి పట్నంలో రైల్వేస్టేషనుకి వెళ్లాలి. బండి పట్నం పొలిమేరలు చేరింది. పొలిమేరల్లో ఒక బియ్యంమిల్లు వుంది. ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్న రామం అప్రయత్నంగా మిల్లు ప్రహారీగోడవైపు చూశాడు. ఆ గోడమీద 'సంఘం' అన్న అక్షరాలతోనూ, సినిమాతార మందహాసవదనంతోనూ వున్న వాల్ పోస్టర్ నవ్వినట్టు అనిపించింది రామానికి. గంభీరంగా వున్న అతని మొహంలో అస్పష్టంగా మందహాసం గోచరించింది. నవ్విన వాల్ పోస్టర్ నుండి మొహం తిప్పుకుని కమలవైపు చూశాడు. కమల తనలో తను నవ్వుకుంటుంది. ఎలాగైనా కమల వట్టి మనిషి కాదు గట్టి మనిషే, అనుకున్నాడు రామం. ★

# ★ ఏకలవ్యుడు ★

(17-వ పేజీ తరువాయి)

"ఎక్కడో అక్కడ ఎలాగో అలా ఓసారి మినిష్టరు అయి ఊరుకోండి, ఇంక ఫరవాలేదు. వన్స్ ఎ మినిష్టర్ —" అని జ్యోతిష్కుడు అనే సరికి,

"ఆల్వేజ్ ఎ మినిష్టర్" అని సుబ్బారావు గారు అందుకున్నారు తక్షణం.

సుశిక్షితుడైన జ్యోతిష్కుడి శిష్యుడు, అకాలంలో తుమ్మాడు.

సుబ్బారావుగారే తక్షణం జయం అన్నారు.

"మీరు ఇవాళ్టినుంచీ పేపరుకి చందా కట్టేసి రాజకీయాల గుట్టూ మట్టూ ఆకట్టుకోండి. ఈలోగా, అంతర్జాతీయ సమస్యలు—ప్రపంచశాంతిలాంటివి తేలికైనవి నాలుగైదు ఏరుకుని వాటి పరిష్కారానికి ప్లానులు ఆలోచించండి" అని సూచించి, మూట తీసుకు చక్కాపోయాడు జ్యోతిష్కుడు.

సుబ్బారావుగారు సమస్యల జాబితా ఓటి తయారుచేసి అట్టే పెట్టుకొని ఓ రోజు బాగుచూసి హైదరాబాద్ బయల్దేరారు.

"అన్నట్టు చెప్తారూ మీ జీతాలు పెంచే సమస్య ఓటుందిగదూ అక్కడి కెళ్లాక నే చూస్తాలెండి" అన్నారు ఉద్ధరించే ఏర్పాటులో దర్జాగా.

"చిత్తం. మా సమస్య హైదరాబాద్ లో లేదండి. ఇందుబట్టే, మేష్టర్ల ఇళ్ళలో ఉంటోంది. ఏదో తీర్మానంగట్రా చేస్తున్నాం లెండి" అన్నారు రామనాథంగారు నవ్వుతూ.

"అమ్మమ్మమ్మ అలాటి పిచ్చిపనులేం తొందరపడి చెయ్యకండి. వాళ్లు పుసుక్కుని లేవనేస్తారు. ఏదో నాలాటివాడిల్లి నిర్దేశించి గట్టిగా కనుక్కోవాలిగాని...కనుక్కోవడం ఏముంది మినిష్టరయీ అవుతూనే—"

"ఎంతమాట. ఎంతమంది మినిష్టర్లు కాందే, మా కష్టాలు గట్టెక్కేమ. మా సంఘంలో చెబుతాలెండి. సుబ్బారావుగారు మంత్రి అయేదాకా మా జీతాలు పెంచద్దు వీలైతే తగ్గించండి అన్న తీర్మానం చేస్తాం. మీ ముద్దు చెల్లుగాక. శుభం. వెళ్ళిరండి."

"మళ్ళీ ఇప్పట్లో రావడం పడదేమోనండి. అట్నుంచటా ఢిల్లీ వెళ్ళొచ్చు. పేపర్లో చూస్తారుగా. నా భోగట్టా తెలుస్తూనే ఉంటుంది".

"ఏమిటీ! మీరు పేపరుకూడా పెట్టిస్తున్నారన్నమాట భేష్" అన్నారు రామనాథంగారు.

రైలు ఓ మైలుదూరం వెళ్లాక, రామనాథం గారి మాటల్లో హేళన బోధపడింది సుబ్బారావుగారికి.

"హేళనే! ... ఇందుకే నాకు మంట! చూస్తాగా మీ జీతాలెలా పెరుగుతాయో" అన్నాడు కిటికీలోంచి బయటకు చూస్తూ...

* * *

.. దేశసేవ చేసితీరతానని సుబ్బారావుగారు ఎంత పట్టుపట్టినా కుదిరింది కాదు. కావలిస్తే దేశమధ్యంలోనే ఉండి కావల్సినంత సేవ చెయ్యండిగాని, ఇక్కణ్ణించి చెయ్యడానికి వీలుపడదని చెప్పారు అక్కడివారు. ఉన్న మినిష్టర్లకే ఇళ్లు దొరక్క ఇబ్బంది పడుతున్నారన్నారొకాయన.

"ఆ. దాంకేముందండి. మనం ఇక్కడ ఉంటామా పెడతామా. ఊహూ టూరుచేస్తూ ఉండడమేగా. ఊళ్లో ఉన్న రెండ్రోజులూ కావలిస్తే హోటేల్లో ఉంటాంలెండి" అని చూశారు సుబ్బారావు గారు.

"నీకు మరీ మతిపోతోంది నాన్నా. వాళ్లంతా వేళాకోళంచేస్తున్నారు. అదీగాక ఎలక్షన్లలో గెలిస్తేగాని మినిష్టరు గిరీ ఇవ్వరు" అంది సీత.

అమ్మడూ నీకు తెలీదూరుకో అని కోప్పడ్డారు సుబ్బారావుగారు.

అలా ఎలక్షనుకి నిలబడనివాళ్ళని ఇదివరకు నామినేటెడ్ మినిష్టర్లుగా నిలబెట్టిన సందర్భాలూ వివరాలూ ఆయన కంఠతా పట్టాడు. అవన్నీ కలసిరాకపోతే, చివరకి ఎలక్షనుకి నిలబడతాను అన్నాడు.

దర్జాగానిలబడండి. అన్నారుగాని దగ్గర్లో ఎలక్షన్లు ఏమీ లేవాయె.

చివరకి విసుగెత్తి దేశసేవని బిజెల్లి వాయిదా వేసుకొని తిరుగుటపాలో ఇంటికొచ్చేశాడు సుబ్బారావుగారు సతాపమేతుడై.

* * *

"పోనీ కనీసం డిప్యూటీ దేశసేవ చేస్తాననకపోయారూ...ఆర్నెల్లుతిప్పినా చాలనకపోయారూ" అన్నాడు రామనాథంగారు ముర్నాడు ఉదయం సానుభూతినభినయిస్తూ.

"ఆర్నెల్లుకాదు ఆరు ఘడియలుకూడా—" అంటూ హఠాత్తుగా ఆగిపోయాడు సుబ్బారావుగారు. మొన్నమొన్ననాడు తను దేశసేవకోసం హైద్రాబాద్ వెళ్తున్నప్పుడు రామనాథంగారు హేళనచేశాడన్న విషయం చటుక్కుని జ్ఞాపకం అందుకనికోపం,వచ్చాయి.

"ఇదుగో వీరండోయ్, మీ రేమనుకుంటున్నారో ఏమిటోగాని మా పిల్లదాన్ని మీ గురునాథానికి ఛస్తే ఇవ్వను. ఆఁ" అన్నాడు.

"మేం ఎప్పుడూ అడిగినట్టు గుర్తులేదే" అని తనుమనుకోకుండా జవాబు విసిరిన రామనాథంగారు క్షణంతరవాత నాలిక్కొరుకున్నాడు ఎంతపనైపోయింది అని. సుబ్బారావుగారి మనసులో ఇలాంటి సదభిప్రాయం ఉన్నట్లు ఆయన కలలోకూడా అనుకోలేదు. గురునాథరావు సీతవంక గుడ్లు తేలవేసి చూడ్డం గమనించిన సమయాలలో మటుకు ఆయనకి రెండుమూడుసార్లు ఆ ఊహ తోచింది. సుబ్బారావుగారికీ మనసులో అలాంటి సంకల్పం ఉందన్నమాట. ఇపుడాయన కోపంలో ఇంతచక్కగా దాన్ని ప్రకటించాడు. "ఏం లాభం."

అప్పటికే, అవతల గదిలోంచి ఈ సంభాషణ వింటున్న గురునాథరావుగుండె గుభేలుమంది. అని ఓసారి ఆగింది. ఆ తరవాత పని చెయ్యడమో ఆగిపోవడమో తేల్చుకోలేక తటపటాయించింది.

'ఏల బ్రతుకేల', అనే విషాదగీతం పాడవచ్చునని యజమానికి తోచింది. కాని గురునాథరావుకి అలాటి పిచ్చి వేషాలు గిట్టవు.

## 3

అనుకోకుండా పెద్దలాడుకున్న సరసం కాస్తా ఇలా బెడిసికొట్టింది. ఆ దెబ్బతిన్న పిన్నలు.

సుబ్బారావుగారు తిక్క కోపం కొద్దీ గబగబా వాకబు చేసేసి, మునిసిపల్ చైర్మన్ అయితీరాలనుకుంటున్న ఒకానొక గణపతిరావు గారినివరించి,వారికుమారుడికి సీతనివ్వ నిశ్చయించారు. అంతకుముందింకో ఇంజనీరు వినాయక రావు గార్ని చూసి ముచ్చటపడి సంబంధం ఖాయపరచబోయారు గాని, వారికి కుమారులు లేనివైనం ఆఖరుక్షణంలో తెలిసి విరమించారు.

తెలుగుసినిమా కథ చివరిభాగంలాగా, ఆయన ప్రయత్నాలూ, నిర్ణయాలూ, కార్యాలూ హడావుడిగా జరిగిపోయాయి. వారూ వీరూ చూచుకున్నారు. ముహూర్తాలూ పెట్టేసుకున్నారు.

ఇలాంటివి గురునాథరావు ఖాతరుచెయ్యడు గాని, సీతపద్ధతి చూడడంతో అతనికి మతిపోయింది. చూడవచ్చిన పెళ్ళికొడుకు లందరికీ వంకలుపెట్టి వచ్చినదారినే పంపించేస్తుందనీ, ఈలోగా తను బియ్యే పాసై ఉద్యోగం సంపాదించి పెళ్లికి సిద్ధం కావచ్చుననీ అతని ఆశ.

కాని సీత అలాటి పనేం చెయ్యలేదు. ఔను అనలేదు, కాదు అనలేదు.

అక్కడితో గురునాథరావుకి సీత మీద ఆశ, జీవితంమీద ఆసక్తి తగ్గిపోయాయి. అశక్తుడి క్రోధం, దాని తరువాయి వ్యాధి అయిన దుఃఖం పెల్లుబికాయి...

...ఈ తతంగాన ఊళ్ళో పెద్దల తలకాయలమీద కనబడని రాళ్ళు వర్షించాయి. ఏమిటిది! అని వాళ్లు ఆశ్చర్యపడ్డారు గాని,

★

[మిగతా పైవారం]

# వనితా లోకం

"ఇల్లు చూచి ఇల్లాలిని చూడు." అనే సామెత పూర్తిగా తప్పనడానికి లేదు. ఇల్లు శుభ్రంగావుంటే ఇల్లాలు కూడ శుభ్రంగా వుంటుందనిన్నీ, ఇల్లు అశుభ్రంగా వుంటే ఇల్లాలు కూడ అశుభ్రంగా వుంటుందని మన పెద్దలు పెట్టిన సామెత. ఆమాట కొంతవరకు నిజం గావచ్చుకాని పూర్తిగా తప్పనడానికి వీలులేదని నా అభిప్రాయం.

ఐదారుగురుగల సంసారంలో అంతా సహకరించి ఎవరిమట్టుకు వారు శుభ్రపరుస్తుంటే ఇల్లు శుభ్రంగా ఉంటుంది గాని ఇంట్లో ఎవరూ కూడ ఇంటిశుభ్రతకు శ్రద్ధ చేయక ఆమాట ఇల్లాలిమీదకు తోస్తే సబబుగా ఉండదు. ప్రతి ఇంట్లోను పిల్లల మొదలు పెద్దలవరకు శ్రద్ధచేస్తేనే ఇల్లు శుభ్రంగా వుంటుంది.

కొన్ని ఇళ్లలో అందరిదీ తలోమాట, తలోచేత అయి ఇంట్లో వాళ్ళకు ఏవస్తువు ఎక్కడ వున్నదీ తెలియక దానికోసం వెదికేందుకు ఆమూలనున్నవి, ఈమూలనున్నవి ముందు పోసుకుని ఆఖరికి ఆవస్తువు అగుపించక ఈ ముందుపోసినవి తిరిగి సద్దుకోక నానా పాడుగాను చేసుకుంటారు. అల్లాంటి ఇంటిలో తప్పు పూర్తిగా ఇల్లాలిదే అనడానికి వీలులేదు. పాపం ఆఇల్లాలు కొంతవరకు పాటుపడుతూనే వుండవచ్చు.

పిల్లలులేని సంసారమైతే ఎక్కడివక్కడే వుంటాయి. అప్పుడు ఇల్లు శుభ్రంగానే వుంటుంది. పిల్లలు లేని ఇల్లు శుభ్రంగా లేకపోతే ఆతప్పు ఇల్లాలిదే.

అదీకాక ఇద్దరు ముగ్గురు పిల్లలైతే కూడ ఇల్లు జాగ్రత్తగా కాపాడుకోవచ్చు. ఎందుచేతనంటే పైన వున్నవి అలమార్లు, టేబిలు మొదలైన వాటి మీదవి వాళ్లకు అందవు. వాళ్లి ఆట వస్తువులతోటే ఆడుకుంటూ వుంటారు. అప్పుడు ఆ ఇల్లాలికికూడ వాళ్లను అదుపులో పెట్టి ఇంటిశుభ్రత కాపాడుకోడానికి ఎక్కువ కష్టం వుండదు.

ఇంక ఐదారుగురు పిల్లలైఉండి, పెద్ద దిక్కు లేని సంసారమైతే తల్లి చెప్పినట్టువిని కుదురైన పిల్లలైతే తప్ప, ఆఇల్లు శుభ్రంగా వుంచుకోడం చాల కష్టమే అవుతుంది. ఐదారుగురు పిల్లలంటే పెద్ద పిల్లకు సాధారణంగా 13, 14 సం॥ వయసు వుంటుంది.

## మరి ఇల్లాలి చిక్కులో?

## ఇల్లు చూచి ఇల్లాలిని చూడు!

ఆవయసు పిల్లలైనప్పుడు ఆడపిల్లలైనా మగపిల్లలైనా సరే ప్రతి రోజూ నిద్రనుంచి లేవగానే పక్క జాగ్రత్త చేసుకుని మంచం ఎత్తివేసి, స్నానం చేసిన బట్టలు ఆరవేసుకుని ఆరిన తర్వాత జాగ్రత్తచేసుకుని చదువుకున్న పుస్తకాలు అలమారులో సద్దుకుని, ఇల్లాంటి చిన్న పనులు ఎవరిమట్టుకు వారు చేసుకుంటే ఇల్లాలికి పని తెరిపిగా వుంటుంది. ఎవరైనా ఇల్లు చూడడానికి వచ్చినా ముచ్చటగా వుంటుంది. అంతేగాని మంచం పక్క ఒకమూల, చదివినపుస్తకాలు, పెన్ను అన్నీ తలోమూలవుండి ఆపిల్లలు ఎక్కడో ఆడుతూనో కబుర్లు చెప్పుతూనో వుంటే ఆ ఇల్లాలు ఏమి చేయగలుగుతుంది. ఇంకో తర్వాత ఇద్దరు ముగ్గురు పిల్లల స్నానం పానం సంగతి చూచి, వంట చేసుకుని మిగిలిన పనులు చేసుకోవాలి. ఆడపిల్లలైతే, వాళ్ళ పుస్తకాలు బట్టలు వాళ్లు జాగ్రత్త చేసుకోలేకపోతే తల్లికి ఏమి సహాయం చేస్తారు. లేకు అంటే ఆతల్లి పెద్ద పిల్లలు పనులు కూడా ఏమి చేస్తుంది. సాధారణంగా మధ్యతరగతి కుటుంబాలలో నౌకర్లు వుండరు. అంట్లు, పాచితప్ప మిగిలిన పని చేయించుకునే ఆర్థిక స్తోమత వుండదు. పట్నాలలో వుండే కుటుంబాలకు వుదయం 9½ గంటలకు వంట పూర్తిచేసి గృహ యజమానికి భోజనం సిద్ధం చేయాలి. ఉదయంనుంచి 4 గంటల వ్యవధిలో వంట చంటిపిల్లల సంరక్షణ, ఎదపిల్లల అల్లరి, ఆపైపిల్లల తగాదాలు అన్నీ సద్దుకుని హాలులోకి వస్తే అంతకన్న పైపిల్లలు చింపిపోసిన కాగితాలు, ఒలకపోసిన సిరామరకలు, చదువుకుని చెల్లాచెదురుగా పారేసిన పుస్తకాలు, వుదయం విడిచిన బట్టలతోటి హాలువుంటే వెనకపని సహాయం చేసే దక్షత లేక, పని వాళ్ళు లేకపోతే ఆ ఇల్లాలు ఇంకేమి చేయగలుగుతుంది.? ★



# వింత అలవాట్లు

## బి. ప్రేమలీల

ఒక సాయంకాలం నేనూ, మా వదినా, మరో కొందరు స్నేహితురాళ్లూ ఊర బాగా దగ్గర్లోనే వున్న పొలాలవేపు షికారుగా బయలుదేరాం. కొన్నేళ్ళు అటూ ఇటూ తిరిగి చల్లనినీడపట్టున కూచుని ఏవేవో కులాసాసంభాషణలు సాగిస్తున్నాం. క్రమంగా మా సంభాషణ ఇంగ్లీషు కవిత్వంలోకి దిగింది. ఒక ప్రఖ్యాత ఆంగ్ల కవయిత్రి పేరు జ్ఞాపకంరాక, తలోవిధంగా పేర్లుచెప్పుకుని చివరికి అందరం మెదలకుండా వూరుకున్నాం. కాస్సేపటికి నా ప్రక్కనే కూర్చున్న స్నేహితురాలికి ఆ పేరుజ్ఞాపకంవచ్చిందిలావుంది గభాలున నా వీపుమీద ఒక్క, చఱపు చఱచి ఆ సందేహం కాస్తా తీర్చేసింది.

కాని—నా వీపుమాత్రం కొన్ని నిమిషాలవరకు చురుకు, చురుకు మంటూనే వుంది. మొహమాటంకొద్దీ పైకి ఏమన లేక లోలోపల గిజగిజలాడాను. చెప్పొద్దూ, కాలక్షేపం వచ్చిందికూడా. ఆ అమ్మాయి ఇంకా ఏవేవో కబుర్లు చెప్తుతూ తన ప్రతిభను చాటుకుంటూంది. వదినా, మిగతావాళ్ళూ నా వంక సానుభూతిగా చూస్తూ ముసిముసిగా నవ్వుకున్నారు. కాని ఆ అమ్మాయి ఇదేం గమనించినట్లు లేదు. ఎందుకంటే ఆమెకదో అలవాటయిపోయింది. తానేదయినా గమ్మత్తుపని చేసినా—కొత్త విషయం తెలుసుకున్నా, విన్నా, ఎవరయినా వస్తున్నా—ప్రక్కవాళ్ల వీపుమీద చఱచి మరీచెబుతుంం దా శుభవార్త. ఆ విషయం బాగా గ్రహించిన మిగతావారు ముందే మెలకువపడుతుంటారు. ఆవేళ పొరపాటున దగ్గరగాకూర్చుని అన్యాయంగా వీపు మూద్చుకున్నాను. అలాంటి అలవాటు మంచిదికాదని—దానివలన ఇతరులకు కష్టం కలుగుతున్నదనీ ఆమె గ్రహించదు. మాట్లాడుతూ, మాట్లాడుతూ, ప్రక్కవాళ్ల వీపు అంటించుతూ వుంటుంది. ఆమెకదో 'జోక్'లా వుంటుందేమోకాని ప్రక్కనున్న దురదృష్టవంతులకది ప్రాణాంతకం. తర్వాత — తర్వాత — ఆ పాడుఅలవాటు ఆమెలోనుండి తప్పించేశారనుకోండి కొందరు బుద్ధిమంతులు.

మనం బాగాగమనిస్తే ఇతరులకు బాధను కలిగించే ఇలాంటి 'వింత అలవాట్లు' మన చుట్టూవున్న మనుష్యుల్లో ముఖ్యంగా స్త్రీలలో అధికంగా కనిపిస్తుంటాయి. మన అలవాట్లు—చేసేపనులు కొన్ని—కొన్ని, మనకు చాలా సహజంగా, మామూలుగా కనిపించవొచ్చు. అవే ఇతరులకు అసహ్యంగా—విచిత్రంగా—కనిపిస్తుంటాయి. నలుగురి మధ్య తిరుగుతున్నపుడుగాని — మాట్లాడుచున్నపుడుగాని మన వేషధారణ, సంభాషణ, చేష్టలు, ఇతరులకు ఆహ్లాదకరంగా వుండాలికాని వారికివిసుగు-అసహ్యం-బాధ-కలిగించేవిలా ఉండకూడదు. కొందరికివిపరీతమైన అలవాట్లు బాగా పాతుకుపోయి అదో బలహీనతగా మనసుకో తేసంతగా వంటబట్టిపోతుంటాయి. అలాంటివారిని చూసి జాలిపడటంతప్ప ఇంకేం చేయగలం?

మా బంధువుల్లో ఒకమ్మాయి తనకు ఎవరయినాఏడుస్తూంటే చూస్తే నవ్వొస్తుందని చెప్పింది. కాని అదెంత నిజమో తెలీదు. కాని - ఒకనాడు హఠాత్తు అలాంటి సంఘటనకళ్లారా చూసాను. పైవాళ్లెవరయినా ఏడుస్తుంటే నవ్వుతుందేమో అనుకున్నాంగాని స్వంతబంధువులు ఏడుస్తూంటే కూడా ఆమె నవ్వుకోడం ఆశ్చర్యం కలిగించింది. బంధువులింట్లో పిల్లాడు పోతే పరామర్శించటానికని వాళ్ళింటికెళ్ళాం. కడుపుపగిలిన ఆతల్లి బంధువుల్ని చూసి హృదయవిదారకంగా ఏడుస్తూంది. అందరూ ఆదుఃఖంలో పాలుపంచుకుంటున్నారు. కాని ఈ అమ్మాయి అవిడవంక అలా చూసిచూసి పవిటచాటున ముఖాన్ని దాచుకుని పక్కున నవ్వేసింది. ఏడుస్తున్న ఆతల్లి - మిగతావాళ్లూ తెల్లబోయి అపిల్లవంక చూశారు. ఆ పిల్లని దారిలో సన్నసన్నగా అందరూ చివాట్లు పెట్టాం. పాపం, ఆ అమ్మాయి కూడా ఆ నవ్వు రాకుండా అపుచేసుకుందామని ఎంతో ప్రయత్నిస్తుందట. కాని ఆపాటికి శక్తి

### టాఫీ

కావల్సిన సామాన్లు కొలతలు: మంచి చిక్కని గేదెపాలు 6 కప్పులు. తేనె ½ కప్పు. పంచదార 2 కప్పులు. బారెడు వేరుశనగపప్పు. కొంచెం (నిమ్మకాయంత) వెన్నపూస, లేక ఒక టేబిల్‌స్పూన్ డాల్డా నెయ్యి.

వేరుశెనగపప్పు లేతగా వేయించి పొట్టుతీసి తెల్లగా శుభ్రపరచాలి. కుంపటిమీద, పాలు, పంచదార, తేనె కలిపి కళాయిగిన్నె పెట్టాలి. దగ్గర కూర్చుని అట్లకాడతో బాగా మాటిమాటికి కలుపుతూ ఉండాలి. అలా ఒక ½ గంట అయినపిదప పాకంతో చుక్క చన్నీళ్ళలో వేసి చూసుకుని, గట్టిపడితే, వెంటనే వెన్నపూస, వేరుశెనగగింజలు వేసి ఖంలో 20 నిముషాలు అడుగంటకుండా తిప్పి, పళ్ళెమునకు నేయిరాచి దానిలోనికి తిరగబోయాలి. చల్లారినవెనక చాకుతో ముక్కలు కోయవలెను.

తర్వాత ఇంకొకటి. పాకం నీళ్ళలో గట్టిగా వచ్చువరకు చూచి తరుపరి గింజలు వేయాలి చాలా రుచిగా ఉంటుంది. ఈ వేసవికాలం నూనె, నేయి ఎక్కువగా తింటే దాహంవేస్తుంది. ఇలాంటివైతే పిల్లలకూ, పెద్దలకూ కూడా తినటానికి చాలా బావుంటవి. పైగా నిలువఉంటుంది. తేనెతోచేసే స్వీటులో జీడిపప్పు, సారపప్పు మన యిష్టంవచ్చినవి వేసి చేసుకోవచ్చు. తయారుచెయ్యడం కొంచెం శ్రమేఅయినా తినడానికి బాగుంటుంది.

డి. లలితా రాజ్,
(హోషంగాబాద్, మధ్యప్రదేశ్)

## ఫ్రాకులకు నెక్ డిజైను

కంటికి ఎదురుగా ఉండే రంగు దారాల (మీకు నచ్చినవి)తో పువ్వు రేకలను మధ్య కుట్టు వేసుకోవాలి. మొగ్గలను లేత ఆకు పచ్చ దారంతో గొలుసు కుట్టు వేసి నింపాలి. తీగ భాగం అంతా కాడ కుట్టు వేసుకోవచ్చు. గొలుసుకుట్టు అయితే చక్కగా కంటికి ఆనుతుంది. పువ్వాడికి వాడే దారం పూల రేకలను బట్టి ఉంటుంది. వాటి కాడలకు అదే దారాన్ని కాడకుట్టు వేసుకుంటే నప్పుతుంది.

దేవరకొండ జానకి. ★



ఆమెలో లేదు. అప్రయత్నంగానే నవ్వేస్తుంది. ఫలితంగా చీవాట్లు తింటుంది. అది ఒకరకమయిన మానసిక బలహీనత అయ్యుంటుంది. ఇలాంటివారే మరికొందరు నలుగుర్లో వున్నప్పుడు అకారణంగా నవ్వేస్తారు. నవ్వు నాలుగందాలచేటు అకారణంగా నవ్వినా ఉన్న నలుగురూ తమను గురించే ఎదటిమనిషి నవ్వుందేమో ననుకుంటారు. అనుకుని కారణం అడుగుతారు. ఏం చెబితే వాళ్ళకి నమ్మకం కలుగుతుంది? అందుకని ఇలాంటివారు కారణం అడిగితే జవాబుకూడా పసేమిరా, చెప్పరు. నిజానికిది చాలా అనర్థాలకు దారితీస్తుంది.

మరికొందరికి అంతూపంతూ లేకుండా వదవదా వాగడం ఒక అలవాటు. మాటలాడటం తమజన్మహక్కు అన్నట్టుగా గంటలకొలదీ ఫుల్‌స్టాప్, కామా, సెమికోలన్లు లేకుండా ఏకదమ్‌గా వాగేస్తుంటారు. ఎదుటివారికి ఊపిరి సలపనీయరు. వినటానికి అయిష్టం కనపరచినాసరే – విషయం మార్చినాసరే, లేచి పోతున్నాసరే – ఆ వాక్ప్రవాహానికి మనం ఆనకట్టలు కట్టలేం. చివరికి మన అదృష్టం బావుండి వారు కదిలేసరికి వాన వెలిసినట్లవుతుంది.

మా ఇంటికో అమ్మాయి మిషను మీద బట్టలు కుట్టుకోడానికి వస్తుండేది. వచ్చింది లగాయితు మళ్ళా వెళ్ళేవరకు, ఆ మిషను 'జర్ జర్' శబ్దంతోపాటు ఆమె బడబడా వాగుతుండేది. సగంవరకూ శ్రద్ధగా సరదాగా వినేవాళ్ళం, ఆ తర్వాత చెడ్డ విసుగేసేది. సమాధానంగా ఏదన్నా చెప్పబోతున్నా — మాట్లాడబోతూన్నా, చెప్పనిచ్చేదికాదు. మా మాటల్ని మొదట్లోనే త్రుంచేసి తను మాత్రం మెయిల్ స్పీడ్‌లో మాట్లాడుతుండేది. ఆ అమ్మాయినిచూస్తూ "ఎంత, ఎనర్జీ వేస్టు" అయిపోతుందో నని విస్తుపోయి చూస్తుండేదాన్ని. పైగా ఆ అమ్మాయి నన్నుచూసి అంటూండేది గదా "మీరంత నెమ్మదిగా వుంటారు అంత మెల్లగా మాట్లాడుతారు; "టీచర్ ఉద్యోగం ఎలా చేస్తున్నారో ఆశ్చర్యంగా వుంటుంది సుమండీ నాకు"... "లేకపోతే మీలా వడవడా వాగమన్నారా" అందామని నోటి వరకూ వచ్చింది కాని లోలోపల ఆమాటల్ని దిగమింగుకుని నవ్వేసి ఊరుకున్నాను.

కొందరికి మరో చిత్రమైన అలవాటు ఉంటుంది. సినిమా చూస్తున్నారనుకోండి; చూస్తున్నంతసేపూ ఆ పిక్చరులో వచ్చే మ్యూజిక్‌కు, దృశ్యాలకి ఉత్సాహపడిపోతూ ప్రక్కనున్న వారి వీపుమీద దరువు వేస్తూనో, చేతులమీద కితకితలు పెడుతూనో, గిల్లుతూనో వుంటారు. ఇలాంటి అనుభవానికి గురయ్యాను నేనొకసారి. ఇంట్లోవాళ్ళం, మరి కొంతమంది స్నేహితురాళ్ళతో కలసి ఒకనాడు ఏదో సినిమాకువెళ్ళాం. లతా మంగేష్కర్ గాత్రం వినవచ్చినప్పుడూ, ఇంకా మరికొన్ని మంచి ఘట్టాలు వచ్చినప్పుడూ, నా ప్రక్క

(42-వ పేజీ చూడండి)

# ఉద్యోగం - వివాహం



"నీ క్వాలిఫికేషన్సేమిటి?
"నీ వయస్సెంత?"

యీ విధంగా అబ్బాయిల్ని ఇంటర్వ్యూలలో అడిగినట్టే—

"ఇంగ్లీషు చదివేవా?"
"సంగీతం, అదీ వచ్చునా?"
"వయస్సెంత?"

అని అమ్మాయిల్ని కూడా పెళ్లిచూపుల్లో అడుగుతూంటారు.

ఖాళీలు లేవని ఆఫీసుల్లో పొమ్మన్నట్టే—మా అబ్బాయికి ఇప్పట్లో పెళ్ళి చెయ్యమనో మరేదో కారణం చెప్పి తప్పుకుంటూంటారు కొడుకులు గల తండ్రులు.

"అప్పుడే ఫిలప్ అయిపోయినాయండి!" అని ఆఫీసుల్లో అన్నట్టే—

"మా వాడికి మేనరికం ఉందనో, మరో దగ్గిరసంబంధం వుందనో చెప్పి పొమ్మంటారు కొందరు.



చదువు పూర్తి అయేక ఉద్యోగం కాకుండా వుండిపోయిన అబ్బాయీ, వ్యక్తురాలయి వివాహం కాకుండా వుండిపోయిన అమ్మాయీ అందరికీ బరువే అన్నారు.

ప్రస్తుతం మగవారికి ఉద్యోగం దొరకడం ఎంత దుర్లభంగా వుందో అలాగే ఆడవాళ్ళకి వరుడు దొరకడం అంత కష్టంగానూ వుంది.

ఉద్యోగం కోసం వెతుక్కునే అబ్బాయి ఒక బుష్‌కోటు, ఒక పేంటూ, మంచివి ఎలాగో కుట్టించుకొని అట్టేపెట్టుకుంటాడు. ఎందుకంటే ఎప్పుడయినా యింటర్వ్యూలకి వెళ్ళినపుడు అవి తొడుక్కోడానికి.

అలాగే పెళ్లికోసం కాసుక్కూర్చున్న అమ్మాయికి కూడా ఒక జార్జెటు వల్లెవాటూ, ఒక సాటీను పరికిణీ, ఒక వాయిలు జాకెట్టూ కుట్టించి వేరే వుంచుతారు! పెళ్లిచూపులకి ఎవరయినా వస్తే వాటిని ధరింపజేసి ప్రదర్శనానికి నిలబెడతారు.

ఉద్యోగానికి యింటర్వ్యూ ఎలాటిదో — వివాహానికి, పెళ్ళిచూపులు అలాటివి—

"ఏం చదివేవు?"

"ఫలానా యింతసొమ్ము ముందుగా డిపాజిట్ చెయ్యాలి, తర్వాత ట్రయినింగు అదీ, మా మనుషులతోనే జరిపించుకుంటే చూస్తాం." అని కొన్ని ఆఫీసులవాళ్లు చెప్పినట్టే—

"ఫలానా యింత కట్నం. తక్కిన లాంఛనాలన్నీ అత్యురాలా జరగాలి. అలా అయితేనే మాటాడండి!" అని అంటూంటారు కొందరు పెళ్ళివారు.

వారు కట్టమన్న డిపాజిట్టు సొమ్ముగాని వారడిగిన కట్నాలుగాని ఇచ్చే స్తోమత సాధారణ సంసారులకి వుండదు.

ఈ కాలంలో ఉద్యోగం దొరకాలంటే—గవర్నమెంటు వారిప్పించాలి, లేదా మిగతా ప్రయివేటు కంపెనీలలో దొరకాలి. గవర్నమెంటు ఉద్యోగాలికి దరఖాస్తులు పెట్టడమే గాని దర్శనం దుర్లభం. ఇహ ప్రయివేటు కంపెనీలయితే. అవి కేవలం ఆయా మేనేజర్ల, యిష్టాయిష్టాల మీద, దయమీద, వెళ్ళిన వేళావిశేషం మీద ఆధారపడి వుంటుంది. ఆసమయంలో ఆయనదృష్టి ఏ అభిమానస్తులమీదా పడకూడదు. ఇలాటి విషయాల్లో, ఆ ఆఫీసర్నిగాని, ఆ యజమానినిగాని బాగా తెలిసివుండాలి లేదా తెలిసివున్న వారుండాలి. లేదా చిత్తుగా లంచం యివ్వడానికి, పిలుస్తే డబ్బు పలుకుతూండాలి. లేకపోతే ఎవరయినా బంధువులో మిత్రులో పెద్ద 'గిరీ'ల్లోవుండి పుణ్యంకట్టుకోవాలి. యిటువంటి 'దన్ను'లు బాగావుంటే ఎవడికయినా ఉద్యోగం దొరికేఆశ వుంది.

అలాగే ఆడపిల్లలికి పెళ్ళికావాలన్నా—మొదట కట్నం యివ్వడానికి వేలకివేలు వుండాలి. లేదా ఏ మేనరికమో ఏదో చేతిలో సంబంధం ఉండాలి. యివివుంటే పెళ్ళి జరగడానికి ఆశఉంది.

కాని ఇవన్నీ కుదిరిన అబ్బాయిగాని అమ్మాయిగాని లేకపోవడంవల్లనే ఇప్పుడు ఉద్యోగాలు లేకుండా ఉండిపోయిన అబ్బాయిలూ, మొగుళ్ళులేకుండా ఉండిపోయిన అమ్మాయిలూ ఎక్కువయిపోయినారు.

వారి దురదృష్టానికి చింతిస్తూ సగంచచ్చి తలవంచుకు లజ్జతో బ్రతుకుతున్న యిలాటివారికి, పూర్తిగా విరక్తికలిగించి అవమానపరిచేలోకం, ఆ లోకంతోపాటు ఏం చేసేది లేక, తాముకూడా వారిని కించపరుస్తున్న తల్లిదండ్రులూ కూడ ఉన్నారు.

ఇలా ఉద్యోగం కాకుండా ఉండిపోయిన అబ్బాయిలమీద, వివాహం కాకుండా ఉండిపోయిన అమ్మాయిలమీద జాలిపడడానికి బదులు, వారిని చిన్నబుచ్చుతూ, నానా మాటలూ ఆడుతూ వారికి జీవితంమీదే ఒక నిరుత్సాహాన్ని విరక్తిని ప్రోత్సహిస్తున్నారు కొందరు పెద్దవాళ్ళు. పగలల్లా ఆఫీసులకి తిరిగి ఉద్యోగాలు దొరక్క యింటికివచ్చి చిన్నతనంతో, దుఃఖంతో ఇంట్లో కూర్చుంటే—

"ఫలానా అమ్మాయి చూడు! ఉద్యోగం చేస్తూ కుటుంబాన్ని పోషిస్తూంది! ఆడది నీకన్నా నయం!"

"వాడు—చిన్నప్పటినుండీకూడ ఖాళీగా ఉండలేదు, చదువుకో చెప్పుడు గూడ ఎక్కడో అక్కడ పనిచేసుకుంటూనే వచ్చేడు! ఇంతకీ తెలివి తేటలుండొద్దూ! ఒకరిని చూసయినా నేర్చుకోవాలి!"

"నాలిగిటికీ తిరిగి నలుగుర్ని కనుక్కొని కాళ్ళూ కాళ్ళూ పట్టుగోక పోతులా అలా యింట్లోనే పట్టెమంచంమీద పవ్వళిస్తే ముద్ద ఎలా వస్తుంది?"

"తక్కువదానంబట్టి కుటుంబపోషణ చేయమన్నారు ఎలాగో ఒకలాగ ఎక్కడో అక్కడ ఏదో ఒకటి చేసి నాలుగురాళ్ళు తెచ్చుకుంటే కదా! మళ్ళీ యింట్లో అపూటకి ఏది తక్కువయినా సొక్కదు. నవకాయ పిండివంటలతోనే నైవేద్యం పెట్టాలి? ప్రొద్దుటా మధ్యాహ్నం ఫలహారాలు కావాలి! కొత్త సినిమాలకి మొదటిరోజే విజయం చెయ్యాలి! ఇవన్నీ ఎలా వస్తాయి? తేలేనివాడికి తిండెక్కువట!"

ఇలా యింట్లో నానామాటలూ అంటూ మనశ్శాంతి లేకుండా చేస్తూవుంటారు. యిహను బయటికివెళితే—బంధువులు, మిత్రులు, వాళ్ళూ వీళ్ళూ ఏమిటి—అవసరం వున్నవాళ్లూ లేనివాళ్లూ కూర్చుండి పరామర్శిస్తారు వాళ్ల కదోక సరదా!

"అదేంవిట్రా యింకా వుద్యోగం లేకుండా తిరుగుతున్నావు? ఎక్కడో అక్కడ బుర్ర దూర్చ లేకపోయావా?"

"మీనాన్న కొంతమందికి ఉద్యోగాల్లో ఉన్నారుకదా, ఒక ముక్క వేయించలేక పోయారా? మనకి గర్వం అయితే యేలా కుదురుతుంది? ఎవళ్ళినో ఒకళ్ళని ఆశ్రయించాలి మన అవసరంబట్టి!" అని కొందరు.

"ఫలానావాడిదగ్గర కాళీలు వున్నాయట వెళ్ళి ఓ ముక్క తగల్చుకూడదా. నాలుగు వైపులా రాళ్లు విసిరితే ఏదయినా తగులుతుంది" అని మరికొందరు.

"ఏది చాతకాకపోతే ఏదయినా వ్యాపారంలోకి దిగు" అని మరికొందరూ అంటూంటారు. ఇలాటి సిగ్గుచేటు మాటలన్నీ వింటూ వ్యక్తిత్వాన్ని చంపుకొని పడివుండాలి.

ఈవిధంగానే ఈడొచ్చి పెద్దదయిన అమ్మాయి పెళ్లికాకుండా కొన్నాళ్లు వుండిపోతే ఇంట్లో మొట్టమొదట ఆమె తల్లికి బద్దకం లావవుతుంది. చిన్నపిల్లల బట్టలు ఆమెలే ఉతకాలి. వాళ్ళని ఎత్తుకోవాలి, ఆడించాలి, వండాలి, నీళ్లు తేవాలి, తమ్ముళ్ళకి, అన్నలకి, చెల్లెళ్ళకి తలలుదువ్వి సేవలు చెయ్యాలి. అక్కయ్యలెవరయినా వుండి పురుళ్ళకి వస్తే వాళ్ళకి కాళ్లు పట్టాలి!

ఎవరికయినా పెళ్లిళ్లు అవుతున్నాయంటే—"అందరికి నిక్షేపంలా పెళ్ళిళ్ళు అవుతున్నాయి. దీనిరాత ఇలా కాలుతూంది! ఇంకా ఎన్నాళ్లుండాలో?" అంటూంటారు.

పెళ్ళిసంబంధం విషయాలచర్చలు ఇంట్లో తల్లీ తండ్రీ మధ్యనువస్తే వాళ్ళ చికాకులో ఎన్నో తలవంపుమాటలు దొర్లుతూవుంటాయి. అవి ఒక్క ఆడవాళ్ళే వింటూ భరించగలరేమో అనిపిస్తుంది.

"ఈ ఆడపిల్లలు పుట్టడం కాదు గాని గుండెలమీద కుంపటిలా ఉంటుంది. యిల్లు నాశనమవుతూంది. ఎంత వెతికినా ఒక్కడూ దొరకడు, ఇదా పెద్దదయి నెత్తిమీద కూర్చుంది! ఇహ వీళ్ళని యే రాత్రో నూతులో తోస్తా, పీక పిసికో చంపి నేనూ చావాలి! అంతకన్నా దారి కనబడలేదు. నలుగురిలోనూ చిన్నతనం, అవమర్యాదా! ఆడపిల్లా—అప్పు తెచ్చిన సొమ్మూ ఎన్నాళ్ళుంటే అంత నష్టం!"

"అయినా పెట్టిపుట్టొద్దూ! దీని యీడువాళ్ళు ఎక్కడచూసినా చూడముచ్చటగా పిల్లల తల్లులయి పోయిగా కాపురాలు చేస్తున్నారు. ఆ రోజా కలిసిరాకుండా ఉంది భగవంతుడా!"

"పోనీ ఎవడినో ఒకడిని చూసి ముడిపెట్టి మనబాధ్యత తీర్చుకుందాం అంటే, ఎక్కడికి వెళ్ళినా, ఎవరిని అడిగినా వేనవేలు కట్నాలు గావాలి! అమ్మాయి అందంగా ఉండాలి! కట్నాలు మూడాన్ని కట్నాలు ఖచ్చితంగా ఉండాలి! లాంఛనాలు లావుగా జరగాలి! ఇవతలవాళ్లు, ముష్టెత్తుకు తిరిగినా బాధలేదు. సెకండ్ ట్రెయినింగు మాష్టరికైతే వెయ్యికిలోపు, అయిదు వందలకి పైనా, స్కూలుఫైనలు పాసయి ఉద్యోగం లేకుండా ఉంటే వెయ్యినూటపదహార్లు, ఉద్యోగం ఉంటే ఆ ఉద్యోగాన్ని బట్టి రెండువేలకి తక్కువకాకుండానూ కావాలి! మెట్రిక్యులేషనుకి పైని ఎన్నిక్లాసులు ఎక్కువ చదివితే అన్ని వేలు చదావుపడుతుంది. అందులో తీసుకున్న గ్రూపుల్ని బట్టిగూడా కట్నాల రూపాలు మారుతూంటాయి. ఇదెవడితరం?"

ఇలా అంటూంటారు. ఆ అమ్మాయి కాస్త మంచిచీర కట్టుకొని నీటుగా ఉండాలని చూస్తేచాలు:

"బావుందమ్మా! ఈడొచ్చినదానివి పెళ్లి లేదూ? అలా సింగారించుకుని ఊరేగితే నలుగురూ ఏమంటారు? పెళ్లీపెటాకులు అవవలసినదానివి?" అని విరగబడతారు.

ఇలాటి మాటల్లో నిత్యం తల వంచుకొని ఎక్కడికీ వెళ్లకుండా సరదాగా వుండకుండా అలాగే సిగ్గుపడుతూ ఇంట్లోనే ఉండాలి.

ఇలా అందరిమూలంగా మాటలు పడడానికి, ఆ అబ్బాయి గాని ఆ అమ్మాయిగాని చేసిన దోషం ఏమిటి? వాళ్ల తప్పేమిటి?

వీళ్లెందుకూ 'పనికిరానివారా? శక్తిలేక వుండిపోయినవారా? కాదు తమలో 'చావ' వుండీకూడా దానిని బహిర్గతం చేసే అవకాశాలు లేక, ప్రోత్సాహం లేక తగిన దన్ను సహకారం సహాయం లేక నిక్షిప్తమయిన నిధుల్లాగ వుండిపోతున్నారు.

మధ్యతరగతి ఉద్యోగం సంపాదించుకొని, సాధారణ జీవితం గడపడానికి కావలసిన చదువు చదువుకున్నారు. అంతకన్నా ఎక్కువ ఆశకూడా లేదు కాని, అది పూర్తిచేసి ఎన్నాళ్ళయినా ఉద్యోగాలంటూ పుట్టడం లేదు, ప్రయత్నలోపమూ లేదు. యిది ఆ అబ్బాయిల చేతగానితనమా?

యవ్వనం వచ్చింది. వ్యక్తురాలయి వివాహానికి తగివుంది. కేవలం దేవలోకాల్లోంచి దిగిన అప్సరసలు కాకపోయినా రాక్షస లోకంలోంచి మాత్రం దిగబడినవారు కారు. ఏదో మధ్యనున్న మానవలోకపు కన్యలు భర్తతో కాపురంచేసే యీడువచ్చినా అనుభవించదగ్గ అందం వున్నా భరించదగ్గ వయస్సు వున్నా రజస్వల అయి మూడు నాలుగేళ్లయినా వరుడు దొరకడంలేదు; కళ్యాణం కలిసిరావడంలేదు. యిది ఆ అమ్మాయిల తప్పా?

శక్తి చాలక అబ్బాయిలకి పైచదువులు చెప్పించలేరు.

తాహతు లేక అమ్మాయిలకి గొప్ప సంబంధాలు తేలేరు, రావు. యివి వాళ్ల పొరపాటా?

ఎక్కడయినా ఎవరయినా ఉద్యోగమంటూ యిస్తామంటే—మొదటి ఒకటి రెండు నెల్లూ వుత్తినే పనిచేయడానికి కూడా యీ వుద్యోగం లేనివాళ్లు తయారు. తమ వ్యక్తిత్వంలో వున్న గౌరవాన్ని చంపుకొని చేసే పనికి సరిఅయిన ప్రతిఫలం యిస్తున్నారో లేదో అయినా ఆలోచించుకోకుండా ఎంతో కొంతజీతానికయినా ఒప్పుకొని పనిచేయడానికి వారు తయారే. ఉద్యోగం సంపాదించడానికి ఎన్నివిధాల ప్రయత్నించాలో దేనిమూలంగా అవుతుందో అన్నీ చేసి చూస్తారు. కాని పరిస్థితులవల్ల లభించకపోతే వారేం చేస్తారు? దబాయించి ఏ ఆఫీసుల్లోకో పోయి పని చేసెయ్యలేరు కద!

అలాగే ఆడపిల్లలు కూడా! వాళ్లేమీ

# ★ ఉద్యోగం...వివాహం ★

జమీందారుల బిడ్డల్ని పెళ్ళాడతామని పట్టు పట్టలేదు! చిన్నవాడు, రూపసి, గుణవంతుడూ అయితే చాలని అనుకుంటారు. అదీ పైకి అనరే. అనరు.

పెళ్ళిచేసుకుందికి కట్నాలు అడుగుతూంటే వాళ్ళేం చేస్తారు? అవన్నీ పెద్దవాళ్లు పెట్టుకున్నవే. తన తమ్ముళ్ళకి అన్నలకి కట్నాలెందుకు పుచ్చుకుంటున్నారు? మరి తనకి యిచ్చేటప్పుడే ఎందుకేడుస్తారు? కట్నం యివ్వలేకో మరి జీనిచేతనో పెళ్ళి చెయ్యలేక తమని తిరిగి నిందించడం ఎందుకు? పిల్లని చూస్తామని ఎవరయినావస్తే ఆ పెళ్ళి చూపుల్లో సిగ్గు, లజ్జ విడిచి, అవమానం చంపుకొని బొమ్మలాగ ఎదురుగుండా వెళ్ళి నిలబడతారు. కొందరు పాడమంటారు, అవసరంగా ఎన్నో ప్రశ్నలు వేస్తారు. వీటిన్నిటికీ అడ్డు చెప్పకుండా మనసును చంపుకొని అలాగే చేస్తారు. అంతకన్నా ఏం చెయ్యగలరు? ఎవ్వరూ ముందుకివచ్చి వివాహం చేసుకోరు! ఇంక తను స్వతంత్రించి ఎవరినో ఒకరిని పెళ్ళాడలేరు కద! అంచేత వీరికి వివాహం కాకపోయిందంటే వీరిలో ఏం తప్పుంది?

పైకి వారు అలావున్నా వారి మనసుల్లో వారి దురదృష్టమూలంగా ఎటువంటి అశాంతి వుంటూ వుంటుందో?

"చదివిన చదువు వృథాపోతుందా? మరి ఉద్యోగం దొరకదా? తనలో నిజంగా తెలివితేటలు లేవా? తన కొ అదృష్టం లేదా? తనొక్కడే యిలా ఎందుకూ పనికి రాకుండా అందరికీ బరువయిపోయినాడా? ఎన్నాళ్ళిలా రోజుల్ని చంపుతూ సంపాదించే శక్తివచ్చి కూడా తండ్రి ఆర్జనమీద వుండి నడపగలను? తనకయినా ఉద్యోగం అయితే తన చెల్లెళ్ళకి ఎక్కువ కట్నం యిచ్చి పెళ్ళిచేయగలిగి వుండునేమో! తన జీవితం యిలా ఎందుకూ పొందకుండా పోవలసిందేనా?" అని ఉద్యోగం లేనివాళ్లు సదా విచారిస్తూ వుంటారు.

అట్లాగే పెళ్ళికాని అమ్మాయిలు కూడా బెంగతోనూ చిన్నతనంతోనూ,

"ఈ యీడులో నాతోటివారు ఎంత సుఖంగా వున్నారు? తన వయస్సంతా యిలా వృథా పోవలసిందేనా? ఎందరు పిల్లలతో భర్తలతో హాయిగా వున్నారు. తనలో ఏలోపం వుందని పెళ్ళికాలేదు? కట్నం యివ్వనంతమాత్రంలో డబ్బు లేనంత మాత్రంలో వివాహం కాదేకాదా? తనొక్కర్తే యిలాటి అభాగ్యురాలా? తనకే ఏల యీ దురదృష్టం? మరి తనకు సుఖపడే యోగ్యత లేదా? పెళ్ళికాదా? ఆ భగవంతుడు యింత తొందరగా ఎదిగేటట్టు ఎందుకు చెయ్యాలి? తన అన్నలకి ఉద్యోగాలవుతే యింతవరకూ రాకుండా యింతో అంతో కట్నం యిచ్చి ఎలాగో తనని పెళ్ళిచేసి పంపించి వేదురే! యిన్నాళ్ళొచ్చి పెళ్ళికాకుండా యిలా పుట్టింట్లో తల్లికి తండ్రికి, అందరికి అయిష్టమయి ఎన్నాళ్ళిలా వుండగలను?" అని అనుకుంటూంటారు.

వాళ్ళ వికలమయిన మనసులని ఎవరూ ఓదార్చేవా రుండరు, సరికదా మరింత అవమాన పరచడానికి కించపరచడానికి చూస్తూంటారు.

యిలాటివారిని ప్రతినిముషం ఏదో ఒక నెపం పెట్టి అపహాస్యం చేస్తూండడం, తల్లిదండ్రుల పొరపాటు. ప్రతిచోట పలకరిస్తూ చిన్నబుచ్చుతూండడం పైవాళ్ల పొరపాటు. వారి సున్నితమయిన మనస్సులు పాడయి విపరీతమయిన పనులకి, పరిస్థితులకి దారితీస్తాయి.

ఆదినుండి అంతంవరకూ పోషరిపోతులయి తమలోవున్న జ్ఞానాన్ని కూడా తెలుసుకోలేని, పనికిరాని వాళ్లనయితే తల్లిదండ్రులేకాదు ఎవరేమన్నా అనొచ్చును గాని, ఒక స్థాయికి పోయి స్వంతంగా స్వతంత్ర జీవనానికి శక్తి సంపాదించుకొని—అవకాశాలు లేక, వినియోగించలేక సమాజంలో వున్న వారిని మాత్రం ఎవరయినా ఏమన్నా అన్నారంటే అది కేవలం అన్నవారి తప్పే. ఆధారాన్ని చూసి ప్రేలాడమంటే అర్థముందిగాని ఆకాశాన్ని చూసి ప్రేలాడమంటే శక్యమా?

చదువుకొని ఉద్యోగం దొరక్క వుండిపోయినవాళ్ళూ, యుక్తవయస్సు వచ్చి, అందం వుండి, కట్నానికి డబ్బు లేకో మరెందువలనో పెళ్ళికాక వుండిపోయిన వాళ్లూ ప్రస్తుతమూ, ఆప్తులకి, బంధువులకి, స్నేహితులకి, లోకానికి, కడకి తల్లిదండ్రులకి కూడా ప్రత్యేకంగానూ, అదోవిధంగానూ పైకి తేలిపోయి కనబడుతున్నవాళ్ళు అందరికీ వీళ్ళు మోయలేనిబరువు మానలేని పోత అయినారు. ఒకొక్కప్పుడు అతీతమయిన మాతృప్రేమకి అలభ్యమయిన పితృవాత్సల్యానికి దూరమవుతున్నట్లు గూడా కనిపిస్తుంది. పిల్లలెలాటివారయినా తల్లిదండ్రుల ప్రేమ ఎప్పుడూ ఒక్కలాగే వుంటుందన్నది ఒక సిద్ధాంతమేగాని వారి సహజమయిన ప్రేమ పరిస్థితులవల్ల ఏమయిపోతూందో అర్థం కావడం లేదు. వాళ్లు రోజూ అనే మాటలబట్టి తక్కువ చూపే చూస్తూంది అనుకోక తప్పదు. వాళ్ళ పరిస్థితులబట్టి, విసుగుబట్టి, నిరాశబట్టి, వీటన్నిటిబట్టి చూస్తే తల్లిదండ్రులు కూడా వారిని ప్రేమించలేదేమో అనిపిస్తుంది. అది వారి ధోరణిలోనే ధ్వనిస్తూంది.

పైవాళ్ళముందు తల్లిదండ్రులు పిల్లల్ని పొగడడం, శ్రేయస్సు కోరదంటారు. యిలాటి నమ్మకాలవల్ల 'ఏదోలే వాడి కేం తెలుసు చిన్నవాడు!' అని అంటూండడం అలవాటు. ఆ పిల్లలో నిజంగా శక్తివుంటే యిలా అనడంలో అర్థంవుంది—'పిల్లలని పొగుడుకుంటారా?' అని పయివాళ్ళు అనుకోవచ్చు. కాని ఏ 'చావా' లేని స్వరూపాలని కూడా పయివాళ్ళముందు అలాగే అంటే—వున్నదున్నట్టు చెప్పడం అవుతుంది. అలా అయినపుడు ఆ పిల్లలు ముఖ్యంగా పైవాళ్ళకి అతి సుళువుగా లోకువ అయిపోతారు. వాళ్ళకి ఎలాగూ లోకువే.

ఇంకొందరు ఎలాటి వారంటే—వారిలో వాకచక్యం, శక్తి అన్నీ వున్నా—అవి కనబర్చే మార్గంలేక అలాగే వుండిపోతారు. యిటువంటివారే—చదువుకున్నా ఉద్యోగం దొరకనివారు, అన్నీ వున్నా పెళ్ళికానివారున్నూ. యిటువంటి వారిని పైవాళ్ళ ముందు ఏమీ అనకూడదు. పొగిడేరూ అంటే వాళ్ళలో పైకి కనబడే గొప్పతనం ఏమీ లేదు. పొగడకుండా—హీనంగా చెప్పేరూ అంటే వాళ్ళేమీ తెలివి తక్కువ వారు కారు. దద్దమ్మలు కారు. అంచేత యిలాటివారిని ఏమీ అనకుండా వూరుకోవడం ఉత్తమం.

'జ్ఞానం వచ్చేవరకూ పిల్లల్ని పెంచేం, యింక బాధ్యతంతా వాళ్ళదే' అన్నట్టు ప్రస్తుతం యీ పెద్దలు ప్రవర్తిస్తున్నారు. మేకపిల్లకి స్వభావమయిన స్వతంత్రం యివ్వలేయి దానిని అడవిమధ్యకి జాగ్రత్తగా తీసుకుపోయి క్రూరమృగాలున్నచోట విడిచి 'యిహ నీకు స్వాతంత్ర్య మిచ్చేను యిష్టం వచ్చినట్టు విహరించు' అని అన్నట్టుంది. యిలా కుదరదు. వాళ్లు ఉత్కృష్టంగా బ్రతకడానికి మార్గాలు చూపాలి. సరిఅయిన వాతావరణం ఏర్పరచాలి! ఒక ఆదర్శం చూపి అది పొందేవరకూ సహకరించాలి! అప్పు డావ్యక్తి దానిని వుంచుకోనక పోతే—ఏమయినా అనవచ్చును. యివేవీ చెయ్యకుండా కొంతవరకూ చదువు చెప్పించి తమభారం తీరిపోయిందని—ఆ పిల్లలకి—దూరంగా వున్న హరివిల్లును చూపెట్టి అది ఎక్కాడితే మబ్బుల కన్నెలని నీకిచ్చి పెళ్ళిచేస్తారని చెప్పడం భావ్యంకాదు. అలా వదిలేసిన వాళ్లు, కాళ్లూ చేతులూ ఆడక కొట్టుకుంటూంటే వారిని గుయ్యబట్టి నిందించడం ఆ పెద్దల తప్పుగాని ఆ పిల్లల తప్పు గాదు.

(47-వ పేజీ చూడండి)

ఉత్తరాలు:

# హైదరాబాదు సినిమాలలో

## ★ ఆడవాళ్ల ఇబ్బందులు ★

ఈ ఊరు (హైదరాబాద్) లోని సినిమాలలో స్త్రీలకు టిక్కెట్లు దొరకడము చాలా కష్టము. ఇక్కడ స్త్రీలకు టిక్కెట్లు రెండు తరగతులు మాత్రమే వున్నాయి. మొదటిది రు 1-8-0, రెండోది 10 అణాలు. హిందీ కాని తెలుగు కాని ఏదైనా కొత్త సినిమాకు 10 అణాల టిక్కెట్టుకు వెళ్ళదల్చుకుంటే 3 గంటలకే సినిమాహాలుకు చేరుకోవాలి. 6 గంటలకు సినిమా ప్రారంభమవగా 3 గంటల నుండీ క్యూ ప్రారంభమవుతుంది. 6 గంటలయేసరికి అరమైలుదూరం వెడుతుంది క్యూ. చంటిపిల్లలు కలవాళ్లు ముసలివాళ్లు అంతా అక్కడే కూర్చుంటూ లేస్తూ అవస్థపడాలి క్యూలో. ఇక్కడ పిల్లలకు తప్ప పెద్దవాళ్లకు ఒక్క టిక్కెట్టుకన్నా ఎక్కువ ఇవ్వరు. ఎవరి టిక్కెట్టు వారు తీసుకోవలసిందే. ఇంట్లో ఎంతమంది వెడితే అంతమందీ, క్యూలో నిలబడాలి. టిక్కెట్లు ఇవ్వడము ప్రారంభించేసరికి, చంటిపిల్లలవున్నారనైనా ఆలోచించకుండా ఒకరిమీద ఒకరు తోసుకుంటూ పడిపోతారు. టిక్కెట్లు ఇచ్చే కిటికీలో ఒక్కసారి పదిమంది చేతులు దూర్చేస్తారు. డబ్బులు ఇచ్చి టిక్కెట్టుతోసహా చెయ్యి బయటికి తీసుకునేందుకు (సాధారణంగా చెయ్యి తిరిగి వస్తుంది) బ్రహ్మప్రయత్నం చేయాలి. 10 అణాల టిక్కెట్లు మొత్తం 25 కాని 30 కాని ఇస్తారు. అంతే. ఆ తరువాత లేవంటారు. 3 గంటల నుండీ ముందుగా వచ్చినవారికి మాత్రమే 10 అణాల టిక్కెట్లు దొరుకుతాయి. మిగతా వాళ్ళంతా పెద్ద టిక్కెట్టు తీసుకోవలసిందే. పోనీ 15 అణాల టిక్కెట్లు తీసుకొన్నా మొగవాళ్లలో కూర్చోనివ్వరు. సాధారణముగా కొంచెము డబ్బుగల స్త్రీలు తప్ప మిగతా ఆడవాళ్ళంతా 10 (అణాల) టిక్కెట్టుకే వస్తారు. వాళ్ళు టిక్కెట్లు అయిపోయాయన్న తరువాత 10 అ. టిక్కెట్టుకోసం వచ్చినవారు ఇంకా ఎంతో మంది మిగిలి వుంటారు. దగ్గరనుండి వచ్చినవారికైతే ఫరవాలేదు. పెద్ద టిక్కెట్టుకు డబ్బులేకపోతే ఇంటికైనా పోతారు. కాని కొంతమంది పిల్లలతో చాలా దూరంనుండి వస్తూవుంటారు. అటువంటివారికి చాలా ఇబ్బంది. ఎంతోసేపు క్యూలో నిలబడి చివరికి టిక్కెట్లు దొరకక ఇంటికిపోవాలన్నా ప్రాణం వప్పదు. వెళ్లడానికి ఖర్చులు, మళ్ళీ రావడానికి ఖర్చులు దండగ. పోనీ, 4, 5 అణాలు లేడాలో ఇంకో తరగతి టిక్కెట్లు వున్నాయేమో అంటే అదేమీ లేదు. రెట్టింపు డబ్బు ఎక్కువ పెట్టి పెద్ద టిక్కెట్టు తీసుకోవలసిందే. పోనీ పిల్లల్నయినా విడిచిపెట్టరు. 3 సంవత్సరాల పిల్లలకూ టిక్కెట్టు తీసుకుంటారు. అర టిక్కెట్టు కూడా లేవు ఇక్కడ. టిక్కెట్టు తీసుకున్నా పిల్లలకు సీటుఇవ్వరు! వళ్లో కూర్చోపెట్టుకోవలసిందే. పోట్లాడినా లాభంలేదు. చోటులేదంటారు! ఇంక లోపల అందరకూ ఒక్కటే ఫేను వుంటుంది. ఫేను క్రింద కూర్చున్నవారికి తప్ప, మిగిలినవారికి గాలి వుండదు. గాలి లేక చోటులేక పిల్లలు పెద్దగా ఏడుస్తూ వుంటారు. అక్కడ నియమించబడిన అవ్వ నోటికి వచ్చినట్లు తిడుతూ వుంటుంది.

“పిల్లల్ని కనడము చేతనవును గాని వాళ్ళ దాయించడము చేతకాదు బయటకు తీసుకుపోతారా లేదా” అంటూ ఇష్టమువచ్చినట్లు తిడుతూ వుంటుంది. కొంతమంది స్త్రీలకు పిల్లల్ని విడిచి సినిమాలకు వెళ్లేందుకు వీలుండదు. అటువంటివారు డబ్బు ఖర్చు కాకుండా అందరిచేతా చీవాట్లుకూడా తినిరావాలి. పిల్లలకు ఏమైనా కొనబోతే, అర్ధణా బిస్కట్టు, అణాన్నర. అణాసోడా, ఐదణాలు వుంటుంది.

కొన్ని టాకీసులలో ఎండాకాలము కుళాయిలు కూడా కట్టేస్తారు. మంచినీళ్లు కూడా వుండవు. ఒక కుండతో నీళ్ళు పెట్టి వుంచుతారు. కొంతమంది మంచినీళ్ళు త్రాగి మళ్ళీ ఆ ఎంగిలిగ్లాసులే అందులో ముంచుతూ వుంటారు. ఇక్కడ వచ్చిన కొత్తసినిమాలన్నింటికీ, సినిమా వెళ్లిపోయేవరకూ ఎప్పుడు వెళ్ళినా జనం వుంటూనేవుంటారు. ఇక్కడ ఆడవాళ్ళు సినిమాకు వెళ్లదలచుకుంటే ఈ అవస్థలన్నీ అనుభవించవలసిందే. మళ్ళీ మగవారికి అన్ని తరగతుల టిక్కెట్లువున్నాయి. 6, అణాలు, 10, 15, 1-8-0 ఇంకా పైవి కూడా వున్నాయి. మరి, ఆడవాళ్లకు ఈ తరగతులు లేకపోవడానికి కారణము ఏమిటో తెలియదు. హైదరాబాదువంటి పెద్దపట్టణములోనే ఈ విధముగా ఉన్నప్పుడు, ఇంక చిన్న వూళ్లల్లో థియేటర్లనుగురించి వేరే వ్రాయనవసరము లేదు.

వి. సుబ్బలక్ష్మి,
(హైదరాబాదు)

* * *

## మంచీ - చెడూ

8-5-57 వారపత్రికలో వేటూరి వినత గారు నేటికథల గురించి వ్రాశారు. వారు పౌరాణిక కథలన్నియూ చాలా వుత్తమమైన నీతిలో వుంటాయనియూ, నేటికథకులందరు స్త్రీ పాత్రలను ఖూనీ చేస్తున్నారనియూ, అవినీతితో కథలను సృష్టిస్తున్నారనియూ వ్రాశారు. దానికి ఒకకథను వుదహరించారు.

మంచీ - చెడూ, పూర్వమూ ఇప్పుడూ కూడా ఉన్నాయని నా అభిప్రాయము. వినతిగారు కారాకాంకం, చిత్రాంగద చదివితే నాతో ఏకీభవిస్తారని తలుస్తాను. ఎప్పుడూ కథలోని కళను ఆస్వాదించి, మంచిని గ్రహించి, చెడును తిరస్కరించాలి అని నా అభిప్రాయం.

విజయ (ఏలూరు.)

* * *

## బేరాలు; బేరాలు

ఆంధ్రపత్రిక (8-5-57) వనితాలోకం శీర్షిక్రింద “కూరలనుండి చీరలవరకూ బేరం చెయ్యడమూ ఒక నేర్పే..!” అని పవని నిర్మల ప్రభావతిగారు తమ అభిప్రాయమును చక్కగా విశదీకరించినారు. నేను కూడా వారి అభిప్రాయము సరియైనదని అంటాను. “అది చదివిన కొందరికి కోపం వస్తుందేమో” అని ప్రభావతిగారు అన్నారు. కాని నేటి విద్యావంతులైన మన తోటిసోదరీమణుల

## బేరాలు; బేరాలు

కొందరికి కోపం రాదని నా నమ్మకం. కేవలం చదువుర్లానివాళ్లే ఇలాగ బేరం చేస్తారనటం కూడా పొరపాటు. కొందరు విద్యావంతులు గూడ యిట్టి అలవాట్లు కలిగియున్నారను టలో ఎలాంటి అతిశయోక్తి కనబడదు.

మాకు దూరం బంధువులు వొకరున్నారు లెండి. వారిది సామాన్య కుటుంబమే. భార్యా భర్త యిద్దరే ఆ యింట్లో. రోజూ భర్త జపం మిషతో అరుగుమీద కూర్చుంటాడు. ఇక వారింటిముందు కూరలవాళ్లు పోవటం ఆలస్యం, ప్రతీవారినీ దింపించేవాడు బేరానికి. వారితో బేరం యిలాగుండేది. "ఏంకూరలున్నాయోయ్ రాకే?" అనేవాడు. వాడు ఏకరవు పెడతాడు.

వాడు చెప్పటం తరువాయి క్యాబేజి దగ్గరనుండి, బీరకాయలవరకు ధర అడుగుతాడు. అన్నీ "తట్టు" ఎంత? అనేలెండి. అంతకీ తగ్గడన్నమాట!

సరే ఏదీ బేరం కుదిరితే ఏ బీరకాయలో 'అర్ధశేరునోటాకు' తీసుకొంటాడు. చూడండి ఇలా ఉంటాయ్ బేరాలు! ఇంట్లో వున్నది యిద్దరేగా! మణుగులూ వీశెలూ బేరాలెందుకు చెప్పండి? ఆ కూరలవాడు నాలుగు వీధులు తిరిగి అమ్ముకునే కాలాన్ని నిష్కారణంగా పాడుచెయ్యడం గదా.

మనక్కావలసినమటుకు బేరం చేయటం, తీసుకోటం సబబుగా వుంటుంది. కానీ ఇలా బేరాలుచేసే వారు తెలిసే చేస్తారో? తెలియక చేస్తారో? తెలిసీ తెలియక చేస్తారో? నాకు అర్థంకాదు. ఇటువంటివా రందరూ తమ అలవాట్లను మార్చుకొన్నచో వారికీ హాయి, తోటివారికీ హాయి!!

ఏకా జయశ్రీ (గుంటూరు.)

* * *

## నొప్పించక తా నొవ్వక

ఆరోజు ఆదివారం. నేను, మా అత్తయ్య, మా అత్తయ్యకొడుకులం కూర్చుని పేకాట సాగిస్తున్నాము. ఆటమటుకు మంచి శక్తిగా సాగుచున్నది. అనుకుంటూ మధ్య లో ఒక పళ్ళెంనిండా వేరుశెనగకాయలు పెట్టుకుని కూర్చున్నాము. మెల్ల మెల్లగా పళ్ళెం ఖాళీ అవుతున్నది కానిమా ఆట మటుకు జోరుగా సాగిపోతున్నది. యెండా కాలము అగుటవల్ల నేమో బయట యెండ చుర్ మంటోంది. సమయము దుగంట లయినా యేదో ఒంటిగంటో అయినట్లు గావుంది. యింతలో బయట చీరలండి, చీరలు, పట్టుచీరలు, జార్జెట్టు చీరలు అని కేక వినిపించింది. నాకు మట్టుకు ఆకేక వినపడగానే చెప్పొద్దూ నా కింక అక్కడ కూర్చోబుద్ధి కాలేదు. అత్తయ్యా, అత్తయ్యా వాడిని పిల వనా అని అడిగాను. అయ్యో దానికేం భాగ్యమా! బంగారమా! పిలవవే నాలుగు చూద్దాం అంది. నేను ఒక్క అంగలో వాడి దగ్గరకు వెళ్ళి వాడిని పిలుచుకొని వచ్చాను.

వాడు వచ్చీరావటంతోనే ఏవేవో పదిరకాల పేర్లు చెప్పి ఏవి తీయమంటారో చెప్పండి నాకు అవతల పనివుంది అని ఒక్క పురుము పురిమాడు. నేను దాంతో టారెత్తి పోయి యింట్లోకి వెళ్ళిపోయాను. సరే వాడు ఎలాగైతేనేం చీరలు తీయటం మొదలు పెట్టాడు. నేను మళ్ళీవచ్చి కూచున్నాను అనుకోండి. మాకందరికి వాటిలో నచ్చినవల్లా రెండేరెండు చీరలు. వాడు ఆ రెండు కలసి 52 రూ॥ ఖచ్చితంగా అవుతుంది ఒక్క కానీ గూడా తగ్గించను అని అన్నాడు. చీరలు మటుకు చక్కగా వున్నాయి. నాకుమటుకు అవి వదలబుద్ధి కాలేదు. మేము యింకా అక్కడ నిలబడి మిగిలినవి కూడా చూస్తు న్నాం. మా అత్తయ్య, ఆమెకొడుకు లోప లికి వెళ్లి ఏమి నిశ్చయించుకొన్నారో ఏమో కాని తిరిగివచ్చి, జత రు 26 యిస్తే యియ్యి లేకపోతే యిక్కడినుంచి శీఘ్రం దయచేయచ్చు అన్నారు. ఆవిడ చేసిన బేరం నాస్తే మా పొట్ట చెక్కలయ్యేలా నవ్వు వచ్చింది. మేము నవ్వు ఆపుకోలేక లోపలికి వెళ్ళిపోయాము.

### నమ్మండి; మానండి

వాడు వెళ్ళిపోయాడు. మేము మళ్లా మా ఆట ప్రారంభించాము. యింతలో మాకు అమ్మగారు! అన్న కేక చెవినిపడింది; ఎవరా అని మాస్తేమిగదా మళ్ళీవాడే ప్రత్యక్ష మయ్యాడు. జత 50 రు॥కి యిస్తాను తీసుకోండి అని అన్నాడు. మా అత్తయ్య మటుకు ససే మిరా ఒప్పుకోలేదు. రు 26 కి యిస్తేయియ్యి లేకపోతే పో అంది. అలాగేవాడు రెండు మూడుసార్లు తిరిగాడు. సాయంత్రము 6 అయింది. మీరు నమ్మనమ్మకపోండి వాడు తిరిగివొచ్చి జత 26 రు॥ యిస్తాను తీసికోండి అమ్మ అనిఅన్నాడు. యింక మాఆశ్చర్యానికీ అంతుపంతులేదు. సరే మా అత్తయ్య రెండు చీరలు పుచ్చుకొని 26 రు॥ యిచ్చి వాడిని పంపించింది.

బేరమాడడం తప్పని నేనేమి అనను. బేరం చెయ్యడం తప్పని యేవస్తువైనా సరే యెంతధరకైనా సరే కొనిన పోమ్మని మాత్రం నే నేమి చెప్పను. ప్రతివస్తువూ బేర మాడాల్సిందే. అలాఅని ప్రతిచిన్న వస్తువు కూడ కాదులెండి. కాని ఆ బేరమాడటంలో కూడా వుంది నేర్పు. బేరమాడటం కూడా కళ ఒకటి.

ఇక షాపులకువెళ్ళి... మనకు కావలసిన రకములేమిటో, ఎంతధరలో కావాలో వాళ్ళకు స్పష్టంగాచెప్తే వాళ్ళకి కష్టంగాని, విసుగుగాని వుండదు. మనకు కావలసిన వస్తువు సంపాదించుమటుకు మనకున్న చెదరదు అంతేకాని అన్ని రకాలుచూచి, చూచి చివరకు నచ్చలేదని, బాగాలేదని, ధర యెక్కువని, ఇవివొద్దని, రకరకాల అభి ప్రాయాలు వెళ్ళబెట్టేబదులు మనకు కావల సినవి, తీసికొని బయటపడ్తే మనకు, అవతల వాళ్ళకు కూడా ప్రాణం హాయిగా వుంటుంది. తీరా అన్నీ చూచి ఏమీ [illegible] కొనకుండా బయటపడితే [illegible] కొట్టువాళ్ళకి మటుకు చికాగ్గా వుంటుంది.

అవతలవాళ్ళను నొప్పించకుండా మనమూ కష్టపడకుండా బేరంచెయ్యటంలోనే వుంది నేర్పుఅంతా.

వల్లూరి అనూరాధ, (పలూరు.)

★

## వింత అలవాట్లు

(37-వ పేజీ తరువాయి)

కూర్చున్న అమ్మాయి నాచేతిమీద గిల్లటం-కితకితలు పెట్టటం సాగించింది. చిత్రంలో సంగీతపు స్థాయి-సంఘటనలు క్లైమాక్సు నందుకోవటంతోపాటు - ఆమె గిల్లటాలు-కితకితలు మొదట్లో తగు స్థాయిలో వుంటూ తర్వాత తర్వాత మించి ధాటీగాసాగాయి. ఆ గిల్లటం దారుణంగా గిల్లేసేది. నాచేతి మీద తేళ్ళూ, జర్రులూ, పాకుతున్నట్టుం డేది. 'సినిమాకని వస్తే ఈ అవస్థ ఏమిటిరా భగవంతుడా' అని లోలోపల మూలుగు తుంటూ ఇంటర్వెల్ వరకూ ఎలానో ఆ అమ్మాయిప్రక్కకూర్చొని ఆతర్వాత మరో మనుమీద ఇంకో సీట్లోకి జారుకుని 'బ్రతి కానురా బాబూ' అనుకున్నాను. ఇంక ప్పుడూ ఆవిడతో కలసి సినిమా కెళ్లకూడదని, వెళ్లినా ఆమె ప్రక్కగా కూచోకూడదని తెలిసొచ్చింది.

ఇంకా ఇలాంటి చిత్రవిచిత్రమైన అల వాట్లు ఇంకెన్నో మనచుట్టూవున్న మను ష్యుల్లో కనపడతాయి. ఆమాటకొస్తే మన లోనూ వుండవొచ్చు అని మనకు మామూ లుగా నే వుండవొచ్చును. కాని అవే ఇతరు లకు బాగా-అసహ్యం కలిగించేవిగా వుంటాయి. గనుక నలుగుర్లో మసలేటప్పుడు మన ప్రవర్తన, మన అలవాట్లు, వారికి బాధ కలిగించకుండా, మన ఉనికి వారికి హాయిని కలిగించేదిగాను ండాలి. ప్రక్కవారికి జుగుప్స కలిగించే మన 'వింత' అలవాట్లు సాధ్యమై నంతవరకూ పైకి కనపరచుకోకుండా, మెల కువగా ప్రవర్తించడం మంచిది. ★




# విద్యావివేకాలు

అన్నదమ్ములు కలరు నల్వురు
అందరును ఉద్దండ పండితు
లందు నాల్గవ వాడు మాత్రము
అల్ప పండితుడే.

పండితులుగా పేరుగాంచగ
పట్టణమ్మున ఉంటమేలని
అందరును పయనమ్ము కట్టిరి
యడవిమార్గమునన్.

దారిమధ్యను వారుగాంచిరి
ఛటఛటా సింగపు టెముకలు
వానినన్నిటి ప్రోగుచేసిరి
ప్రాణములు పోయగా!

అపుడు నాల్గవవాడుమాత్రము
"అన్నలారా! దారుణంబగు
కీడు గూర్చెడి క్రూరజంతువు
నుద్ధరింప" డనెన్.

"విద్దెలందున పెద్దవారి!
సుద్దులేవో చెప్ప నేర్తువ?
చూడుమీ మాబుద్ధి సూక్ష్మత
చూపగల మింకన్;!"

అని ప్రగల్భము లాడువారికి
తిరుగుమాట వచింపనేరక
చిన్నగా అదిచిన్నవాడొక
చెట్టునెగ ప్రాకెన్!

మంత్ర తంత్రము లాచరించుచు
మహిత శక్తిని ప్రదర్శింపగ
శీఘ్రముగ నా సింహరాజము
ప్రాణముల బడసెన్!

అంతలాగక అత్యాగ్రహము
గంతులొ గుటకించె ముగ్గుర
చెట్టుపైగల చిన్నవాడే
గట్టిగా నుండెన్!

విద్యనేర్చితి మన్న గర్వము
ముగ్గురన్నల నుసురుచేసెను.
విద్యతోడ వివేక ముండిన
బ్రతికి బాగుండెన్!

బొడ్డుపల్లి హనుమాయమ్మ

# ధనగుప్తుని యుక్తి

శింగంపల్లి అప్పారావు

పూర్వం మాళవదేశంలో ధనగుప్తుడనే కోమటి ఉండే వాడు. అతనివద్ద తాతలు గడించిన ధనం చాలా వుంది. ఆ ధనంతో వర్తకం చేసి, పెద్ద కోటీశ్వరుడు కావాలని, ధనగుప్తుడికి ఆలోచన కలిగింది. అప్పటినుంచి అతను వ్యాపారంచేస్తూ చాలా డబ్బు గడించి, కోటీశ్వరుడనిపించు కున్నాడు.

కాలక్రమేణ అతనికి నలుగురు కుమారులు కలిగారు. కొన్నాళ్లకు కుమారులు కూడ ప్రయోజకు లయ్యారు. వారుకూడ వ్యాపారం లోని సులువులు తెలుసుకొని, తండ్రికి చేదోడు వాదోడుగా ఉంటూండేవారు.

కాని అదేమి చిత్రమో, ఉన్నట్టుండి, ధనగుప్తుడి అదృష్టం మారింది. కుమారులు వ్యాపారంలో సాయపడుతున్నా, ధనగుప్తుడికి అనుకోకుండా, వర్తకంలో నష్టం రావడం ప్రారంభించింది. ఎన్నడూ నష్టమనేమాట యెరుగని ధనగుప్తుడికి చాలా ఆశ్చర్యం వేసింది.

కాని, మరుసటి సంవత్సరం ఎంత జాగ్రతగా వ్యాపారంచేసినా, మళ్లా నష్టం వచ్చింది. అతని వ్యాపారం నానాటికీ దిగజారిపోయింది. చివరకు ధనగుప్తుడు తినడానికి తిండిలేనిస్థితికి వచ్చాడు.

పరిస్థితులు తారుమారు అవగానే ధనగుప్తుడు జెంగతో మంచం పట్టాడు. దిగులు విచారంవల్ల, వృద్ధాప్యంవల్ల అతను పూర్తిగా లేవలేనిస్థితికి వచ్చాడు.

'ఎప్పటికైనా, పూర్వపు ఔన్నత్యంసంపాదించకపోతామా!' అన్న మొండిధైర్యంతో, ధనగుప్తుడి నలుగురు కుమారులు కొద్ది పెట్టుబడితో చిల్లరవ్యాపారములు చేస్తూ వచ్చారు. అందులోనూ నష్టం తప్పనిసరిగా వస్తూనే వుంది.

ధనగుప్తుడి కీవిషయమేమీ అంతు చిక్కలేదు. తను ఒంటరిగా వ్యాపారం చేసినపుడు నష్టమన్నదే తెలియదు. కాని కుమారులు పుట్టి, ప్రయోజకులై, తనకు అండదండగా నిలిచినపుడు నష్టంఎడతెరిపి లేకుండా వచ్చి బికారిని చేసింది! ఏమిటి దీని అర్థం. 'నాకుమారులు, నాయంతటి అదృష్టవంతులు కారేమో! అయ్యో! వారి జీవితాలు ఎలా గడుస్తవి!' అని సతతమూ ధనగుప్తుడు విచారించేవాడు.

అతడొకనాడు, మంచంపై పడుకొనివుండి కన్నీరు కారుస్తూ "అమ్మా! లక్ష్మి! మామీద నీదయ యేమాత్రంకూడ లేదమ్మా! నీకే మపకారం చేశానని యింత బికారిని చేశావు. ఒకనాడు మర్యాదగా, కోటీశ్వరుడిగా బ్రతికిన నేను యీనాడు నిలవనీడలేని స్థితికి వచ్చాను. నా మీద నీకింకా దయరాలేదమ్మా!" అని లక్ష్మిదేవిని ప్రార్థించాడు.

నిజంగా అతనిమీద లక్ష్మిదేవికి అనుగ్రహం కలిగింది. వెంటనే ధనగుప్తుడికి ప్రత్యక్షమైంది!

ధనగుప్తుడు లక్ష్మిదేవిని చూసి ఆశ్చర్యపోయాడు: "ఎవరమ్మా నీవు! మా పాలిట భాగ్యదేవతవా!" అన్నాడు.

"అవును ధనగుప్తా! నేను లక్ష్మిదేవిని! నీపై అనుగ్రహం కలిగింది! మీ యింటిలో ఉందామని వచ్చాను! నాకు చోటు వుందా!" అన్నది భాగ్యదేవత.

ధనగుప్తుడి సంతోషానికి మేర లేదు. "అమ్మా! నీవు వస్తానంటే, వద్దనే, నిర్భాగ్యుడెవడుంటాడు! కాని పరిహాస మాడుతున్నావా!" అన్నాడు ధనగుప్తుడు అనుమానంతో.

"లేదునాయనా! మీ యింటిలో ఉందామనేవచ్చాను" అని చెప్పింది లక్ష్మిదేవి.

అది వినగానే ధనగుప్తుడు మిక్కిలి సంతోషించాడు; అతనొక క్షణం ఆలోచించి "అమ్మా! నీవు మా యింటిలో స్థిరనివాసం యేర్పరచుకోవాలి. ఇంకెక్కడికీ వెళ్ళకూడదు!" అని ప్రార్థించాడు.

లక్ష్మిదేవి చిరునవ్వు నవ్వింది! "చూడు ధనగుప్తా! నాపేరే చంచల! ఒకచోట స్థిరంగా వుండటానికి నా మనసొప్పదు. నీవు కోరుతున్నావు కాబట్టి చాలా కాలం వరకు నీ యింటనే వుంటాను" అన్నది.

ధనగుప్తుడు ఆలోచించాడు. అతని మెదడులో ఒక ఉపాయం తళుక్కున మెరిసింది. వెంటనే

(48-వ పేజీ చూడండి)

# మణిమహిమ

ఒకానొకప్పుడు చైనా దేశంలో వెంగ్ అనే ప్రభుత్వోద్యోగి ఒకతడుండేవాడు. అతను నలభై సంవత్సరముల వయస్సుగలవాడు. అతనికి భార్యా బిడ్డలు లేరు. ఒంటరిగానే నివసిస్తుండేవాడు. వెంగ్ చాలా దయార్ద్రహృదయుడు. కష్టములలోనుండి నిస్సహాయంగా వున్నవారంటే అతనికెంతో జాలి. అతను అలాంటివారికి శక్తి కొలది సహాయం చేస్తూండేవాడు. అతనికి పశుపక్ష్యాదులమీద కూడ ఎంతో ప్రేమ వుండేది. క్రూరంగా చేసే ఏ పనినైనా అతను గర్హించేవాడు.

ఒకనాడు వెంగ్ వాహ్యాళి కెళ్ళినాడు. అతను వాహ్యాళికి వెళ్ళినప్పుడు వెంట తుపాకి తీసుకు వెళ్ళటం అలవాటు. అదే ప్రకారం వెళ్లినాడు. వెళ్లి ఒక యిసుకతిన్నెమీద కూర్చున్నాడు. ఒక గ్రద్ద చిన్న పిచ్చుకను తరుముతూ వస్తోంది. పిచ్చుక ప్రాణభీతిచే వణుకుతూ శక్తి కొలది పరుగెత్తుతోంది. ఆ దృశ్యం చూచాడు వెంగ్. వెంగ్‌కు ఆ చిన్న పిచ్చుకమీద ఎంతో జాలికలిగింది. పిచ్చుకవేపు కొరకొర చూస్తూ దాన్ని పట్టుకొనుటకు వెంబడించే గ్రద్దమీద వెంగ్‌కు చాలా కోపమొచ్చింది. బలమున్నదని చిన్న జంతువుల నన్యాయంగా సంహరించటం వెంగ్‌కు కోపకారణమైంది. పిచ్చుక స్థితి హృదయవిదారకంగా వుంది. మరి రెండుక్షణాల్లో పిచ్చుక గ్రద్ద చేతిలో పడిపోతుంది. ఇంతలోకే తుపాకి గుండు గ్రద్దను నేల కూల్చింది.

అల్లంత దూరాన నేలకూలిన గ్రద్దను చూడబోయాడు వెంగ్. చచ్చిపడి వున్న గ్రద్దముందు విలువైన దుస్తులు ధరించిన ఒక మనిషి కనిపించాడు. వెంగ్ అక్కడికి రాగానే ఆ నూతనవ్యక్తి "వెంగ్, నీకు నా హృదయపూర్వక అభి

## రావిళ్ల కృష్ణారావు

వందనములు. నీ మేలు యీ జన్మన మరువలేను. నీచే రక్షింపబడిలో పిచ్చుకనే నేను. నా పేరు మామ్యూ, యీ గ్రద్ద పక్షి రూపం ధరించిన ఒక మాంత్రిక శిఖామణి—జన్మ ధరించినపుడు మాత్రం యితని మంత్రాలు పని చెయ్యవనే శాపము వుంది. యిలాంటి సమయాల్లో తప్పితే యితణ్ణి ఎవరూ ఎపుడూ చంపలేరు. నన్ను తన దేవికి బలిగావించాలని పట్టుకో ప్రయత్నించాడు. మొలకువగానా కొచ్చిన పరకాయ ప్రవేశ విద్యతో ఆ చిలుకలో జొరబడ్డాను. అయితే మాంత్రికుడు గద్దరూపం ధరించి నన్ను వెన్నంటాడు. నీవు అనాయాచితంగా నన్ను రక్షించావు. నా శక్తికొలది నిన్ను సత్కరిస్తాను. యిదిగో, యీ మణి తీసుకో. యిది చూచుటకు మాత్రం మామూలు రాయినలె వున్నది. కానీ యీ మణి మహత్తు మున్ముందు నీకే తెలుస్తుంది. నీకెప్పుడు నా సహాయం కావలసి వచ్చినా యీ రాయిపైనున్న బొడిపెను మాటు. నేను నీ సమక్షానికొచ్చి కావలసిన సహాయం చేసిపెడతాను" అని అంతర్ధానమైపోయాడు. వెంగ్ ఆనందంతో ఆ మణిని భద్రపరచుకుని యింటికి వెళ్ళిపోయాడు. ఇట్లుండగా ఒకసారి కొండజాతులవారు, బందిపోటు దొంగలు చైనా దేశమంతటా వ్యాపించి కొల్లగొట్ట నారంభించారు. ప్రభుత్వానికి చిక్కక గెరిల్లాయుద్ధాలు చేస్తూ దేశంలో నలుమూలలాచొచ్చి ప్రజల ననేక విధాల బాధించి లూటీలు చేయసాగారు. ప్రభుత్వం వీళ్ళ నరికట్టలేకపోయింది.

సోదర దేశీయులు యిట్లా యిడుములబడటం వెంగ్ ఎంత మాత్రమూ సహించలేకపోయాడు. దేశాన్ని యీ విపత్తు—ఉపద్రవం నుండి కాపాడుటకు తనకు మణిని ప్రసాదించిన పెద్దమనిషి ఏమైనా తోడ్పడగలడేమోనని యోచించి మణి బొడిపెను నొక్కాడు. తక్షణం మామ్యూ ప్రత్యక్షమయ్యాడు. పిలిచిన కారణమరసినాడు. "దేశంలో విద్రోహులు దొంగలు బాగా ప్రబలిపోయాడు. ప్రభుత్వం వీరి నదుపులో పెట్టలేకపోతోంది. యీ దుండగుల వారద్రోలుటలో మీరేమైనా సాయపడగలరా?" అని అడిగాడు వెంగ్.

మామ్యూ తన బాకా ఊదాడు. సుశిక్షితులు, దృఢశరీరులైన యువ

కులు సాయుధులై నిలబడ్డారు. ఆ సేనతో వెంగ్ దేశంలో నలుమూలలా పర్యటించి దుండగమూకను అణిచివేశాడు. దేశప్రజలకు శాంతి సౌఖ్యాల చేకూర్చటంలో ప్రముఖపాత్ర నిర్వహించాడు. పరిస్థితులు చక్కబడిన పిమ్మట ఎక్కడి సేన అక్కడే అదృశ్యమయ్యాయి. ప్రజలంతా వెంగ్‌ను వేనోళ్ళ కొనియాడారు.

కొన్నాళ్ల తర్వాత వెంగ్ మణిని మరొకసారి మీటాడు. మొదట సూక్ష్మ రూపంలోనూ తర్వాత పెద్దగానూ ప్రత్యక్షమయ్యాడు చూమ్యూ. "నాకు యీ మణి అంతర్భాగంలోకి వెళ్ళి దానిలోని వింతలూ విశేషాలు చూచి దీని మహత్తు తెలుసుకోవాలని వుంది. కాదనక నా యీ కోర్కెను నెరవేర్చండి" అన్నాడు వెంగ్. చూమ్యూ కాస్సేపాలోచించి సమ్మతించాడు.

మరుక్షణంలో వెంగ్ చాలా చిన్నగా మారిపోయాడు. అలా అలా అతి సూక్ష్మరూపంతో, చూమ్యూ ప్రభావంవలన, చిన్న రంధ్రంగుండా దానిలో దూరిపోయాడు. దానిలో చూమ్యూ అతని కెన్నో అద్భుతాలు చూపించాడు. అనలావట్టణమే వెంగ్‌ను చకితుణ్ణి చేసింది. ఇళ్లు, నేల, ప్రతి వస్తువు అంతా బంగారుమయం. ఇక చూమ్యూ చూపించిన అద్భుతాలు అద్భుతాలే. అంతా చూచాక తిరిగి వెళ్ళిపోతానన్నాడు వెంగ్. వెంగ్ కచ్చటి బంగారం తెచ్చుకోవాలనుంది. కానీ ధైర్యంగా చూమ్యూ నడగలేక వూరుకున్నాడు. చూమ్యూ, వెంగ్ మనసులోనిఉద్దేశం గ్రహించి అతణ్ణి మోయగలిగినంత బంగారం తీసుకుపోవలసిందిగా చెప్పాడు. సంతోషంతో తేగలిగినంత బంగారం తీసుకుని వెంగ్ మణిగుండా బయటికొచ్చేశాడు. అంత చిన్న ఊాయిలో నుండిఎలా రాగలిగానా అని అతని కాశ్చర్యం వేసింది. దాని ప్రభావమే అంతనుకుని సమాధానపడ్డాడు చివరకు.

ఆ బంగారాన్ని విక్రయించగా వెంగ్ కోటీశ్వరుడైపోయాడు. అతడు తన వుద్యోగానికి రాజీనామా నిచ్చేశాడు. హాయిగా సుఖజీవితం గడపసాగాడు. వెంగ్ కకస్మాత్తుగా యింతసిరి రావటం గురించి అంతటా కట్టుకథలు మొదలైనాయి. ఆ కథలు చిలవలకు పలవలై చివర కతడు ప్రభుత్వద్రోహి అని మహారాజుదాకా ప్రాకిపోయింది. వెంటనే రాజు దేశద్రోహ నేరం క్రింద అతణ్ణి అరెస్టు చేసి తీసుకురావలసిందిగా ఆజ్ఞాపించాడు. వెంగ్ బంధింపబడినాడు.

వెంగ్‌ను చీకటికొట్లో పడేశారు. మర్నాడు విచారణ-శిక్ష. అర్థరాత్రి బొట్లోని మణిని తీసి బొడిపెను మీటినాడు. చూమ్యూ అవతరించాడు. వెంగ్ విషయమంతా వివరించాడు. చూమ్యూ ఎంతమాత్రమూ చింతవలదనిచెప్పి 'యిదీ ఒకందుకు మేలే' నని మాయమై పోయాడు.

చూమ్యూ అంతఃపురంలో ప్రవేశించా డదృశ్యరూపంతో. "మహారాజు మేనుమరచి నిద్రిస్తున్నాడు. వీపుతట్టినిద్ర లేపాడు. లేచికూర్చున్న రాజుముక్కు ఒక్కసారి లాగాడు. వెంటనే మహారాజు కోతిగా మారిపోయాడు. "రాజా! వెంగ్ నిర్దోషి. అతడు స్వచ్ఛంద దేశభక్తుడు. అతణ్ణి అనవసరంగా అనుమానించి, నావల్ల సిరి కలిగిందనుమాట తెలీక అతణ్ణి శిక్షించ నమకట్టారు. యిది ఎంతమాత్రం తగదు. దేశంలోదుండగుల ఉపద్రవాన్ని మీమహామహా సేనానాయకులు అణచగలిగారా? ఆపని చేసింది వెంగ్. అలాంటి వెంగ్ నీవిధంగానా నీవు గౌరవించేది. సరే. నీవు ఆ జన్మాంతమూ యిలాగే వుండిపో" అన్నాడు. మహారాజు చూమ్యూ కాళ్లా వేళ్లాపడి బ్రతిమాలాడు. యీ ఒక్కసారి తన తప్పు కాయమని పరిపరివిధాల ప్రాధేయపడ్డాడు. "సరే. ఇకనుంచీ వెంగ్‌కు దూరం కాబోకు. అలాంటి చర్య ఏదైనా జరిగినా వెంటనే పికంగా మారినావన్నమాటే"నని గట్టిగా హెచ్చరించి మాయమైపోయాడు.

మర్నాడు అంతా సభాస్థలికి వేంచేశారు. వెంగ్ మంచిస్థితిలో నుండటం చూడలేని వారంతా అతని కేమిశిక్షపడునోయని ఆతురతతో చూచుచుండిరి. మహారాజు వెంగ్‌ను తీసుకు రావలసిందిగా ఉత్తర్వు చేశాడు. వెంగ్‌ను తీసుక రాగానే మహారాజు చరచరా అతణ్ణిసమీపించిగాఢంగాకౌగలించుకుని 'తన పొరపాటును మన్నించమన్నాడు. "మహాజనులారా! వెంగ్ అనాయాచితంగా మహోపద్రవంలో చిక్కుకున్న సమయాన దేశాన్ని కాపాడినందుకు గాను,

# ఉద్యోగం....వివాహం

(40-వ పేజీ తరువాయి)

అలాగే పాఠశాలలూ విశ్వవిద్యాలయాలూ—ఏదో ఎవరియిష్టమొచ్చిన చదువు, అక్కరలేని చదువు, జీవితానికి ప్రయోజనంలేని చదువు చెప్పి, అచ్చువిడిచి వదిలిన గొడ్డు రీతిగా వదిలి స్త్రీ తోవ నువ్వే చూసుకో అంటే లాభంలేదు. ఆ విజ్ఞానం ఎంతవరకూ అంటే—'గోడకి నిలువునా వ్రేలాడగట్టబడి వున్న ఆఫ్రికా మేపును చూపుతూ—"నైలు నది ఆఫ్రికా మధ్యలోనున్న విక్టోరియా సరస్సులో పుట్టి ఆఫ్రికా శిరస్సు మీద నున్న యీజిప్టు దేశముగుండా ప్రవహించి అచ్చట సముద్రంలో కలుస్తూంది" అని గురువుగారు చెబితే—ఒక కుర్రవాడు ఠక్కుమని లేచి—"ఏమండీ మేష్టారూ! నీరు ఎల్లప్పుడూ మీదనుండి క్రిందకు ప్రవహించును గదా? మరి యీ నైలునది మధ్యలో వున్న విక్టోరియాలో పుట్టి నెత్తి మీద నున్న సముద్రంలో ఎలా కలుస్తున్నాదండీ? క్రింద నుండి మీదకి నీరు ప్రవహించగలదా?" అని అడిగేడట.

అప్పుడా గురువుగారు ఏమనాలో తెలియక, వాడిని పిలిచి మేపుని నేలమీద పరచి భూమి యిలా వుందిగాని గోడకి వ్రేలాడి లేదురా! యిప్పుడు చెప్పు! అని అనవలసి వచ్చిందిట!

అందుచేత తల్లిదండ్రులయినా, పెద్దలయినా, ప్రభుత్వమయినా ఏ ఆశయంతో చదువుతాడో ఆ ఆశయం తీర్చడానికి, అది జీవితానికి ఉపకరించడానికి ప్రయత్నించాలి. తగినంత పాత్రని నిర్ణయించుకోనకండా ఎక్కువ బియ్యం ఉడకేస్తే—పొంగి పైకిపడక ఏమౌతాయి? పడిన వాటిని పనికిరావని ఎత్తి అవతల పారబోయడమంత తెలివి తక్కువతనం వేరే వుందా?

జంతువుల్లో—కోయిలగ్రుడ్లని కాకి—బాతు గ్రుడ్లని కోడి పొదుగుతూ పిల్లలని చేస్తూ వున్నాయి. తెలిసో తెలియకనో, ఏదో విధంగా మరొక జాతివాటినయినా ఆదరించి వాటివిధి అవి నిర్వర్తిస్తూ వున్నాయిగాని మనుష్యుల్లో మెదడు పనిచేసే స్వజాతి మీద, స్వంత మనుష్యుల మీద విభేదం, అసహనం, యీర్ష్య, అవమానం, కలుగ జేస్తూంది విశేషించి తల్లిదండ్రులే తమ పిల్లలని న్యూనత పరచడం చాలా వింత.

కాలమాన పరిస్థితులవల్ల దురదృష్టంవల్ల ఉద్యోగం దొరక్క కుమిలిపోతున్న అబ్బాయిలని, సతతం, మనసును నొప్పించి విరక్తి కలిగించే అవమానపు మాటలు, యింట్లో తల్లి దండ్రులూ, పైన లోకం, చూపించే అనాదరం. చాలా అన్యాయం.

అలాగే ఆడపిల్లలు పెద్దవాళ్ళయినా పెళ్ళి అయినంతవరకూ పుట్టింటో వుండడం కొంచం ఆలస్యం అయితే అందరికీ బరువయి పోతున్నారు. యింట్లో తల్లీ తండ్రే నూటి పోటీ మాటలాడుతూ వుంటారు. గాని—ఆ పిల్లగాని, ఆ అబ్బాయిగాని ఆ సమయం వచ్చేవరకూ తల్లిదండ్రుల యింటో ఎందుకు గౌరవంగా వుండకూడదు? ఎందుకు పరాయి వాళ్ళలాగ చూడబడాలి? యిలాగని గట్టిగా అంటే—"ఏ తల్లిదండ్రీ అలా చూస్తున్నారు పిల్లల మీద ప్రేమ నీకేం తెలుసు? కనున్నాక అపాటి అంటే పడకూడదా! అలా అన్నందువల్ల మాకు అభిమానం లేదా? అలాగైనా భయం చెప్పకపోతే చేసే ప్రయత్నాలు కూడా చేస్తారా?" అని అంటూ లేమోగాని, ఆ మాటలు వారి మృదువయిన హృదయాలకి నాటి, చెరపరాని చెక్కడాలుగా మారి, ఒక అధైర్యం, ఒక భయం ఒక చేతగానితనం, ఒక విరక్తిని పెంపొందించి ఎన్నో అవినీతి పనులకి, దొంగ ధైర్యానికి, ఆత్మహత్యలకి కూడా దారి తీస్తూ వుంటాయి.

అందువల్లనే ఎంతో మంది వయసొచ్చి దురదృష్టం వలన పెళ్ళిళ్లు కాక, యింట్లో వుండిపోయిన ఆడవాళ్ళూ, చదువుకొని పని చేయగలిగే జ్ఞానం శక్తివుండి కూడా, అవకాశాలు లేక, పోమగిపోతుల్లా పైకి కనబడుతూ, వుండిపోయిన మగవాళ్ళూ లోకం బాధ, యింట్లో తల్లిదండ్రుల సహించతరంగాని పోరున, పడలేక ఎక్కడా ఆదరం అధరవూ లేక బాధ పడుతూ ఏడుస్తున్నారు! ఎంతో మంది నూతుల్లోనో, చెరువుల్లోనో పడి చస్తున్నారు. ఎంతోమంది లేచి పారిపోతున్నారు. ఎంతోమంది విషాలు తిని ప్రాణం వదులుతున్నారు. ఎంతోమంది రైల్లే క్రింద బుర్రలు పెట్టి హీనంగా చస్తున్నారు.

మనఆత్మలో ఆత్మ, మనశరీరంలో శరీరం, మనఅంశలో అంశ, మనలోమనం—మనలో సగం—అయిన పిల్లల బాగు ఎవరు కోరుతున్నారు అన్న అనుమానం కలుగుతూంది. మన శరీరంలో ఒక భాగానికి ఆపద కలిగితే మనకంతకీ బాధే—అలాగే మన అంశ అయిన పిల్లలకి ముప్పవస్తే అది మనకి కాదా?

చిన్నతనం నుండి ముద్దుగా పెరిగి, ఎన్నో ఆశయాలతోనీ, ఎంతో ఆనందంతోనీ, అందంతోనీ పెరిగిన అమ్మాయిలని, పెద్దవాళ్ళయితే, వారిని ఎన్నాళ్ళుంచుకుంటాం అంటూ ఆ సమయానికి ఎవడు కనబడితే వాడికి అంటగట్టి మా బాధ్యత తీరింది అని సంతోషించడం, ఆ వ్యక్తి ఎలాంటివాడో, వంశం, గుణం, గౌరవం, ఆరోగ్యం, చదువూ వున్నవాడో కాడో ఆలోచించకుండా 'మగవాడు' అన్నవాడికి యిచ్చి పెళ్ళిచేసి ఆ తర్వాత తమ కన్నకడుపు యొక్క జీవితాన్ని ఆలోచించకుండా 'మా పిల్లకి పెళ్ళి చేసేశాం' అని చెప్పుకుంటూ తిరగడం, చదువుకొని ఆ చదువుకి తగ్గ ఉద్యోగము సాధించి గౌరవంగా బ్రతకచూచే అబ్బాయిలని కొద్దిగా ఆలస్యం అయితే

---

అతని దేశభక్తికీ, రాజభక్తికీ మెచ్చి అతణ్ణి మా సర్వసైన్యాధిపతిగా చేస్తున్నాము." అన్నాడు.

యీ చర్యకు కినిసిన వారికంటె సంతసించినవారే ఎక్కువమంది. తర్వాత సర్వసైన్యాధిపతిగా దేశాని కమూల్యమైన సేవజేశాడు వంగ్. అతడు ఎప్పుడూ తనకంతటి ఉజ్వల భవిష్యత్తును ప్రసాదించిన చూమ్యాను, మణిని మరచిపోలేదు—అతని మరణానంతరం ఆ మణి కూడ మాయమైపోయింది. అంతే.

# ఉద్యోగం ... వివాహం

"ముష్టి అయినా ఎత్తి డబ్బుతే" అని శాసించడం అన్యాయం కాదా!

కేవలం యిందులో తల్లిదండ్రులదే పొరపాటనలేదు. పరిస్థితులవల్ల పెళ్ళిళ్ళు చెయ్యలేక పోవచ్చు. ఎన్నో యిబ్బందులు వుండవచ్చు, చికాకు, నిరాశ, విసుగు, వీటివల్ల మనశ్శాంతి నశించి, పిల్లలమీద కోపం రావచ్చును. కాని అది వారి తప్పు ఎలాగయితే కాదో అలాగే ఆ వుద్యోగం దొరక్కపోవడంగాని, ఆ పెళ్లి కాకపోవడంగాని, ఆ పిల్లల తప్పుగాదని గ్రహించాలి.

పెళ్లి కాకుండా వుండిపోయిన అమ్మాయిలు, ఉద్యోగం కాకుండా వుండిపోయిన అబ్బాయిలు యింట్లో వున్నట్టయితే వారిని ఎత్తిపొడవకూడదు. నిందించకూడదు. చికాకు కలిగించకూడదు, వారి సమక్షంలో గాని, పరోక్షంలో గాని ఏమీ అనకూడదు. అలా అనడమే వారి పొరపాటు. వారిమీద—"మనపిల్లలు" అన్న అభిమానముంటే—పెళ్ళిళ్ళు కాకపోయినా, ఉద్యోగాలు దొరక్కపోయినా ఆ అదృష్టం కలిసివచ్చేవరకూ చికాకు కలుగకుండా పోషించాలి. లేదా—మీకూ మాకూ సంబంధం లేదని తగిలేసి వాళ్లవూసు ఎత్తకుండా వుండాలి.

కాబట్టి చదువుకుని ఆ చదువుని వినియోగపరచి జీవించే శక్తి వున్నా దొరకడం లేక ఒకళ్ళమీదే ఆధారపడి వుండిపోయిన అబ్బాయిలని, యుక్తవయస్సు వచ్చి, ఆనందం కలిగించే అందం వుండి, కాపురంచేసే ఈడు వుండి, పెళ్ళికాక విధిలేక వుండిపోయిన అమ్మాయిలని వారి తల్లిదండ్రులు గాని, లోకంలో పైవాళ్ళుగాని ఏ కారణం చేతనయినా కించపరుస్తూ ఎత్తిపొడుస్తూ వారి మనస్సులు నొప్పించారంటే, ఆ పెద్దలకి జ్ఞానం లేదన్నమాటే. ఆ తర్వాత ఏది ఎటు వచ్చి, ఆ నిర్భాగ్యులే ఓ అఘాయిత్యానికి ఒడిగట్టుకున్నా జీవితాంతం దుఃఖించడం తెలివి తక్కువతనం.

ఇది యిలా వుండగా—ఉద్యోగాలలో ఖాళీలు వుంటూనే వున్నాయి. ఉద్యోగాల కోసం ఖాళీగా వుంటూనే వున్నారు. పెళ్లి కాని యువకులు వుంటూనే వున్నారు. వివాహానికి కాసుక్కూర్చున్న యువతులు వుంటూనే వున్నారు. అన్నీ వున్నాయి—అయినదో తనమే లేనట్టుంది. యువకులకి వుద్యోగాలు ఎందుకొక్కలేదో యువతులకి వివాహాలెందుకొక్కలేదో అందరికి తెలుసు. అయినా వారిని నానామాటలూ ఆడుతూండడం ఆశ్చర్యం. వీటికి కారణాలు తెలుసుకోకపోవడమే అన్నిటికి కారణం. ★




# క్షత్రియ మహిళ

[24 వ పేజీ తరువాయి]

ఇచ్చింది. అయినా చందనసింహుని కనుమానం తీరలేదు:

"తనదగ్గర ఈ వివాహం మాటే తలపెట్టవద్దని అది అనేకమారులు కసిరికొట్టింది. తీరా తొందరపడి మాట ఇస్తే..."

"మీ కొంపయేమీ అక్కరలేదు! మొట్టమొదటినించి దాని కీసంబంధం ఇష్టమే! అయితే మీ అభిజాత్యానికీ, తన అభిమానానికీ కట్టుబడి అలాగ కసరికొట్టింది అంతే!"

"అది నీతో ఎప్పుడైనా ఆమాట చెప్పిందా!"

చందనసింహుని భార్య ఆమాట విని విరగబడి నవ్వింది:

"అయ్యో! అది నోరువిడిచి మనతో చెబుతుందిటండీ! దాని మనస్సుమాత్రం నాకు తెలియదా?"

"అయితే నాతో ఆమాట మొదటే ఎందుకు చెప్పావుకావు?"

"చెప్పినవన్నీ చెల్లించారు గనకనా? ఇక ఇది కూడా చెప్పడానికి! లేవండి రాణా వారప్పుడే వస్తున్నట్టున్నారు!"

ఆ పూట హీరా హారసింహుల వివాహం యథావిధిగా స్థిరపడింది.

ఆ సాయంత్రం హీర విసిరిన వడిసెల రాయి చిత్తూరుకోట గోపురంపై ప్రతిష్ఠించిన సువర్ణకలశానికి తగిలింది. అది అరగడియపాటు ఘంగని మారుమోగింది! ★

# ధనగుప్తుని యుక్తి

(44-వ పేజీ తరువాయి)

అతను మెల్లగా లేచి "ఇక్కడే వుండు! నేను బయటకు వెళ్లివస్తాను. నేను తిరిగి వచ్చి యే సంగతీ చెబుతాను! నేను వచ్చేవరకు యెక్కడకూ వెళ్లకుండా, యిక్కడే వుంటావుకదూ!" అన్నాడు.

"సరే! వెళ్లిరా! నీవు వచ్చేవరకు యిక్కడే వుంటాను. త్వరగా వెళ్ళి వెంటనే వచ్చేయ్!" అన్నది లక్ష్మీదేవి.

ధనగుప్తుడు లేచి మెల్లగా బయటకు వచ్చాడు. అలా తిన్నగా వెళ్ళి ఊరి చివరనున్న పాడుబడిన బావిలోనికి దూకి ప్రాణత్యాగం చేసుకున్నాడు.

ఆనాటినుంచి ధనగుప్తుడి నలుగురు కుమారులకు ఐశ్వర్యం హెచ్చలయింది. వారు పట్టినదల్లా బంగారమే అయింది. వారివ్యాపారం దినదినాభివృద్ధిచెంది, పూర్వపు ఔన్నత్యాన్ని సంపాదించారు. తండ్రి యేమయ్యాడో, వారికి తెలియకపోయినా, లక్ష్మి మళ్లా వారిని కటాక్షించినందుకు, ఎంతో పొంగిపోయ్యారు.

ఇంకెప్పుడూ ధనగుప్తుడు తిరిగి రానూలేదు. లక్ష్మీదేవి ధనగుప్తుడి యింటిలోనుంచి బయటకు వెళ్లనూ లేదు! ధనగుప్తుడు వచ్చేవరకు ఉంటానని లక్ష్మీదేవి మాట యిచ్చినందువల్ల అక్కడే స్థిరనివాసం యేర్పాటు చేసుకోవలసివచ్చింది!

కోమటివారి మూలపురుషుడైన ధనగుప్తుడి యింట లక్ష్మి అలా స్థిరనివాసం యేర్పరచుకున్నందువల్లనే యీనాటికీ, కోమటివారు లక్ష్మీపుత్రులై వర్తకమే ప్రధానవృత్తిగా చేసుకొని, భోగభాగ్యాలతో తులతూగుతున్నారు. ★

# సినిమా

వానవెడద లేని ఈ రోజులు చలనచిత్ర కారులపాలిట వరప్రసాదాలు. ఎండ మండినందువల్ల చికాకుగానే ఉన్నా, వర్షాలు ముంచుకొచ్చేలోగా ఔట్‌డోర్ దృశ్యాలు చకచక చిత్రించి పనులు ముగించుకుంటారు. సినిమాపరిభాషలో దీన్ని లొకేషన్ షూటింగ్ సీజన్ అంటారు. పనిలో పనిగా, పనితోపాటు కాస్త విశ్రాంతి కూడా ఏర్పాట్లు చేసుకుని చూడతగ్గ ప్రదేశాలు చూడదలచుకున్నవారంతా, హిమాలయ సానువులవంటి ప్రాంతాలకు ప్రయాణమై వెళ్లారు. దిలీప్‌కుమార్, బిమల్ రాయ్ అలాగే మొన్న హిమాలయాల లోయలకు బయలుదేరి వెళ్లారు. బిమల్‌రాయ్ కొత్త చిత్రం "మధుమతి"కి కావలసిన ఔట్ డోర్ దృశ్యాలను అక్కడ చిత్రిస్తారట. వీళ్ళు సిమ్లా, హృషీకేశ్, హరిద్వార్, రాణిఖేత్, మొదలైనచోట్లన్నీ పర్యటిస్తున్నారు. ఈ బృందంలో వైజయంతిమాల, ప్రాణ్

## బొంబాయి సినిమా లేఖ

[ఆంధ్రవారపత్రిక ప్రతినిధి]

కూడా ఉన్నారు. వైజయంతి ఈ చిత్రంలో మూడుభూమికలు నిర్వహిస్తోంది. అందులో రెండు వర్తకి వేషాలే.

* * *

"చలో ఢిల్లీ" అన్నాడు దేవానంద్ ఒక రోజు ప్రొద్దుటే. రైట్ అన్నాడు అతని తమ్ముడు విజయ్‌ఆనంద్. దేవానంద్, అతని భార్య కల్పన, శశికళ, ఇతర టెక్నిషియన్‌లూ బొంబాయినుండి ఢిల్లీ వరకూ వెయ్యి మైళ్ళదూరం రహదారియాత్ర చేసి వచ్చారు. దారిలో ఊరికే కూర్చోక తమ చిత్రానికి కావలసిన ఔట్‌డోర్ దృశ్యాలన్నీ "షూట్" చేశారు. దేవానంద్ నిర్మిస్తున్న ఆ చిత్రం పేరు "నౌ దో గ్యారా." దర్శకుడు విజయ్ ఆనంద్.

ఈ మూడురోజుల కృషిఫలితం నాలుగు పాటల చిత్రణ. శచిన్ దేవ్ బర్మన్ సంగీతం కూర్చాడు. అట్నించి వస్తూనే మహాబలేశ్వర్ (బొంబాయికి సమీపాన ఉన్న విశ్రాంతి కేంద్రం) వెళ్ళి మరికొన్ని దృశ్యాలను చిత్రించారు

అభిజ్ఞుల అభిప్రాయాలప్రకారం, బర్మన్ కట్టిన ఈ నాలుగు పాటలలోను, హీనపక్షం రెండేనా 'హిట్'లు కావడం ఖరారు.

* * *

ఎం. వి. రామన్ కొత్తచిత్రం 'ఆశా'లో కొన్ని నృత్యాలకు కావలసిన దృశ్యాలకోసం రామన్‌బృందం కిశోర్‌కుమార్, వైజయంతిమాల పూనా వెళ్లివచ్చారు. అక్కడ ఆగాఖాన్ ప్రాసాదంలో కొన్ని సన్నివేశాలు చిత్రించారు. దీనికి సి. రామచంద్ర సంగీత దర్శకుడు.

* * *

రాయ్ ప్రభుత్వాధ్వర్యాన బొంబాయిలో తయారవుతున్న "అంగుళి మాల" చిత్రం బృందంకూడా దాదాపు రోజూ బొంబాయికి 40 మైళ్ళ దూరాన ఉన్న ప్రాంతానికి వెళ్తున్నారు. గేవాకలర్‌లో నిర్మిస్తున్న ఈ చిత్రంలో భరత్ భూషణ్, నిమ్మి ముఖ్యభూమికలు నిర్వహిస్తున్నారు. స్వచ్ఛమైన ఉర్దూ ధారాళంగా మాట్లాడగలడని పేరు తెచ్చుకున్న ఆంధ్రనటుడు చంద్రశేఖర్ ఇందులో ప్రముఖ భూమిక నిర్వహిస్తున్నాడు. దర్శకుడు విజయ్‌భట్. సంగీతం అనిల్ బిశ్వాస్ సమకూర్చుతున్నారు.

* * *

వి. ఎస్. జోహార్ గేవాకలర్‌లో ఒక చిత్రం నిర్మిస్తున్నాడు: "కిత్నా బదల్



నేషనల్ ఆర్ట్ థియేటర్స్‌వారి "పాండురంగ మాహాత్మ్యం"లో అంజలీ దేవి.

## ★ పాకిస్తాన్ చిత్రం 'ఇన్‌తెజార్' ★

పాకిస్తాన్‌నుండి వచ్చిన కొత్త చిత్రం "ఇన్ తెజార్" గతవారం బొంబాయిలో విడుదలఅయింది. (జెమినీఫిలిం సర్క్యూట్ వారు దీన్ని ఇక్కడ విడుదలచేశారు.) ఈ చిత్రంలో నటీనటులూ, టెక్నీషియన్‌లూ అంతా అక్కడివారే. ఇది పూర్తిగా వారి కృషి ఫలితం. ఈ చిత్రం వివిధంగానూ అఖండమైన కళాఖండం కాకపోయినా, పై రెండు కారణాలవల్లా ప్రస్తావనకు వచ్చింది.

చలనచిత్రకళను దృష్టిలో ఉంచుకుని పరిశీలిస్తే, పదేళ్లక్రితం మన చిత్రాలు ఎక్కడ ఉన్నాయో గుర్తుకు తెచ్చుకుని, ఇదీ అదే స్థాయిలో ఉందని చెప్పుకోవాలి.

నిర్మాత ఖుర్షీద్ అన్వర్ కూర్చిన సంగీతం మాధుర్యానికి పర్యాయపదం అనడానికి లవలేశం అవకాశం లేదు గాని, నూర్జహాన్ వాటిని పాడినందువల్ల అవి ఇంపుగా, మనోహరంగా ఉన్నాయి.

నాయకుడుగా సంతోష్‌కుమార్ నటన మరీ 'నేలబారుగా' ఉంది. నాయకి నూర్జహాన్ పెహాల్వాన్‌లా ఉంది. ఆమె నటన కూడా మూసపోసిన పాతగాడిలోనే నడచింది. నూర్జహాన్ చెల్లెలుగా నటించిన "ఆషా" వేషభాషలూ, తీరుతెన్నులూకూడా చవకబారుగా ఉన్నాయి. దర్శకత్వం, రచన, నృత్యాలూకూడా అదేవిధంగా ఉన్నాయి. ఛాయా శబ్దగ్రహణాలగురించిన చర్చ ఇక అనవసరం. చలనచిత్ర శిల్పంలో అనల్పప్రజ్ఞ ఉన్నట్లు పాకిస్తాన్ అనటంలేదు కాబట్టి ఆ విషయం వదలివేయవచ్చు. పాకిస్తాన్ ఇదివరకు మనదేశం పంపిన చిత్రాలు ఏవీ బాగు లేవు. ఆ శ్రేణిలో "ఇన్ తెజార్" పెద్ద సైజు మణి.

(ఆంధ్ర వారపత్రిక బొంబాయి విలేఖరి) ★



"తెనాలి రామకృష్ణ" చిత్రానికి రాష్ట్రపతి బహూకరించిన రజత పతకం.

## బొంబాయి సినిమాలేఖ

గయా ఇన్‌సాన్." ఇందులో నాలుగింట మూడుపాళ్ళు నేలందగ్గర ఉన్న ఒక కొండ మీద చిత్రిస్తున్నారు. అందుకై ఆ కొండపై పలభైఇళ్ళు ఉన్న చిన్నపల్లెను జోహార్ నిర్మింప చేశాడు. ఇప్పటికి నిర్మాణం సగం వరకూ పూర్తి అయింది. నళినీ జయవంత్, అజిత్‌లు నటిస్తున్న ఈ చిత్రానికి నిర్మాత జోహారే దర్శకత్వం నిర్వహిస్తున్నాడు. సంగీత దర్శకుడు హేమంత కుమార్.

* * *

"ఇల సాటిలేని వెండితెర జంట" అనిపించుకున్న నర్గిస్, రాజ్ కపూర్‌లు అనేక చిత్రాలలో విడివిడిగా నటిస్తున్నారు. ఆర్. కె. ఫిలింస్ వరకే తన కాంట్రాక్ట్‌లు పరిమితంచేసుకుంటున్నట్లు ఒకప్పుడు చెప్పిన నర్గిస్ దరిమిలా మెహబూబ్ గేవాకలర్ చిత్రం "మదర్ ఇండియా"లోనూ, ఇటీవల "ఖాలీ బోటాల్" వంటి మరి కొన్ని చిత్రాలలోనూ నటించడానికి అంగీకరించింది. రాజ్ కపూర్ కూడా ఇప్పుడు ఇతరుల చిత్రాలలో (సి. ఎం. త్రివేదీ తీస్తున్న "రిపోర్టర్", ఎల్. వి. ప్రసాద్ నిర్మిస్తున్న "శారద" చిత్రాలు) నటిస్తున్నాడు...★



1956 లో ఉత్తమచిత్రాలకు ఇటీవల ఢిల్లీలో బహుమతిప్రధానం జరిగింది. "తెనాలి రామకృష్ణ" చిత్రానికి రాష్ట్రపతి నుండి ప్రశంసాపత్రం అందుకొంటున్న నటుడు శ్రీ అక్కినేని నాగేశ్వరరావు, ఆయన ప్రక్కనున్నవారు ఆ చిత్రం నిర్మాత శ్రీ బి. ఎస్. రంగా.

# సినిమా వార్తలు

నేషనల్ ఆర్ట్ ("జయసింహ") థియేటర్స్ వారి పౌరాణికం "పాండురంగ మహాత్మ్యం", అంజలి, రామారావు, నాగయ్య, శివరావు, బాలకృష్ణ, పద్మనాభం, కె. వి. ఎస్. శర్మ, సరోజ, అమ్మాజీ, ఛాయాదేవి, ఋష్యేంద్రమణి ప్రభృతి నటవర్గంతో కమలాకర కామేశ్వరరావు దర్శకత్వాన చురుకుగా తయారవుతోంది. సముద్రాల జూనియర్ మాటలూ పాటలూ వ్రాస్తున్నారు. సంగీత దర్శకుడు టి. వి. రాజు. నృత్యాలు వెంపటి సత్యం. కళ తోట వెంకటేశ్వరరావు. ఛాయాగ్రహణం ఎం. ఎ. రెహమాన్.

## "అల్లూరి సీతారామరాజు"

"పాండురంగడి చిత్రం పూర్తి అయేలోగానే అల్లూరి సీతారామరాజు ముస్తాబై సెట్ మీదికి వెళ్తున్నాడు" అన్నారు ఎన్. టి. రామారావు ఈ చిత్రం వివరాలు చెబుతూ.

రెండు మాసాల్క్రితం ఒక ఉదయాన శ్రేయోభిలాషుల ఆశీర్వాదాలతో ఎన్. ఎ. టి. బృందం "అల్లూరి సీతారామరాజు" చిత్రానికి ఆరంభ గీతం రికార్డింగుతో వాహినీలో ప్రారంభోత్సవం జరుపడం విదితమే. ఇప్పుడు ఆ చిత్రం 'షూటింగ్' ఆరంభించడానికి సన్నాహాలు జరుగుతున్నాయి.

వచ్చే ఆగస్టు 15 న యావద్భారతమూ (అధికార రీత్యా) ప్రథమ స్వాతంత్ర్య సమర శత వార్షికోత్సవాలను భారీ ఎత్తున జరుపబోతోంది. ఆ రోజే దశమ స్వాతంత్ర్య వార్షికోత్సవం కూడా.

"ఆ పండుగ రోజునే మేమూ సీతారామరాజు చిత్ర నిర్మాణం ప్రారంభించ నిశ్చయించాము" అన్నాడు రామారావు.

ఈ చిత్రానికి పడాల రామారావు మాటలూ పాటలూ వ్రాస్తున్నారు. సంగీత దర్శకుడు టి. వి. రాజు.

మరి పాండురంగడి కథ?

"అది సెప్టెంబరులో విడుదల చేయాలని మా సంకల్పం" అన్నారు నిర్మాత త్రివిక్రమరావు.

## "సంకల్పం"

సాధనావారి "సంకల్పం" ఈ నెల 31 నే విడుదల అవుతోంది. ఇందులో కూడా రామారావే ముఖ్యభూమిక నిర్వహిస్తున్నాడు. కుసుమకుమారి అనే కొత్తనటి నాయిక. నర్తకి రాజసులోచన, సూర్యకాంతం, రేలంగి, రమణారెడ్డి, చదలవాడ కుటుంబరావు, ఆర్. నాగేశ్వరరావు, అల్లు రామలింగయ్య, రావులపల్లి సత్యం మొదలగువారంతా పాల్గొంటున్నారు. మాటలు పినిశెట్టి, పాటలు అనిసెట్టి వ్రాశారు. సుసర్ల దక్షిణామూర్తి సంగీతం సమకూర్చారు. నృత్యాలు గోపాలస్వామి. ఛాయాగ్రహణ దర్శకుడు ప్రసాద్. కళా దర్శకుడు టి. వి. శర్మ.

ఈ చిత్రానికి రంగనాథదాస్ దర్శకత్వం నిర్వహిస్తున్నారు. పర్యవేక్షణ ప్రసాద్.

## మే నెల చిత్రాలు

ఈ నెలలో రెండు చిత్రాలు విడుదల అయ్యాయి. ఒకటి అంజలివారి జానపదం "సువర్ణ సుందరి" (మే 10) ఇందులో అంజలి, నాగేశ్వరరావు, రేలంగి, సి. ఎస్. ఆర్, గుమ్మడి, రమణారెడ్డి, బాలకృష్ణ, రాజసులోచన, ఇ. వి. సరోజ, గిరిజ, సూర్యకళ మొదలగువారు పాల్గొన్నారు. రచన మల్లాది రామకృష్ణశాస్త్రి. సంగీతం, నిర్మాత ఆదినారాయణరావు సమకూర్చారు. నృత్యదర్శకుడు వెంపటి సత్యం. దర్శకత్వం వేదాంతం రాఘవయ్య.

* * *

మే 16 న మాడర్న్ థియేటర్స్ వారి "వీరకంకణం" విడుదల అయింది. రామారావు, రేలంగి, జగ్గయ్య, జమున, కృష్ణకుమారి పాల్గొన్నారు. రచన ఆరుద్ర, సంగీతం దక్షిణామూర్తి, దర్శకుడు జి. ఆర్. రావు,

## "జయభేరి"

శ్రీ శారదా ప్రొడక్షన్స్‌వారి చిత్రం "జయభేరి" పి. పుల్లయ్య దర్శకత్వాన రేవతీలో తయారవుతోంది. అంజలి, నాగేశ్వరరావు, రేలంగి, నాగయ్య, గుమ్మడి వెంకటేశ్వరరావు, చదలవాడ, రమణారెడ్డి నటిస్తున్నారు. మాటలు ఆత్రేయ, పాటలు మల్లాది రామకృష్ణశాస్త్రి, శ్రీశ్రీ వ్రాస్తున్నారు. సంగీతం పెండ్యాల. ఛాయాగ్రహణ దర్శకుడు పి. ఎల్. రాయ్. ఇప్పటికి మూడురీళ్లు పూర్తిఅయినట్లు దర్శకుడు తెలియచేశారు.

## "అక్కచెల్లెళ్లు"

యువదర్శకులు అమానుల్లా, పార్వతీమహల్ సంయుక్త సారథ్యాన కళ్యాణీ వారి సాంఘిక చిత్రం "అక్కచెల్లెళ్లు" వాహినీలో చురుకుగా తయారవుతోంది.

"జులై నెలాఖరుకల్లా నిర్మాణం పూర్తి అవుతుంది" అన్నారు అమానుల్లా.

"ఈలోగా నేను మాజిక్ విద్య నేర్చుకోవడమూ పూర్తిఅయిపోతుంది" అన్నాడు రమణారెడ్డి నవ్వుతూ.

రమణారెడ్డి ఇందులో డబ్బుగల పిచిక. మాజిక్ మీద పిచ్చిగలవాడు. కథలో బోలెడు

(55- వ పేజీ చూడండి)



ఎన్. ఎ. టి. వారి "పాండురంగ మాహాత్మ్యం"లో ఎన్. టి. రామారావు, బి. సరోజ.

## లోకమంతటా ఏకైకచైతన్యం దర్శించిన మహాద్రష్ట, కళాస్రష్ట.



వాన్‌గో "ఆత్మచిత్రం"

విన్సెంట్ కొంచెం జంకుతూనే, హాలులో కాలు పెట్టాడు.

అతన్ని చూడగానే, తల్లీకూతు ళ్లిద్దరూ హఠాత్తుగా మాటలు ఆపేసి తల వంచుకున్నారు.

"నేను మళ్లా రెండు వారాలలో తిరిగి వచ్చేస్తాను. అద్దె ఇదిగో" అన్నాడు విన్సెంట్.

"అక్కర్లేదు. గది కాళీచెసెయ్యాలి. ఇంకొకళ్లకి అద్దెకిస్తున్నాం." అన్నది తల్లి.

ఈ 'బహువచనం'లో భావం బోధపడక ఉర్సులావేపు చూచాడు విన్సెంట్.

రోజూ ఉదయమే తనని నిద్రలేపి, కిలకిల నవ్వి నవ్వించి, చిలకలా కబుర్లుచెప్పే ఉర్సులా ఈ క్షణాన మాట్లాడలేదు! శూన్యంగా చూచింది. ఆమె కళ్లుకూడా చెప్పడానికి ఇష్టపడని జవాబును ఆమెతల్లి భాషలోకి అనువదించింది.

"కాబోయే అల్లుడికి నువ్విక్కడుండడం ఇష్టంలేదు. ఇటుపై ఈ ఛాయల నీఛాయ పడకపోతే సంతోషిస్తాం." అన్నదామె.

విన్సెంట్ మనసు చివుక్కుమంది; ఉర్సులా తనను ప్రేమించలేదన్న నిజాన్ని నమ్మనంది.

ఏడాదినాడు అతను వాళ్లింట అద్దెకు దిగిన క్షణంనుండి ఉర్సులాను ఆరాధిస్తున్నాడు. రెండురోజులక్రితమే, సాహసించి, తన మనసుతలుపు తెరచి వలపు తలపును తెలియ చేశాడు.

"ఛీ! నిన్నా? పెళ్ళా!" అంది ఉర్సులా.

కట్లు తెంచుకున్న ఉద్రేకంతో విన్సెంట్ ఆమెను బలవంతాన ముద్దుపెట్టుకున్నాడు. అతని కౌగిలి విడిపించుకుని 'ఛీ' అంది ఉర్సులా. అని వెళ్లిపోయింది.

తన ప్రవర్తన ఆమెకు కోపంకాక, ఏవగింపు కూడా కలిగించిందని తెలిసినా, విన్సెంట్ ఆశ వదులుకోలేదు. స్వగ్రామం వెళ్ళి వారంకూడా ఉండకుండా లండన్ తిరిగి వచ్చాడు. ఎక్కడా ఉపాధి లేక లండన్‌కు కాలినడకన 24 గంటల దూరాన వున్న రామ్స్‌గేట్‌లో ఉపాధ్యాయుడుగా కుదురుకున్నాడు. అక్కడ జీతభత్యాలు లేవు—రెండుపూటలా తిండితప్ప. శనివారం ఉదయం బయలుదేరి ఆదివారం ఉదయానికి కాలినడకన లండను చేరి ఉర్సులా ఇంటి ఎదట చెట్టుక్రింద నిలబడి ఆమెను చూచి తిరిగి సోమవారం ఉదయానికి రామ్స్‌గేట్ చేరుకునేవాడు. ఎన్నటికయినా ఆమె మనసు మారదా అని కలలు కని, అవే తిని బతికాడు రెండు నెలలు.

ఒకరోజు ఉదయాన ఆ ఆశ కాస్తా హరించిపోయింది. ఆ రోజున ఉర్సులా ఇంటిముందు చాలా బగ్గీలున్నాయి.

ఏమిటి విశేషం అన్నాడు విన్సెంట్ ఒక బండివాణ్ని పలకరించి.

పెళ్లి కాబోలు అన్నాడు వాడు ఎటో చూస్తూ.

ఇంకో క్షణం తరవాత పెళ్ళికూతురు ఉర్సులా, భర్తతో కలసి గుమ్మందిగి ఒక బగ్గీ ఎక్కింది.

విన్సెంట్ తలవంచుకు వెళిపోయాడు.

*　　*　　*

భగ్నమైన ఈ తొలివలపుతో అతడి జీవిత దృక్పథం పెడమలుపు తిరిగింది. లోకం దుఃఖమయం అన్న భావం కలిగింది. దేవుడు జ్ఞాపకంవచ్చాడు. మతంమీద ఆసక్తి కలిగింది. తగిన అర్హత, శిక్షణ లేకపోయినా, ప్రయత్నించి, బెల్జియంలోని ఒక బొగ్గుగని పనివారి వాడలో క్రైస్తవమతాచార్యుడి ఉద్యోగం గడించి వెళ్ళాడు.

ఈశ్వరుడు, సత్యము, పాపము, పుణ్యము అంటూ అతను చెప్పిన సూక్తులపట్ల గనిపనివారు ఆట్టే ఆసక్తి చూపలేదు.

"అయ్యా, విహారంతా మమ్మల్ని ఉద్ధరించాలన్న సంకల్పంతో వస్తారు. ఊహా మంచిదేగాని, మా యిల్లూ వాడా, ఈ గనీ ఇక్కడి పనీ, దాని కష్టం మీ కేమెరుక" అన్నాడు ఒక పనివాడు. విన్సెంట్ మర్నాటినుండి ఉపన్యాసాలకు ఉద్వాసనచెప్పి, పనివారి కష్టాలలో పాలుపంచుకున్నాడు. మతగురువు లందరికిమల్లే చల్లగా తిని కూర్చుని, ఉపన్యాసాలు ఇస్తూ, భౌతికమైన కష్టసుఖాలకు అతీతుడైనట్టుగా నిర్వికారవదనం ప్రదర్శించి అభినయం సాగించడం అతనికి నచ్చలేదు. స్వతస్సిద్ధ



తనమీదా తనువుమీదా కినిసిన వాన్‌గో



వాన్‌గో చిత్రరచనా శిల్పం, అతని మిత్రుడు పాల్ గాగిన్‌కు నచ్చలేదు. నిత్యం తగవులాటే. వాన్‌గో భూమికలో కర్క్ డగ్లస్, గాగిన్‌గా ఆంతోనీ క్విన్.

మైన ఉద్రేకంతో ఒక్కసారిగా, మతాచార్యుడి సుతారమైన పద్ధతులకు స్వస్తి చెప్పి పనివారితో కలిసిపోయాడు. వాళ్ళతో ఏడ్చాడు. నవ్వాడు; తిన్నాడు. తిండికి లేనప్పుడు మాడాడు.

చర్చి అధిపతులకు ఇది గిట్టలేదు; మతాచార్యుడి పరువు మంటకలిపేస్తున్నావు అన్నారు. విన్సెంట్‌కు అది గిట్టలేదు. "మీ కృత్రిమత, కౌటిల్యం అంటే నాకు రోత" అన్నాడు.

*   *   *

16వ యేటనుండి విన్సెంట్‌కు చిత్రకళా వ్యాసంగంతో సంబంధం ఉంది. ఇంగ్లండ్, ఫ్రాన్స్, జర్మనీ దేశాలలో పెద్ద పెద్ద విక్రయశాలలు నెలకొల్పి నడుపుతున్న 'గోపిల్స్' కంపెనీలో చిత్రాలు విక్రయించే ఉద్యోగిగా ఆరేళ్ళు పనిచేశాడు.

బెల్జియంలో మతాచార్యుడుగా ఉన్నప్పుడు, స్వయంగా చిత్రాలు వేయడం ప్రారంభించాడు. అక్కడ పని మానివేసిన తరువాత బ్రసెల్స్ వెళ్ళి కొన్నాళ్ళు చిత్రకళ అభ్యసించాడు. కొన్నాళ్ళు హేగ్‌లో ఉండి, అన్నదమ్ముడి వరసవాడైన ఆంటన్ మావ్ దగ్గర నేర్చుకున్నాడు.

"అబ్బాయి! నువ్వింక రేఖాచిత్రాలు మానేసి రంగులు కొను" అన్నాడు మావ్ విన్సెంట్ బొమ్మలు చూచి.

తరువాత రెండేళ్ళు ఇంటిపట్టున ఉన్నాడు విన్సెంట్. ఆకుపచ్చ రంగు అప్పట్లో అతడి అభిమానవర్ణం. ఆ రంగు ప్రధానంగా, పొలాలలో పనివారినీ, చేమగ్గం దగ్గర నేత గాళ్లనీ చూచి చాలా చిత్రాలు వేశాడు.

"ఇందులో రైతు బొమ్మ ఎక్కడ పూర్తి అయిందో పొలం ఎక్కడ మొదలైందో తెలీలేదు" అని హేళనచేసేవారు అక్కడి వారు.

"సరిహద్దురేఖ ఎందుకుండాలి. పొలంలో రైతు అంతర్భాగం; రైతులో పొలం అంతర్భాగం. రైతు సొత్తు భూమి, దాని సొత్తు అతడు. ఇద్దరూ ఒకటే. రూపాలే వేరు' అనేవాడు విన్సెంట్.

వస్తుస్వరూపం కాక స్వభావం ప్రస్ఫుటం గోచరించేలా వేయడం అతడి మతం. ఆ కాలంలో అతడు వేసిన చిత్రాలలో "పొటాటో ఈటర్స్" అన్నది ప్రపంచప్రసిద్ధినందుకుంది. అక్కడ ఉండగానే, అతడు రెండవ సారిగా, ప్రేమించే హృదయాన్ని కోరి ప్రయత్నించి విఫలుడయ్యాడు.

ఆ అమ్మాయిపేరు కే. ఏడాది క్రితం ఆమె భర్త పోయాడు. ఆమె అక్కచెల్లెలు వరస అవుతుంది.

కే, విన్సెంట్ ప్రేమను తిరస్కరించింది. అతని తలిదండ్రులు మందలించారు; విన్సెంట్ మొండికెత్తాడు. ఆమె ఇంటికి వెళ్లాడు. తల్లిదండ్రులు. విన్సెంట్‌ను చివాట్లు పెట్టారు. కే, నిన్ను చూచి అసహ్యించుకుంటోందన్నారు...

విన్సెంట్ వెనక్కి తిరిగొచ్చాడు.

అస్థిమితమనస్కుడైపోయిన విన్సెంట్‌ను అతని సోదరుడు థియోవాన్‌గో, పారిస్ తీసుకెళ్లాడు. అతడు పారిస్‌లో ఒక చిత్రవిక్రయశాల ప్రధానాధికారి. విన్సెంట్ అక్కడ డీగాస్, సూరాత్, గాగిన్, లాట్రే (మూలా రూజ్) ప్రభృతి చిత్రకారులను కలుసుకున్నాడు. 'ఇంప్రెషనిజం' ప్రభావం క్రింద చిత్రరచన ఆరంభించినా, క్రమంగా అందులో తన స్వంతముద్ర ఉండేపద్ధతి అవలంబించాడు. విలక్షణం అనిపించిన అతని చిత్రాలు అమ్ముడుపోయేవికావు.



ప్రేమించే హృదయంకోసం పరితపించిన వాన్‌గో కొన్నాళ్లు క్రిస్టీన్ అనే వేశ్యను తన ఇంట ఉంచాడు. ఆమెను చూచి అనేకచిత్రాలు రచించాడు. (కర్క్ డగ్లస్, బ్రిటిష్ నటి పామెలా బ్రౌన్.)

# విన్సెంట్ వాన్గో

> ప్రఖ్యాత డచ్ చిత్రకారుడు విన్సెంట్ వాన్గో 1853 లో హాలెండ్, బ్రాబాంత్ రాష్ట్రంలోని 'గ్రూట్ జుండర్ట్' అనే గ్రామంలో జన్మించాడు. అతని తండ్రి మతాచార్యుడు.
>
> లలితకళల రాజధాని పారిస్ లో 'ఇంప్రెషనిజం' కాలు నిలదొక్కుకుంటున్న వేళ వాన్గో మరింతదూరం దృష్టి సారించగలిగాడు. 'చిత్రించే వ్యక్తి, లేక దృశ్యంయొక్క స్వరూపం కన్న, స్వభావం' మిన్న అని నమ్మి, ఆ అంశ ప్రస్ఫుటంగా గోచరించేలా చిత్రించడం అతడి మతం. అతడు బ్రతికి ఉన్న రోజుల్లో ప్రజలు ఆ చిత్రాలను ఆదరించలేదు; సాటి చిత్రకారులు ఆమోదించలేదు.
>
> చేవకి వేలుగా వాన్గో వేసిన చిత్రాలలో అతడు బ్రతికి ఉండగా అమ్ముడుపోయినవాటివల్ల గిట్టింది మొత్తం 30 పౌనులు. ఈనాడు అతని చిత్రం ఒకొక్కటి లక్షల పౌన్లు విలువ చేస్తుంది...
>
> కార్మికులు, కర్షకులు, గావికులు మొదలైన కష్టజీవులు, పేదలు ప్రధానంగా, దారిద్ర్యం అనే అతడు చిత్రాలు రచియించినా, ఈనాడు వాన్గో చిత్రం ప్రేలాడేది కోటీశ్వరుల ఇళ్ళలో; లేదా ఆర్టు మ్యూజియంలలో...
>
> వాన్గో 1890 జూలైలో ఆత్మహత్య చేసుకున్నాడు.

పల్లెటూరువళ్ళి విశ్రాంతి తీసుకుంటూ చిత్రరచన చేయవలసిందని థియో అతనిని దక్షిణఫ్రాన్సులోని ఆర్లె గ్రామానికి పంపాడు.

వాన్గో ప్రఖ్యాతికి కారణమైన విశిష్ట చిత్ర రచనాశిల్పం అతని కక్కడే అబ్బింది. అంతకుముందు వాడుతూ వచ్చిన ముదురాకుపచ్చవంటి 'చీకటి రంగులు' వదలిపెట్టి, కన్ను చెదరగొట్టే రకం పసుపు పచ్చ రంగు ప్రధానంగా ఆపల్లెలో దృశ్యాలు చిత్రించసాగాడు.

అక్కడ ఉండగానే, అతడి జీవితంలో ఉజ్వలఘట్టం (అదే ఆఖరుది) ఆరంభమైంది.

సుడిగాలి శక్తితో, గాఢమైన ఉత్సాహంతో, సూర్యుడి వేడి అంతటి ఉద్వేగంతో అతడు వందలకొద్దీ చిత్రాలు రచించాడు.

తిక్కమనిషి, ముక్కోపిఅయిన పాల్ గాగిన్ అప్పట్లోనే అతని సహవాసిగా ఉండడానికి వచ్చాడు.

వచ్చినరోజునే విన్సెంట్ వంటగది చూచి, "ఇందులో నీ చిత్రం వచ్చిన వన్నీ కలిపి తయారుచేశావు కాబోలు నీబొమ్మల్లో రంగుల్లా" అన్నాడు.

"నా రంగుల కేమొచ్చింది?" అన్నాడు విన్సెంట్.

"నువ్వింకా నిదానం ఇంప్రెషనిజంతో తంటాలు పడుతున్నట్టున్నావుగాని. లాభం లేదు. నీ తత్వానికి ఈ రంగుల మేళవింపుకి పొసగ లేదు" అన్నాడు గాగిన్.

ఆ క్షణంనుండీ చీటికీ మాటికీ ఇద్దరూ తరహాలో పోట్లాడుకు నేవారిద్దరూ. విన్సెంట్ చిత్రరచనపద్ధతి, అతని అభిమాన చిత్రకారుల పద్ధతులూ గాగిన్ కు గిట్టవు.

"అవన్నీ చెత్త. నాదగ్గర నేర్చుకో" అనే వాడు. నువ్వు ప్రకృతినిచూచి ముక్కకిముక్క కాపీ చేస్తున్నావు. అది తగదు." అన్నాడు.

ఒకరోజున ఇలా తగవులాడుకున్నాక గాగిన్ తేలిగ్గా నవ్వేసి, "సర్లె, నైట్ క్లబ్ కు వెళ్దాం పద. ఎవరైనా అమ్మాయిలుంటారు" అన్నాడు.

"అక్కడ 'రాకెల్' దొరికిపోతుం. ఆమె నా ప్రేయసి" అన్నాడు విన్సెంట్.

రాకెల్, క్లబ్ లో విన్సెంట్ ను ఆప్యాయంగానే పలకరించింది. "విన్సెంట్ నీ చెవి కోసిస్తావూ కానుకగా" అంది సరదాలో సరసంగా. "చేతనైతే తీసుకో" అన్నాడు విన్సెంట్.

అతను సరదాగా అనలేదు. తనను ప్రేమించే మనిషికి ప్రాణం ఇవ్వడానికి సిద్ధపడ్డమనిషి. జీవితమంతా వలచి వలపించుకునే వనితకోసం తాపత్రయపడి క్షోభపడ్డాడు. బ్రసెల్స్ లో ఉన్నప్పుడు, గర్భిణీ అయిన ఒక వేశ్యని చేరదీశాడు. చుట్టపక్కాలంతా నిరసించినా రెండేళ్ళు ఆమెతో ఉన్నాడు. ఆమెన్ని బొమ్మలు వేశాడు. చివరికామెకు విసుగెత్తి ఒకరోజున అతణ్ణి విడచిపెట్టి వెళ్ళిపోయింది...

ఇప్పుడు రాకెల్ ను ప్రేమిస్తున్నాడు. "నా అన్న మనుషులు— పెళ్లాం బిడ్డలూ, చిన్న ఇల్లూ ఉండి మకుటంలేని రాజులా బతికేవా డెంతధన్యుడో" అని మురిసిపోయే విన్సెంట్ ను మనసారా ప్రేమించినవారెవరూ లేకపోయారు.

మర్నాడు గాగిన్ తో మళ్లీ తగవులాట వచ్చింది. ఆవేశంలో, గాగిన్ ను చంపి వేయాలన్న ఉద్రేకంతో కత్తిపట్టుకుని అతని వెంటబడ్డాడు. గాగిన్ సకాలంలో అది గమనించి చివాట్లువేశాడు. విన్సెంట్ తనగదికి వెళ్లాడు. అతిక్రూలో, ఆవేశంలో మతిస్థిమితం చెడి, చెవికోసుకుని, దాన్ని తన ప్రేయసిరాకెల్ కు కానుకగా పంపాడు.

విన్సెంట్ కు మతిభ్రమణం కలిగిందన్నారు అంతా. స్థిమితంగా ఉన్న ఒక క్షణాన, థియో వచ్చి నచ్చచెప్పినమీదట, మతి చలించినవారిని ఉంచే విశ్రాంతి కేంద్రంలో చేరాడు విన్సెంట్.

అక్కడ మనసు ప్రశాంతంగా ఉన్నప్పుడల్లా అతడు చిత్రాలు వేసేవాడు.

ఉండుండి ఒకరోజున అతడి ఉద్రేకం చెలియలికట్ట తెగిపోయింది. పిస్టల్ సంపాదించి ఆత్మహత్య చేసుకున్నాడు. చనిపోయేముందు అతని సోదరుడు థియో వచ్చాడు. "అందరి మేలుకోరి ఈపనిచేశాను థియో" అన్నాడు విన్సెంట్ కళ్ళుమూస్తూ.

ఎం. జి. ఎం. వారు ఈ చిత్రకారుని గాథను "లస్ట్ ఫర్ లైఫ్" పేరిట సినిమాస్కోప్ లో వర్ణ చిత్రంగా నిర్మించారు.

చరాచరాలలోని చైతన్య ప్రవంతినిరంగుల మధ్య బంధించి వాటిని వెలిగించిన చిత్రకారుడుగా, ప్రేమించి ఆదరించేవారికై తపించి, దహించుకు పోయిన భగ్నహృదయుడుగా, కుటిలత్వాన్ని, కృత్రిమతను గర్హించిన వ్యక్తిగా విన్సెంట్ వాన్గోను దర్శకుడు విన్సెంట్ మినెలీ, నటుడు కర్క్ డగ్లస్ అద్భుతంగా చిత్రించారు.

పన్నెండువేల అడుగుల చిత్రంలో ఈ కథను కుదించడానికై, కొంత భాగాన్ని (పూర్వార్థంలో) తీసివేసినా ఈ చిత్రంలో ఎక్కడా ఆ వెలితి కనబడదు. ఈ చిత్రంలో అనేక ఘట్టాలు, మన అనుభవాలలాగే మనసుకు హత్తుకుని మరపుకు రావు.

వాన్గో చిత్రాలను రెండువందల పైచిలుకు వివిధ దేశాలలో ఛాయాచిత్రాలు తీసి, ఇందులో పొందుపరచారు. ఏ చిత్రాన్నీ ఐదారు క్షణాలకన్న ఎక్కువసేపు చూడడానికి వీలులేకపోయినా, ఆ కాస్సేపే చూచితీరాలనిపించేటంత ఉజ్వలంగా రంగు తెరమీద చూపించారు.

కొన్ని ఉత్తమ చిత్రాలను (పొలాలవంటివి) చూపినప్పుడు, వాటికి మూలం అనిపించే వాస్తవ దృశ్యాలు చూపి, వాటికవే ప్రతికృతులనిపించేవిధంగా పరిపోల్చి చూచి ఆనందించడానికి అనువుగా చిత్రించారు.

పాల్ గాగిన్ గా ఆంతోనీ క్విన్ నటించాడు. ఒకసారి తప్పక చూడతగ్గ చిత్రం.

★

(51-పేజీ తరువాయి)

డబ్బుపోని మాజిక్ నేర్చుకోబోతాడు. కథ ప్రకారం ఆ విద్య అబ్బుతుందో లేదోగాని వ్యక్తిగతంగా రమణారెడ్డి 'పనిలోపని' అన్నట్టు మాజిక్ నేర్చేసుకుంటున్నాడు. ఈ చిత్రంలో అతడూ, లక్ష్మీకాంత హుషారైన వేషాలువేసి హాస్యం సమకూర్చుతున్నారు.

శ్రీరంజని, అమర్‌నాథ్, కృష్ణకుమారి, సూర్యకాంతం, రాజనాల, బంగర గోపీనాథ్, మాస్టర్ బాలు నాగేశ్వరరావు మొదలగు వారంతా పాల్గొంటున్నారు.

రచన శ్రీశ్రీ, ఆరుద్ర, సంగీతం పెండ్యాల. నిర్మాతలు గోపాలరెడ్డి, పద్మనాభరావు.

వీరు గేవాకలర్‌లో ఒక నృత్యం చిత్రించ దల్చుకున్నట్టు తెలుస్తోంది.

## "శోభ"

మే పదవతేదీన పొన్నలూరువారి రెండవ చిత్రం "శోభ" నిర్మాణ కార్యక్రమం వాహినీలో ప్రారంభం అయింది.

రాజసులోచన ముక్కామల తొలిరోజు షూటింగ్‌లో పాల్గొన్నారు. కళాదర్శకుడు గోడగాంకర్, చూడ చక్కని కుటీరాలు మూడు నిర్మించి, చెట్లతో, మొక్కలతో సెట్‌ను శోభాయమానంగా అలంకరించారు.

దర్శకుడు కమలాకర కామేశ్వరరావు, సాయంత్రం కాల్‌షీట్ వేళ ముగిసేసరికల్లా 14 షాట్‌లు పూర్తిచేశారు, ఛాయాగ్రహణ దర్శకుడు డి. ఎల్. నారాయణ (అన్నయ్య)

ఈ చిత్రంలో అంజలి, ఎన్. టి. రామారావు నాయకీనాయకులు. రేలంగి, రమణారెడ్డి హాస్యం సరఫరా చేస్తున్నారు.

సంభాషణలు డి. వి. ("పెద్దమనుషులు") నరసరాజు వ్రాశారు. పాటలు, నిర్మాత వసంతకుమారరెడ్డి వ్రాశారు. గాయకుడు ఎ. ఎం. రాజా ఈ చిత్రంలో తొలిసారిగా సంగీతదర్శకత్వం నిర్వహిస్తున్నారు.

పొన్నలూరివారు ఇటీవల స్టుడియో నెలకొల్పడం విదితమే. అక్కడ ప్రస్తుతం ఒక "ఫ్లోర్" ఉంది.

"సెప్టెంబరు నెలాఖరుకల్లా రెండో ఫ్లోర్ నిర్మాణం పూర్తి అవుతుంది" అని చెప్పారు. వసంతకుమార్ రెడ్డి.

## ఎంగళ్ వీట్టు మహాలక్ష్మి

అన్నపూర్ణా పిక్చర్స్‌వారి తమిళ చిత్రం "ఎంగళ్ వీట్టు మహాలక్ష్మి" ("తోడికోడళ్లు" తమిళప్రతి) మే 11 న శతదినోత్సవాలు జరుపుకుంది. ఆరోజు సాయంత్రం మద్రాసు గెయిటీ థియేటర్‌లో జరిగిన ఉత్సవంలో ఈ చిత్రం నటీనటులంతా పాల్గొన్నారు. అన్నపూర్ణా పిక్చర్స్‌వారు, ఈ తమిళ చిత్రాన్ని కొని విడుదలచేసిన శ్రీ వెంకటేశ పిక్చర్స్‌వారూ కలసి ఈ పండుగపేరిట ఆ రోజు రాత్రి ఉడ్‌లాండ్స్ (మైలాపూరు) హోటలులో సన్మానసభ, విందు ఏర్పాటు చేశారు. నగరంలోని చలనచిత్ర ప్రముఖులంతా వచ్చారు. మద్రాసు మాజీ మేయరు శ్రీ రామనాథ అయ్యర్ అధ్యక్షత వహించి బహుమతులు పంచిపెట్టారు. ఉభయ సంస్థల అధిపతులూ పరస్పరాభినందన సూచకంగా రజత ఫలకాలు బహూకరించుకున్నారు. గెయిటీ థియేటరువారు కూడా నిర్మాతలకు కానుకలు చదివించారు.

ఈ తమిళ చిత్రంలో పాల్గొన్నవారికి—నాగేశ్వరరావు (ఆయన కారణాంతరాలవల్ల సభకు హాజరుకాలేకపోయారు), సావిత్రి, రంగారావు, తంగవేలు (రేలంగి భూమిక), రాజసులోచన, ఇ. వి. సరోజ, సుందరీబాయి (సూర్యకాంతం భూమిక), మాస్టర్ బాబు, దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు, రచయిత రాజేంద్రన్, సంగీత దర్శకుడు వేణు, ఛాయాగ్రహణ దర్శకుడు సెల్వరాజ్ లకు నిర్మాత శ్రీ మధుసూదనరావు బహుమతులు ఇచ్చి గౌరవించారు.



జై లక్ష్మీపిక్చర్స్ కార్యాలయావరణలో జరిగిన గోష్ఠికివచ్చిన కొందరు.

## "పెద్దరికాలు"
## వెండితెర నవల

సారథీ ఫిలింస్ వారు తమ క్రొత్త సాంఘిక చిత్రం "పెద్దరికాలు" కథను, చక్కగా విపులీకరించి దానికి చిత్రంలోని సంభాషణలూ, పాటలూ జోడించి వెండితెర నవలగా ప్రచురించారు. రచన నార్ల చిరంజీవి.

క్రౌన్ సైజు పుస్తకం. త్రివర్ణ ముఖచిత్రంతో ముఖపత్రాన్ని, చలనచిత్రంలోని ఛాయాచిత్రాలతో లోపలిపత్రాలనూ ఆకర్షణీయంగా తీర్చిదిద్దారు. చూడతగిన పుస్తకం.

వెల అరణాలు. దొరికే చోటు విశాలాంధ్ర ప్రచారణాలయం, బకింగ్‌హాంపేట, విజయవాడ-2.

## భారత రష్యాల సంయుక్తచిత్రం 'పరదేశి'

"నయాసహాన్సర్ ఇంటర్నేషనల్" పేరిట భారతీయ దర్శకనిర్మాత క్వాజా అహమద్ అబ్బాస్, సోవియట్ దర్శకుడు వి. ఎం. ప్రానిన్‌లు ఉభయదేశాలలోనూ భాగీదారులై నిర్మిస్తున్న చిత్రం "పరదేశి" మనదేశంలో స్వాతంత్ర్యదినం ఆగస్టు 15 న విడుదల అవుతుంది.

ఈ చిత్రాన్ని దక్షిణ భారతంలో విడుదల చేస్తున్న శ్రీ జైలక్ష్మీ పిక్చర్స్ అధిపతి శ్రీ నాగభూషణం మే 11 న జరిగిన విలేఖరుల గోష్ఠిలో ఈ విషయం ప్రకటించారు. తమిళనాడులో తమిళ భాషాప్రతినీ, మిగతా ప్రాంతాలలో హిందీ, ఇంగ్లీషు ప్రతులనూ విడుదలచేస్తారు. రష్యాలో ప్రదర్శనకై దీన్ని అక్కడ 14 భాషలలో డబ్ చేస్తున్నారు.

14 వ శతాబ్దిలో మనదేశం వచ్చిన రష్యన్ యాత్రికుడు అథనాసీనికితిన్ పర్యటన విశేషాలు ఆధారంగా, నిర్మాతలు ఈ చిత్రానికి ఇతివృత్తాన్ని రూపొందించారు. ఇందులో సోవియట్ నటుడు స్ట్రిజనోవ్, నర్గీస్, పద్మిని,

## శ్రీ మెయ్యప్పన్ ఇంట జంట వివాహాలు

ఎ. వి. ఎం. స్టుడియో అధిపతి శ్రీ ఎ. వి. మెయ్యప్పన్ తమకుమారుడికి, కుమార్తెకూ ఒకే ముహూర్తాన (మే పది ఉదయం 8-30 కు) వైభవంగా వివాహాలు జరిపించారు.

రెండు వివాహాలలోను శ్రీ మెయ్యప్పన్, తిరుచినాపల్లి కిచెందిన శ్రీ ఎం. ఎ. అరుణాచలంగారితోనే వియ్యమాడారు. తమ కుమార్తె సౌ॥ మీనను అరుణాచలంగారి కుమారుడు చి॥ వీరప్పన్‌కు ఇచ్చారు. ఆయన కుమార్తె సౌ॥ రంజనిని తమ కుమారుడు చి॥ మురుగన్‌కు చేసుకున్నారు.

మద్రాసు బాలాజీనగర్ లో మెయ్యప్పన్ స్వగృహంలోనే శుభకార్యాలు రెండూ జరిగాయి. "తిరుమైజ్ఞానం" శ్రీ నటరాజ సుందరం సోదరులు నాదస్వరం వాయించారు.

శోభయమానంగా అలంకరించిన వివాహ వేదికపై వధూవరులు కూర్చుని, పెళ్ళికి వచ్చిన పెద్దల ఆశీస్సులు అందుకొన్నారు.

దక్షిణ భారత చలనచిత్ర పరిశ్రమ ప్రముఖులందరూ కుటుంబసమేతులై వచ్చారు. క్రితంరోజు సాయంత్రానికే బొంబాయి ఫిలింపరిశ్రమ పెద్దలు పలువురు వచ్చారు.

సాయంకాలం విందు జరిగింది. ఆహ్వానితులంతా ఆశీస్సులతో, అభినందనలతో, ఘనమైన కానుకలతో వధూవరులను ముంచెత్తేశారు. రాత్రి శ్రీమతి ఎం. ఎల్. వసంతకుమారి గానసభ జరిగింది. ★



ఎ. వి. ఎం. స్టుడియో అధిపతి శ్రీ ఎ. వి. మెయ్యప్పన్ తమ కుమారుడికీ కుమార్తెకూ మే పది ఉదయాన వైభవంగా వివాహాలు జరిపించారు. (ఎడమనుండి వరుసగా): అల్లుడు శ్రీ వీరప్పన్; కుమార్తె సౌ॥ మీన, కోడలు సౌ॥ రంజని, కుమారుడు శ్రీ మురుగన్, మెయ్యప్పన్ దంపతులు.

## సంయుక్తచిత్రం పరదేశి

అచలాసచ్‌దేవ్, పృథ్వీరాజ్, బల్‌రాజ్ సాహ్నీ, జైరాజ్, మొదలైన భారతీయ నటీనటవర్గం పాల్గొంటున్నారు. అనిల్ బిశ్వాస్ దీనికి సంగీతం సమకూర్చారు. కళాదర్శకుడు కౌసూదేశాయి. ఛాయాగ్రహణం ఆంద్రేకొనిక్, రామచంద్. నృత్యదర్శకుడు చిమక్‌సేక్.

ఈ చిత్రాన్ని, కథను సంబంధించిన యథార్థస్థలాలలోనే చిత్రించాలన్న సంకల్పంతో, 'నయాసన్సార్' బృందం మన దేశం అంతా పర్యటించి అనేక ప్రాంతాలలో ఔట్‌డోర్ దృశ్యాలు చిత్రించారని, అలాగే రష్యాలో కూడా, చారిత్రికాధారాలను పురస్కరించుకొని ఆయా ప్రాంతాలలో కథను చిత్రించారని నాగభూషణం చెప్పారు. సోవ్‌కలర్, వైడ్‌స్క్రీన్ (మనకిదే తొలిసారి) చిత్రంగా తయారవుతున్న "పరదేశి" నిర్మాణానికి దాదాపు కోటి రూపాయలు ఖర్చు అయినట్లు ఆయన తెలియచేశారు.

శ్రీ పి. వి. సుబ్బారాయుడు వందనసమర్పణ చేశారు. ★




Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad.


చూడండి! సన్‌లైట్ సగంబిళ్ల మాత్రమే
ఈ బట్టలన్నిటిని ఉతికింది!
అట్లు చేసినట్టిది దాని అధికమైన నురగ!
SUNLIGHT SOAP
సన్‌లైట్ సబ్బు బట్టలను
తెల్లగాను, కాంతివంతముగాను ఉతుకును
S. 248-X52 TL